శ్రీః



చిత్రముల

# తిరుప్పావై


**1953**

*Published by*

Sri C. ANNA RAO, B.A.

*(Exccutive Officer)*

*on behalf of the Board of Trustees of*

*Tirumalai-Tirupati Devasthanams,*

**TIRUPATI**

చిత్రముల

# తిరుప్పావై

యను ప్రాబోధిక గాథాత్రింశత్తు


మహామహోపాధ్యాయ

శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుగారిచే

రచియింపబడిన యాంధ్ర వ్యాఖ్యానముతోను

తత్పౌత్రుడగు

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిచే

వ్రాయబడిన ప్రతిపదార్థముతోను గూడియున్నది



ప్రకాశకులు :

తిరుమల - తిరుపతి దేవస్థానము, తిరుపతి

1953

*Copies can be had from :*

1. The Executive Officer,
T. T. Devasthanams, Tirupati
2. Tirumalai Tirupati Devasthanams
Information Service,
19, Royapettah High Road, Madras-14.
3. Tirupati Devasthanams Information Service,
National Indian Life Insurance Building,
Bank Street, Hyderabad, (Deccan).

PRINTED AT:
T. T. D. PRESS
TIRUPATI

శ్రీః
శ్రీదేవ్యై నమః శ్రీగోదాదేవ్యై నమః
శ్రీ శ్రీనివాసపరబ్రహ్మణే నమః
శ్రీమతేరామానుజాయ నమః

# పీఠిక

'తిరుప్పావై' అనునది యొక యుత్తమోత్తమమగు దివ్య ప్రబంధము. ఇది యొక యుత్తమమైన ధ్వనికావ్యమని చెప్పవచ్చును. పరబ్రహ్మస్వరూప - తత్ప్రాప్తి - తదుపాయబోధకములగు నుపనిషత్తుల సారమని చెప్పనగును. ముప్పది పాశురములలో సకలపరమార్థతత్త్వ రహస్యములు బోధింపబడియున్నవి. శ్రీ భగవద్రామానుజులవారు యెల్లప్పుడును యీ ప్రబంధమును ననుసంధించుచుండువారట. అందు చేతనే వారికి 'తిరుప్పావై జీయర్' అని ప్రసిద్ధికలిగినదట.

దీనిననుగ్రహించినవారు పరమవైదికశ్రేష్ఠులగు శ్రీ పెరియాళ్వార్ల ముద్దుబిడ్డయై నిసర్గసిద్ధములగు పరభక్తి - పరజ్ఞాన - పరమభక్తులు కలిగి భగవదేకప్రవణయై శ్రీ రంగనాథుని చెట్టపట్టిన శ్రీ ఆండాళమ్మవారు.

శ్రీ పెరియవాచ్చాన్ పిళ్లై, శ్రీమదళగియమణవాళప్పెరుమాళ్ నాయనార్ మొదలగు నాచార్యులనేకులు తిరుప్పావునకు వ్యాఖ్యానముల ననుగ్రహించిరి. ఇంక ననేకులు టీకలను స్వాపదేశములను ప్రసాదించిరి. అనేక భాషాంతరములలోనికి యీ ప్రబంధము గద్యపద్యాత్మకములుగా ననువదింపబడినది. దీనియందలి రసభావవిశేషముల ననుసరించిన చిత్రములతో గొందరు ముద్రించియున్నారు.

ఈమధ్యను తిరుమల-తిరుపతి దేవస్థానముల నిర్వాహకులు మిక్కిలి యాకర్షణీయములగు వర్ణచిత్రములను బొందుపరచి తిరుప్పావును ద్రావిడములో ప్రతిపదార్థతాత్పర్యములతో ముద్రింపించి ప్రచురించియున్నారు. అట్లే దీనిని తెలుగుప్రతిపదార్థతాత్పర్యములతో ప్రచురించదలంచి యట్టి గ్రంథమును వ్రాయించవలసినదని నన్ను కోరిరి. మా పితామహులగు మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలు గారు వ్రాసి ౮౦ సంవత్సరములకుపూర్వము అచ్చువేయించిన యట్టి గ్రంథము కలదనియు దానినే తిరిగి చిత్రములుచేర్చి ముద్రించవచ్చు ననియు నే నంటిని. దానిని వారంగీకరించి దానినచ్చువేయించిరి. ఇది ప్రాయికముగా శ్రీ పెరియవాచ్చాన్పిళ్లైగారి ద్రావిడవ్యాఖ్యానము ననుసరించి యచ్చతెనుగుభాషలో వ్రాయబడినది.

విజయసం॥ర కార్తిక బహుళ విదియ } శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి.



# ప్రాబోధికగాథాత్రింశద్వ్యాఖ్యానము



**దేహాత్మాభిమానులకు, నాత్మతత్త్వజ్ఞులకుం** బర్వతపరమాణువుల యంతరమువంటి వాసి గలదు. ఆత్మతత్త్వజ్ఞులకును, పరభక్తినిష్ఠులకు నట్టి వాసియే కలదు. పరభక్తినిష్ఠులకును, మంగళాశాసనపరులకు నంత వాసి గలదు. అందును 'అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే' (మాణ్డూక్యము) అనుచొప్పున ననాది సంసారసుప్తుండై పుట్టి, కొంతకాలంబున నీశ్వరకృపాలబ్ధ తత్త్వజ్ఞానంబున మేల్కాంచు వారికంటెను 'బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః' (రామా — బా) అను చొప్పునం జిన్ననాటనుండి భగవద్గుణరసావగాఢయై తానే యీశ్వరుని లేపు ననుసంధానంబుతో నుండి, పురుషుల పురుషస్నేహంబుకంటెను స్త్రీల పురుషస్నేహంబు సరసంబగుట నీశ్వరునియెడం బరమభక్తిగల యాండాళొనరించిన తిరుప్పావై యను ద్రవిడప్రబంధమునకు హృదయం బేమన్నను —

ధనుర్మాసస్నానవ్రతవ్యాజంబున నీశ్వరసన్నిధికేగి నీకు శేషంబగు నీ యాత్మ యనర్థంబులం బడకుండ స్వరూపానురూపంబగు కైంకర్యం బొసంగి యది యావదాత్మభావిరసపర్యవసితంబగునట్లు కృపసేయవలయు నని యపేక్షించుట. ఈవ్రతంబు హోళాకాధికరణన్యాయంబున శిష్టాచార సిద్ధము. 'మేలైయార్ శెయ్వినైకళ్' అని (పూర్వులు సేసిన పనులని) యిందే చెప్పంబడంగలదు. నోము నోచెదనని యసత్యం బాడం గూడునా యన్నను 'వివాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే। విప్రస్య చార్థే హ్యనృతం వదన్తి పంచానృతాన్యాహు

రపాతకాని ॥' (భారతము) అని పెండ్లి, రతి, ప్రాణభంగము, సర్వధన భంగము, బ్రాహ్మణకార్యము అను నీ విషయంబుల ననత్యంబు పాత కంబు గాదండ్రు. ఇట్లుండం బ్రాణభంగపర్యంతంబగు దశం జేసిన యనుకారంబు గావున నది దోషావహంబు గాదు. అది యెట్లనిన.

[1]ఈబిడ యవతరించి యెదుగుచున్నకాలంబునం బెరియాళ్వారి కూతురగుటయును, సహజస్వభావంబుంబట్టియు జ్ఞానభక్తిపరీవాహం బుప్పొంగుచుండ, 'పతిసంయోగసులభం వయో దృష్ట్వా చ మే పితా। చిన్తార్ణవగతః పారం నాససాదాప్లవో యథా॥' [రా—అ] అన్న చొప్పునం దీగ యుపఘ్నంబుం జేరునట్లొక్క పురుషునిం గూడుటకు నీడగు నీడొనగూడుటయు, 'మానిడవర్క్కెన్ఱు పేచ్చుప్పడిల్ వాళ కిల్లేన్' (నా—తి) అని — మనుష్యులకను శబ్దము చెవిం బడినను మనలేని స్వభావంబుగలిగి, 'కోల్ తేడి యోడుమ్ కొళ్ళున్దదే పోన్ఱదే మాల్ తేడి యోడుమ్ మనమ్' [మూ—తి] అన్నచొప్పున నుపఘ్నంబు వెదకి సాగు తీగకొన చందంబున నీశ్వరుని వెదకి పరతెంచు డెందంబు నభినివేశంబున వటపత్రశాయి యను తన్మూర్తితో సంశ్లేషంబు సేయ వేడ్క పొడమిన నది యర్చావిగ్రహంబగుట ననుపపన్నంబగుటయు, మిక్కిలి యవసన్న యయి, యీశ్వరునితో సంశ్లేషంబుం బొదినవారలు కలరో లేరో యని విమర్శించి కృష్ణావతారంబున గోపికలు యథేష్టానుభవలాభంబుం బెందుట తలంపునం దవుల నది కాలాన్తరవృత్తంబగుటయుం దత్పదాజ్కిత ప్రదేశ తదవగాఢయమునా తదుద్ధృతగోవర్ధనాదులం గాంచియేనియు ధృతిం బెందుటకు నంత దూరంబునకేగ బలంబు లేమియుం దలపోసి యత్యన్తఖిన్నయై, జనకపుత్రీ నీళలకు విల్లెక్కు పెట్టుట, వృషభంబుల నొంచుట యట్ల యొక్క యవధియుం గానక ధృతిం బూనలేనిచో—

రాసగోష్ఠియందు శ్రీకృష్ణుండును గోపకన్యలునుం గూడినచో రసపూరంబు మీరం బారవశ్యంబుం గాంచి, యది యత్యుత్కటంబగు

నెడం జేడ్వడుట యగునని యా రసంబు మార నతండు కన్నారంగినం గన్యకలు విరహవ్యథాభరంబున 'దుష్టకాళియ తిష్ఠాత్ర కృష్ణోఽహమితి చాపరా' [వి. పు. ౫ అ.] అన్నచొప్పున కాళియమర్దనాది కృష్ణ చేష్టితానుకారంబులం జిత్తధారణంబు చేసిరని కొందఱు ధార్మికుల పలుకు లాలకించి, తాను వారల యనుకారంబున సైరణం జెందం జూచె నింతియ.

ఈబిడ బ్రాహ్మణిమైయును యాగప్రవృత్తులు దీక్షావసానంబగు నందాక దేవదత్తాది నామంబులు విడిచి యజమానాధ్వర్యుహోత్రాది నామంబులే చెందునట్లును, నాటకప్రయోక్తలు రామాదిరూపంబులే యగునట్లును, శ్రీవిల్లిపుత్తూరను తన పురంబే వ్రేపల్లెయు, వడపెరుంగో యిలను దేవప్రాసాదంబే శ్రీనందగోపభవనంబు, నందుం బవ్వళించి యున్న మూర్తియే శ్రీకృష్ణమూర్తియనియు భావింప నబ్భావన యుత్కటంబై యనుకారంబు గాఢంబుగా నడ నుడుపు క్రొమ్ముడియు వాసనయుం జేతలును వ్రేతెల రీతి విఖ్యాతంబయ్యెనట.

శ్రీవల్లభుండైన సర్వేశ్వరుండు తొల్లి నష్టంబగు జగము కృప చేత సృష్టిం జేసి యాత్మలకుం గరణకళేబరంబుల నొసంగి, స్వశాసనం బగుట శాస్త్రమనంబడు వేదములం దన్నుఁ జేరుటవరకుం గల మేల్లకు సాధనంబుగాఁ జూపి యిడీన, దాని గణింపక దుర్విషయముల మునింగి బ్రుంగుదశలం దా నంశంబున నవతరించి, సౌందర్యశీలాదిగుణంబులచే సాధుజనంబుల నెల్ల సంగ్రహించికొనువాఁడు గాన వ్రేపల్లెలో శ్రీకృష్ణుండై యవతరించి, తన గుణచేష్టితంబులచే జన్మాంతరీయమహా భాగ్యసంపన్నసౌజన్యలగు గోపకన్యల లీలారసంబుల నన్యప్రావణ్య ధన్యలం జేయ, వారలు నెదగుచు నిందుప్రాయంబగుచున్న కాలంబున, నీతని తత్త్వంబెఱుంగని గోపవృద్ధులెల్లం గూడి, కృష్ణుండు ధూర్తుండై యున్నవాఁ డిఁక నీ పడుచుల నాతని కంటం బడకుండం గాపాడవలయునని

గృహాభ్యంతరంబులనే యున్నం దద్భాగ్యవశంబున వర్షప్రతిబంధంబు గలుగ, గోపవృద్ధు లిచ్చటి పిన్నపడుచులు నోము నోచిన వర్షంబు గలుగునను ప్రాచీనాచారముంబట్టి యియ్యూరనున్న పడుచులెల్ల నోము నోచవలయు, నిందు కిందలి యధిపతియగు శ్రీ నందగోపుని కుమారుండు సాధనంబుల ఘటింపంజాలు నని నిష్కర్షించి, వారల కట్లు విధించి, కృష్ణునిం దద్ఘటకునిగా వేడ, నతం డిది నావంటిబాలురకు దుశ్శకం బన, నట్లుసేయక తప్పదని వీరలెల్ల నిర్బంధింప, నెట్టకేలకియ్యకొనినం బడుచులం బిలిచి నోము నోచునట్లు విధించి, యిందుకు వలయునవియెల్ల నీ కృష్ణుండు ఘటించునని యాతని కొప్పగించి గోపవృద్ధులు దమపనులకుం బోవ, పడుచులుం గృష్ణుండును గూడి, యా రాత్రిం గొనియాడిరి. ఇంక నాలస్యంబు గలుగునట్లు జాగుసేయం గూడదు ; ఇప్పుడు మన మందఱముం బోదము ; అపరరాత్రిని నోమునకు స్నానంబుసేయుటకు వచ్చి లేపుఁడీ యని యానతిచ్చి, శ్రీకృష్ణుఁడు నీళాగృహంబుం జొచ్చి యానందింపుచుండె. పడుచులుం గూడ నడచి తమతమయిండ్లఁ జొచ్చి, పవ్వళించియుం గన్నుమోడ్చియు నిద్దురపట్టకయు కొండొకదడవున మున్నుగా లేచినవారలు వచ్చి, కృష్ణగుణచేష్టితస్మరణానందంబున లేవం జాలక పన్నుండినవారిని వేఱువేఱుగ లేపి, యందఱును శ్రీ నందగోపభవనంబున కేతెంచి, శ్రీకృష్ణుని మేల్కొలిపి, తమ వాస్తవాభీష్టంబు వేడి, 'యావదావర్తతే చక్రమ్' (రా. యు.) అని శ్రీ భరతుం డీకాల చక్రంబు తిరుగునందాక మమ్మేలుచుండుమని శ్రీరామస్వామి పాదంబులం బడి వేడినట్లు, నర్జునుండు భగవద్గీతాషట్కత్రయంబున సంశయములం దీర్చికొనుచుం జరమశ్లోకశ్రవణంబున నిస్సంశయుండై కృతకృత్యుండగు నట్లును, నోము నోచుటవేర పరబ్రహ్మసంశ్లేషానందానుభవంబను పరమోద్దేశ్యముం జెంది కృతార్థలగుచున్నారు.

విరహోత్కలగు స్త్రీలు నాయకుండు లజ్జించుటకై 'మడలూర్కై' అను నొక్క లోకాపవాదజనక సాహసవ్యాపారంబు సేయుట ద్రవిడదేశ ప్రసిద్ధము. అంతకంటెను రాజమహిషి యుంఛవృత్తిచేసి జీవించుట రాజున కవద్యావహంబగునట్లు వ్రతోపవాసకర్శితలై పర్జన్య ప్రార్థనారూపంబగు నీ నోము సేయుట న్యూనతావహంబు గాన ఫలసిద్ధి తప్పదని తలంచుచున్నారనియు, మఱియు శ్రీకృష్ణుని ధూర్త చేష్టితంబులం జూడ నతం డతిసాహసంబు చేయు నను భయంబున నిందు సాహసవ్యాపారంబులు సేయుతలంపునకు నవకాశము లేదనియు నాలంకారికులు సెప్పుదురు.

ఉద్దేశ్యం బొండయినచోఁ బర్జన్యుండు వర్షం బెట్లు కురిపించు నన్నను వ్రతోపవాసకర్శితంబులగు శరీరంబులం జూచిన గురిపింపకుండం జాలునే, చేతనుండు గాఁడే, యని తలంచి రని ప్రాచీనులు సెప్పుదురు. పరమోద్దేశ్యంబు వేఱైనను వర్షము తత్సాధనము గావున నదియు నుద్దేశ్యంబగుటకు బాధకము లేదు. అది యెట్లుసినను—ఈ నోమువలన వర్షము గురియనిచో వెండియు గోపవృద్ధు లిట్టిపని కవకాశమిడుదురె? అట్లైనచో వెండియు సంశ్లేషంబున కడ్డము సంభవింపదే? ఇట్టి సంశ్లేషంబునకై వర్షప్రతిబంధం బొనరించిన జన్మాంతరసుకృతవిశేషం బింక సంశ్లేషప్రతిబంధంబు రాకుండ వర్షంబుం గురిపింపంజాలదే? యని యెఱుంగునది.

—(o)—



నమః పరమ ఋషిభ్యః

శ్రీ పరాశరభట్టార్యకృతమగు శ్లోకము

నీళాతుఙ్గస్తనగిరితటీసుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధమధ్యాపయన్తీ।
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥

నీళాతుఙ్గస్తనగిరితటీసుప్తమ్ = నీళాదేవి యున్నత స్తనంబులను కొండల ప్రదేశంబున నిద్రించిన, కృష్ణం = కృష్ణుని, ఉద్బోధ్య = మేలుకొల్పి, శ్రుతిశతశిరస్సిద్ధమ్ = ఉపనిషత్సిద్ధమయిన, స్వం పారార్థ్యం = తన శేషత్వమును, అధ్యాపయన్తీ = తలంపింపుచు, స్వోచ్ఛిష్టాయాం స్రజి = తనవినియుక్తశేషంబయిన పూలదండయందు, నిగళితం = బద్ధుఁడైన యాతనిని, బలాత్కృత్య = నిర్బంధించి, యా గోదా = ఏ గోదాదేవి, [చూడికొ్కొడుత్తనాచ్చియార్] భుఙ్క్తే = అనుభవింపుచున్నదో, తస్యై = ఆమెకొఱకు, ఇదమిదం నమః = ఈ యీ నమస్కారము, భూయ ఏవ భూయః = మాటిమాటికిని, అస్తు = అవుగాత.

ఈ శ్లోకమున భట్టరు తిరుప్పావై యొక్క తాత్పర్యమును సంక్షేపముగా సెప్పి శ్రీ ఆండాళును శరణచొచ్చుచున్నారు. కృష్ణుని ప్రేమించి అతని కైంకర్యంబున దనకుండు నాసక్తిని వెల్లడించి తాను ధరించిన పుష్పమాలతో నా స్వామిని నిగళబద్ధుని జేసి యనుభవించిన గోదాదేవిని నమస్కరించుచున్నా ననుచున్నారు.

'స్వం పారార్థ్యం అధ్యాపయన్తీ' యని భట్టరు చెప్పుటకు తాత్పర్య మేమనగా పూలదండల నలంకరించుకొని సమర్పించిన యుజ్జ్వలవల్లి పుష్పమాలతోపాటు మంచి పాశురముల మాలికనుగూడ సమర్పించె ననుట.

వేకువను లేచి ముప్పది పాశురములను అనుసంధించవలెను; ఇది సాధ్యముకానిచో "శిఱ్ఱమ్ శిరుకాలే" అను పాశురమునైనను అనుసంధించవలెను; ఇదికూడ సాధ్యముకానిచో మనయొక్క శేషత్వమునైనను తలంచుకొన వలయునని భట్టరు యుపదేశము.





ఉయ్యక్కొండా రానతిచ్చిన తనియన్ పాశురములు

అన్నవయల్ పుదువై యాణ్డాళ్ అరఙ్గఱ్కు,
ప్పన్ను తిరుప్పావై ప్పల్పదియమ్, ఇన్నిశైయాల్
పాడిక్కొడుత్తాళ్ నఱ్పామాలై, పూమాలై
శూడిక్కొడుత్తాళై చ్చొల్.

అన్నవయల్ పుదువై యాణ్డాళ్ = హంసలతోనున్న చేలుగల శ్రీవిల్లిపుత్తూరి గోదాదేవిని, అరఙ్గఱ్కు = శ్రీరంగనాథునకు, పన్ను = విమర్శింపదగిన, తిరుప్పావై = తిరుప్పావై యను ప్రబంధమును, పల్పది యమ్ = పెక్కు పాశురములుగా, ఇన్నిశైయాల్ = మధురగానమున, పాడి = పాడి, కొడుత్తాళ్ = సమర్పించిన యాబిడను, నఱ్పామాలై పూమాలై = మంచి పాశురములమాలిక యను పూలదండను, శూడి క్కొడుత్తాళై = అలంకరించికొని సమర్పించిన యాబిడను, శొల్ = స్తుతింపుమా.

శూడిక్కొడుత్త శుడర్ క్కొడియే, తొల్‌పావై
పాడి యరుళవల్ల పల్ వళై యాయ్, నాడి నీ
వేఙ్గడవఱ్కెన్నై విది యెన్ఱ విమ్మాత్‌ఱమ్,
నాఙ్గడవావణ్ణమే నల్‌గు.

శూడిక్కొడుత్త శుడర్ కొడియే = పూలదండల నలంకరించికొని సమర్పించిన యుజ్జ్వలవల్లి, తొల్ పావై పాడి యరుళవల్ల పల్ వళై యాయ్ = పురాతనచ్ఛన్దోబద్ధంబగు తిరుప్పావై యను ప్రబంధంబును బాడి కృపసేయంజాలు బహుకఙ్కణాలఙ్కార యగు శ్రీగోదాదేవీ, నీ = నీవు, నాడి = ఉద్దేశించి, వేఙ్గడవఱ్కు = శ్రీవేంకటేశ్వరునకు, ఎన్నై = నన్ను, విది = శాసింపుమీ, ఎన్ఱ ఇమ్మాత్‌ఱమ్ = అను నీ సూక్తిని, నామ్ = మేము, కడవావణ్ణమే = మీఱని విధమునే, నల్‌గు = కృపసేయుమీ.





'నీరాడ ప్పోదువీర్ ! పోదుమినో......
నారాయణనే నమక్కే పఱై తరువాన్'
పారోర్ పుగఴ ప్పడిన్దు



# 1

ఈ నోమున కనుకూలంబగు కాలంబు నిట్లొనగూడుననే
యనికాలమును గొనియాడుచుం
బ్రాప్యప్రాపకసంగ్రహంబు సేయుచున్నారు.

మార్గఴి త్తిఙ్గళ్ మదినిఱైన్ద నన్నాళాల్ ;
నీరాడప్పోదువీర్ ! పోదుమినో, నేరిఴైయీర్ !

శీర్మల్గుమ్ ఆయ్ప్పాడి చ్చెల్వ చ్చిఱుమీర్కాళ్ !
కూర్వేల్ కొడున్దొఴిలన్ నన్దగోప఩్ కుమర఩్,

ఏరార్న్ద కణ్ణి యశోదై యిళఞ్చిఙ్గమ్,
కార్మేని చ్చెఙ్గణ్ కదిర్మదియమ్బోల్ ముగత్తా఩్

నారాయణనే నమక్కే పఱై దరువా఩్,
పారోర్ పుగఴప్పడిన్దేలోరెమ్బావాయ్.

సీర్ ఇళైయార్ : విలక్షణాభరణలారా

శీర్ మల్గుమ్ ఆయ్ప్పాడి శెల్వ చ్చిఱుమీర్కాళ్ : సంపత్తిచేత సమృద్ధమైన వ్రేపల్లెలోని సంపదగల పిన్నపడుచులారా,

మార్గళి త్తింగళ్ : మార్గశీర్ష మాసమున

మదినిఱైన్ద నన్నాళాల్ : చంద్రుడు పూర్ణుండై యున్న మంచి దినమందు

కూర్వేల్ కొడున్దొళిలన్ : తీక్ష్ణమైన బల్లెము గలిగి క్రూరవ్యాపారుడైన

నన్దగోపన్ కుమరన్ : నందగోపాలుని కుమారుడును

ఏరార్న్ద కణ్ణి : సౌందర్యము నిండియున్న కన్నులు గల

యశోదై ఇళమ్శింగమ్ : యశోదాదేవియొక్క బాల సింహమును

కార్ మేని : మేఘముం బోలిన మేనిగల

శెజ్గణ్ : ఎఱ్ఱని కన్నులు గల

కదిర్ మదియమ్బోల్ ముగత్తాన్ : సూర్యునిం జంద్రునింబోలిన మొగము గలవాడును

నారాయణనే : సర్వస్వామియగు శ్రీకృష్ణుండే

నమక్కే : మనకే

పఱై తరువాన్ : వాద్యవిశేషం బొసంగువాడు (గా నున్నాడు.)

పారోర్ పుగళ : లోకమువారలు కీర్తింప

పడిన్దు : ఈనోములో నవగాహించి.

నీరాడప్పోదువీర్ పోదుమినో : తీర్థమాడవచ్చువారలు రండీ

ఏలోర్ : (పాదపూరణము)

ఎంబావాయ్ : మా నోమనిగాని మా ఛందంబనిగాని చెప్పవచ్చును.

మార్గశీర్ష త్రైజల్ — 'నాతిశీతా న ఘర్మదా' యన్న చొప్పున సత్యుష్ణంబు నతిశీతంబుం గాక, దినములో బ్రాహ్మ ముహూర్తం బట్లు సంవత్సరములో సత్త్వోత్తరంబై 'మాసానాం మార్గశీర్షోఽహమ్' (భ. గీ.) అని యీశ్వరుండు మాసములలో మార్గశీర్షంబు దానే యనుటచే వైష్ణవంబై సర్వవస్తువులు సంకురించు కాలముగాన మన యున్మేషంబున కర్హంబై గోపవృద్ధులు చలికిఁ బెదరి వెలువడలేమిని మనకుద్దేశ్యంబైన కాలము. కాలమును గొనియాడుట యేమన్నను, శ్రీరామపట్టాభిషేకంబు సేయందలంచి, 'చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః' (రా. అ.) అని శ్రీరామదేవుం డింద ఱిలోఁ బ్రిథముండగునట్లు మాసములకుఁ బ్రిథమంబై, సర్వసుఖప్రిద త్వంబున నాతండు రాజగునట్లు మాసరాజంబై, యభిషేకమనోరథసమ యమునసే సంనిహితంబై, 'పావనః సర్వలోకానామ్' అనంబడిన యాతఁడట్లు పావనంబై, 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అని లోక దృష్టిచిత్తాపహారియగు నాతండు సువర్ణకిరీటంబు దాల్చి భోగ్యుండగు నట్లు తాను పుష్పశేఖరంబు దాల్చి భోగ్యంబై పట్టణంబువలె నలంక రించువారి యపేక్షలేక యయత్నసిద్ధాలంకారంబై యున్నది మాసంబని యిట్లు చైత్రమాసముం బొగడినట్లు కాలముం బొగడుచున్నారు. అందు శేషభూతులు శేషిని లభింపం గొనియాడుట; ఇందు శేష భూతుల శేషి లభింపం గొనియాడుట యను నింతియ విశేషము.

మదినిరైన్ద — మాసం బొనగూడినట్లు, 'ఆపూర్యమాణపక్షే' యని శుభకార్యంబులు సేయుటకు విహితంబై యొండొరుల మొగంబులం గాంచి యుల్లసిల్లుటకు నందఱుం గూడి చని శ్రీకృష్ణుని లేపుటకును వెన్నెలగల దినం బొనగూడెనే యనికొనియాడుట. 'విధయశ్చ వైదికాస్త్వదీయగంభీరమనోఽనుసారిణః' (ఆ. స్తో.) అని భగవద్భక్తు లగువారి సంకల్పమును వేదవిధులు తామె వెంబడించునని జెప్పంబడినది

గదా! వేదవిధులకు విరుద్ధముగా నడచువారలు భగవద్భక్తులు గారని యిందువలననే తెలియవచ్చును. నిరోధించువారలే విధింపుచున్నారు గాన, 'నల్లిరుళ్ కళ్' అని (మంచిచీకటులని) చీకటులం గొనియాడ నక్కఱలేక వెన్నెలం గొనియాడుట గలిగినది.

నల్ నాళాల్ — మాసంబునకుం బక్షంబునకును నాయకరత్నంబు వలెం జేకూడినది. 'అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా' ( వి ౫-వ అ. ) అని కంసుని యన్నంబునం బెరిగిన నాకు జన్మసాఫల్యంబు గలుగునట్టిట్టి సుప్రభాతంబు లబ్ధం బయ్యెనే యని యక్రూరుండు కొనియాడునట్లు మనకుం గృష్ణునిం జేరనీనివారు తామే చేరుటకుం బ్రమాణం బిచ్చినదినంబయ్యెనే యని యగ్గింపుచున్నారు. ఈశ్వరునకుం బ్రతికూలుండై, 'క్షిపామి' యని యాతండు పరిహరించుటకుం బాత్రంబగుటం దక్కి యాతండు రక్షకుండని నమ్మి 'దదామి' యని యాతం డభయం బొసంగునట్లు తత్ప్రసాదపాత్రంబగుటకుం దగుటయే కదా దినమునకు మంచితనము. ఇట్లు మాసపక్షదినంబులం గొనియాడుట ప్రాప్యరుచివైభవంబని యెఱుంగునది.

నీరాడ — కృష్ణవిరహమునం గలిగిన తాపము దీరునట్లు కృష్ణ సంశ్లేషంబు సేయునని హృదయము. 'ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్' అని భగవత్సంశ్లేషంబునకు గ్రీష్మకాలమునందలి చల్లని మడువు దృష్టాంతము సేయంబడినది గదా. యథేష్టముగాం జెప్పుటకుం దగిన బాంధవంబు గలిగియుండినను భగవత్సంబంధప్రయుక్త గౌరవంబున స్నానము సేయననుచోం దీర్థమాడననుట. 'పొయ్ న్నా మఱైక్కయమ్ నీరాడప్పోనాళ్' (తి. నె.) పుష్కరిణికిం దీర్థమాడం బోయినదని కూతురి నుద్దేశించి తల్లి చెప్పినది గాన, నెట్టివారినేనియు భగవత్సంబంధముం దలంచినప్పుడు గౌరవంబు సేయంగూడునని యెఱుంగునది.

అల్పఫలంబులగు స్వర్గానుభవాదులకు నధికారంబు గలుగం
జేయు కృత్యంబులు పెక్కులు గావలయుం గదా ? ఇట్టి నిరవధికసంపదం
జెందుట కెంత యోగ్యతవలయునో యన్నను—

పోదువీర్ పోదుమినో — ఇచ్ఛయే యధికారము. అదియే
బహుసుకృతపరిపాకంబు గావున, నది గలిగినచో సాధనసంపదయుం
గ్రమంబునం జేకూఱును. అల్పవిషయంబుల నిచ్ఛసులభము. ఫల
సిద్ధి యతిప్రయాససాధ్యము. అపరిచ్ఛిన్న విషయంబున నిచ్ఛయే దుర్ల
భంబు, అటుపయి ఫలసిద్ధి సులభంబు. చిరకాల మట్టి యిచ్ఛ
లేకయేకదా మన మిందుకుం జెడినది. ఫల ప్రదునియెడ శక్తి
యుం బ్రాప్తియుం బూర్ణంబులు గాన, నిచ్ఛ యొక్కటియే చాలును.
క్షుద్రవిషయానుభవంబున కేకాకిత్వంబట్లు మహావిషయానుభవంబునకు
సహాయ మపేక్షితము గాన, సహకారులం బిల్చుచున్నారు. పోదు
మినో — ప్రతికూలుర సైతము 'తేన మైత్రీ భవతు తే యది జీవితు
మిచ్ఛసి' (రా. సు.) యని బ్రతుకువలచితేని యీశ్వరునియెడ నాను
కూల్యంబు సేయుమనునామె తెగవారు అభిముఖులం గాంచిన విడుతురే.
పోదుమినో — వెలువడి మీరు మున్ను నడచుచో నన్నడసొబగు గాంచి
మేము సంతసిల్లునట్లు నడువుండీ.

నేర్ ఇழை యీర్ — రమ్మన్నపై వీరల యెడలం బుట్టిన
వైలక్షణ్యము కాని, 'కొజ్జై మేల్ కఙ్గుమత్తిల్ కుఙ్గుమ్మ తోయ'
(నా. తి.) అని కుచ తట కుంకుమ పంకంబు క్షుణ్ణంబుగా నన్నట్లు
కృష్ణాగమంబున కెదురుచూచుచు నతండెప్పుడు వచ్చి పైకొనునో
యది యెఱుంగక యెప్పుడు నలంకరించికొని యుండుట కాని 'వసతి
హృది సనాతనే చ తస్మిన్ భవతి పుమాన్ జగతో౽స్య సౌమ్య
రూపః' (వి. ౨వ అ.) అని యీశ్వరుం డెవ్వాని మనంబున నుండునో

వాఁడు శోభనాకారుండగునని చెప్పిన చొప్పున కృష్ణసంశ్లేషప్రయుక్త శోభావిశేషంబుకాని యిట్లు చెప్పుటకు హేతువు.

శీర్ మల్ గుమాయ్ప్పాడి — ఇయ్యూరి యైశ్వర్యంబు పొంగి పొరలి మఱియొక్క యూరికి వెల్లువ వారం దగియున్నది. శ్రీకృష్ణుని సౌలభ్యంబు వైకుంఠంబునకుం గూడ నలలం గొల్పుచున్నయది యని హృదయము. అచ్చటివారు సామ్యాపన్నులు గాన, నాగుణమునకు విషయంబు లేదు. కావున నెండలో దీపమువలె వాస్తవముగానున్న దింతియ. చీకటిలో దీపమువలె వెలుంగుట యిక్కడన — పారమైశ్వర్య సంపన్నంబగు వస్తువు నియామ్యంబై యుండు నూరుగదా యిది—మున్నె గోసమృద్ధిగలుగ రామకృష్ణు లడుగువెట్టిన విశేషంబున పిదుకుటకుం దరుచుటకుం గొదువలేమి యనియు, మూనెడు పాలు మూనెడు నెయ్యి యగుట యనియుం జెప్పవచ్చును.

ఆయ్ప్పాడి — శ్రీవైకుంఠమువలె దేహాంతరముదాల్చి యనుభవింప నక్కఱలేని యూరు. ఆచారప్రధానులగు వసిష్ఠాదులు వర్తిల్లు నయోధ్యవలెం గాక కుడియెడమ లెఱుంగని గొల్లలు వర్తిల్లు నూరు. శ్రీరామసాధుచేష్టితంబులకు సంతసిల్లు నూరువలెం గాక కృష్ణుని ధూర్తచేష్టితంబుల కుల్లసిల్లు నూరు.

శెల్వచ్చిఱుమీర్ కాళ్ — ఈ యాత్మకు నెలకొను నైశ్వర్యం బీశ్వరప్రత్యాసత్తియే కదా. రాజ్యము విడిచి రిక్తచేతులతో స్వామి వెంట నేగిన శ్రీలక్ష్మణుని 'లక్ష్మణో లక్ష్మీసంపన్నః' అని యైశ్వర్య సంపన్నుండనిరి గదా. రావణభవనమునుండి వెలువడి స్వామియున్న యెడకు వచ్చువాఁడై 'పరిత్యక్తా మయా లఙ్కామిత్రాణి చ ధనాని చ' అని లంకయు మిత్రులును ధనములు నను నివియెల్ల నాచే విడువంబడియెనని త్యాగంబు చేసిన విభీషణుని 'అన్తరిక్షగతః

శ్రీమాన్' అని ఆకాశంబున నిలిచిన శ్రీమంతుండనిరి కాదే. ఈశ్వరుండే రక్షకుండని నిశ్చయించి యకించనుండై యున్న గజేంద్రుని 'స తు నాగవరః శ్రీమాన్' అని శ్రీమంతుండగు నా గజేంద్రుండనరే. అట్లే వీరి యైశ్వర్యంబు శ్రీకృష్ణప్రత్యాసత్తియే. అది యనురాగబాంధవానృశంస్యంబులలో నెద్దాననైన నిందటియెడం గలదు. శిఱువీఱార్ కాళ్--'తుల్యశీలవయోవృత్తామ్' అన్నచొప్పునం గృష్ణునకు నీడును నడువడియు నీడై యుండుట. మగనాంచ్రుడును మగవారు నన్యదేవతాభక్తులును స్వతంత్రులుంబోనివారు గాన, వీరలే యనన్యార్హలనుట జ్ఞానలవదుర్విదగ్ధలు గాక కుడిమొడమలెఱుంగని కన్యకలనుటయు. అనఁగా 'గోవిన్దను క్కల్లాల్ వాయిల్ పోగా' (నా. తి.) అన్నచొప్పున కృష్ణైకభోగ్యావయవలనుట.

ఈవరకుం బ్రాప్యసంగ్రహము, ఇఁకను బ్రాపకసంగ్రహము.

కూర్ వేల్ కొడున్దొళిలన్ నన్దగోపన్ — మున్ను శ్రీ నందగోపాలుఁడు పచ్చికసవు సయితముం జావంద్రొక్కనివాఁడు. ఆనృశంస్యప్రధానుండు. బిడ్డలం గన్నపిమ్మట వారలయందలి వాత్సల్యమున వారలకేమివచ్చునో యను భయంబున బల్లెము సానపట్టించి పట్టం దొడంగెనట. కొడున్దొళిలన్ — తొట్లక్రిందం జీమ చిటుక్కుమనినను సింహము పయింబడునట్లు చెయ్యి రక్తసిక్తముం జేసికొనంబోవునట; ప్రబలానర్థపరిహారార్థంబగు దుష్టప్రాణిహింసాప్రవృత్తి దోషావహంబుగాదు. ప్రబలధర్మంబు దుర్బలాధర్మంబుం బరిహరింపం జాలును. అగ్నీషోమీయపశుహింస 'న హింస్యాత్సర్వా భూతాని' యను సామాన్యవిధి పర్యుక్తంబయిన యధర్మంబునకు బాధకంబుగాదో. విశేషించి భగవద్విషయ ప్రేమాతిశయ బలాత్కారకృతంబగునది యధర్మసాధకంబగునే. ఒకప్పుడది బుద్ధిపూర్వకంబయినచోఁ దత్ఫలానుభవంబు గలిగిన నది

శుభోదర్కంబగుటకు సందియంబు వలదు. నందగోపన్ — నందుండను పేరుగల గోపాలుండు. పుత్రదర్శనప్రీతి యను నానందంబుం గాపాడు చున్నవాఁడనియుం జెప్పవచ్చును. తమ యుద్దేశ్యవస్తువునకు సంరక్షకుండగుటయు. నందగోపాలా యెళుందిరాయ్ — నందగోపాలా లెమ్మా యని లేపి పనిగొనుటకు భవ్యుండగుటయుంబట్టి యీతనిం గొని యాడుట.

కుమరన్ — పరమప్రేమాస్పదంబనుట. ఇతండు వెన్న ద్రొంగిలించెఁ గన్నియల మ్రుచ్చిలె నూరు మూలకుందెచ్చె నని యంద ఱును మొఱలిడుచో మంచిది నాకంటం బడినచో నియమించెద నని పెనుగిన్కతోనుండి యతండెదుటం గానవచ్చునప్పుడు సవినయముగాఁ దోచుటచే నక్కటా! ఇట్టివానిపై నటే యిట్టికొండెములం జెప్పిరని వారిమీఁదనే కినియునట్లుండుట. యశోదాదేవి బెదరించు నప్పుడు సైతము ' ఉన్ తమటికళ్ మునివర్ ' (పె. తి.) అని మీ తండ్రి కోపించుననియే బెదరించుట. ' పడిఱుపల శెయ్దిప్పాడి యెఙ్గుమ్ దిరియామే, కొడియే నెన్ బిళ్ళైయై ప్పోక్కినేన్ ' (పె. తి.) బాలచేష్టలు పెక్కులు సేయుచు నీ గోకులమెల్లం దిరుగనీక పాపురాల నాబిడ్డను నసులనెంటం గంపితినని గదా యీనా యోనుచుండుట.

పరార్ న్దకణ్ణి యశోదై — యశోదాదేవికన్నుల నందము కాపురం బున్నయది. ' అన్ బన్న కణ్ణాళశోదై ' (పె. తి.) అని అమ్మువలెం జక్కని కన్నులది యశోద యని చెప్పంబడినదిగదా. బిడ్డనెడదెగక చూచుట నయ్యందమెల్లం దనకన్నులం దోచునట్లున్నది. ' అఴగియ మ్మజ్జై నోక్కమన్నోకున్న మణికొళ్ శ్శెఱువాయ్ నెళిప్పదువుమ్ తొఴుగై యుమ్ ఇవై కండ ' ( పె. తి. ) అని పద్మను బెదరిచూచు నా చొపును ; అందమై యెఱ్ఱనిదగు చిఱునోరు గదల్చుటయును మ్రొక్కుట

యుం గనుగొన్న కన్నుగదా. అశోదై — 'అశోదా మెట్టున్దిరాయ్' అని యశోదా లెమ్మా యని లేపి పనిగొనునట్లుగదా వీరిమెడ నామె యను కూలయై యుండుట.

ఇళఙ్గిజమ్ — తండ్రి హితకాముండు గాన నాతనియెడ వినయ మ్మును ఈమె ప్రియపరురాలు గాన నీబిడయెడ గర్వంబు నతిశ యంబును దోపనుండు చందములు సెప్పంబడినవి. 'అఞ్జి వ్వురై ప్పా ళశోదై యూణాడవిట్టెటిరుక్కుమ్' (నా. తి.) అని యెవ్వరేనియు మొఱవెట్టిరేని బెదరంబలుకును దుశ్చేష్టలు సేయ విడుచును; అని యిట్లీతని చేష్టనెల్ల నుద్దేశ్యముగానే యీమె దలంచునది. ఇళఙ్గిజమ్ — కన్యలకు నీడుజోడై యుండుట.

కార్మేని — మన సకలతాపములం దీర్చు విగ్రహము. 'తూనీర్ ముగిల్ పోల్ తోన్ఱాయ్' (తి. మొ.) అని శుద్ధజల మేఘమువలెం దోచవే యని ప్రార్థింపఁబడినవస్తువుగదా వీరికిఁ బ్రత్య క్షంబై యున్నది. తల్లిదండ్రులు తమ్ము దాచియుంచినను విడువంజాలని విగ్రహసౌందర్యము.

శెజ్గణ్ — నల్లని మేనునకుం బరభాగంబైన యెఱ్ఱదనముగల కన్నులు. లోనున్న వాత్సల్యంబెల్లం గన్నులం దోచు నట్లుండును. ఐశ్వర్యమదకలుషంబై యుండుంగదా. మేనం గౌగిలించి కన్నులం జల్లగాఁ జూడవలయునని హృదయము.

కదిర్మదియమ్మోబ్బల్ ముగత్తాన్ — ప్రతాపాహ్లాదకత్వంబులచే సూర్యుని కాంతిలోఁగొన్న చంద్రునివలె మొగంబుండుననుట. 'తత్ర గోవిందమాసీనం ప్రసన్నాదిత్యవర్చసమ్' అన్నచొప్పున ననుకూలులకు సుప్రసన్నంబై ప్రతికూలులకు సూర్యునివలె ననభిభవనీయంబైన కాంతి

గలుగుట. ప్రకాశకాహ్లాదకత్వంబులు గల మొగంబనియుం జెప్ప వచ్చును. సాకౌదుపమానంబు లేమి నభూతోపమ చెప్పంబడినది.

నారాయణనే — గోవర్ధనోద్ధరణా ద్యతిమానుష చేష్టితంబుల చేతం బిన్నపడుచులకు సయితము సర్వేశ్వరత్వం బెఱుంగవచ్చు నవతారంబుగదా యిది. గోపవృద్ధులు వ్రతాంగముగా జపించుట కుపదేశించిన నామమంత్రమగుటం జెప్పిరనియుం జెప్పవచ్చును; ఈ యాండాళు పలుమాఱు తమపెద్దలు సెప్పుచుండ వినుచుండుటం దద్వాసనావశంబున నిట్లు సెప్పెననియుం జెప్పవచ్చును. 'సర్వమై త్తీమెంగళోన్ఱు మఱియేన్నారణా వెన్ఱు మిత్తిన్తై యల్లాల్' (పె. తి.) మేలుగీడుల నొక్కటియు నెఱుంగను నారాయణా యను నింతియ దక్క ననియు, 'నాన్ కణ్డు కొణ్డేన్నారాయణా వెన్ఱు నామమ్' (పె. తి.) నేను గనుగొంటిని నారాయణా యను నామము ననియు, 'తిణ్ణమ్ నారణన్' (తిరువాయ్.) సత్యము నారాయణుండు అనియు, 'నారణనై నన్గఱిన్దేన్' (నాన్. తి.) నారాయణుని లెస్సగా నెఱింగితి ననియు, నీ చొప్పున నాళ్వారులు, 'సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖాః సుఖినో భవన్తి' అని నారాయణశబ్దమే కీర్తించి దుఃఖము విడిచి సుఖవంతు లగుదురనియును, 'ఏష నారాయణః శ్రీమాన్' (వి. ౫-వ అ.) అని ఈ శ్రీకృష్ణుండే శ్రీమంతుడగు నారాయణుండనియు నిట్లు ఋషులును, 'నారాయణ పరం బ్రహ్మ' (తై.నా.) నారాయణుండే పరబ్రహ్మము అని యిట్లు శ్రుతియుం బలుదెఱంగులం జెప్పుట గలదుకదా.

నారాయణనే నమక్కే పఱై తరువాన్—అతండే యపేక్షితసంవిధానంబు సేయువాండనుట; అభిమతసామగ్రి యంతయుం దాన సహాయుండై యొసంగుట యవధారణార్థము. నమక్కే—అతండే నిర్విఘ్నంబుగా

నభిమతసాధనసామగ్రి ఘటించునని యున్న మనకే యనుట. పఱై తరు
వాత్ — లౌకికులకు వాద్యవిశేషంబను వ్యాజము ; తమ కభిమతంబగు
కైంకర్యసామగ్రి నిచ్చువాఁడని హృదయము వీరలే ' ఇన్ఱైప్పఱై
కొళ్వానన్ఱుకాణ్ ' అని ఇది యొక్క ప్రయోజనముగాఁ గైకొనుటకుం
గాదుసుమీ యనంగలరు. తరువాత్ — తమకుఁ గలుగునదెల్ల నాతం
డొసంగునదే యను నర్థము దోఁచుచున్నది.

పాఱోర్ పుగళ — కృష్ణుని మమ్మును జేరనీనివారలే కృష్ణుఁడు
పకరణముల ఘటింపం బడుచులు నోముల నుపక్రమించిరి, దేశంబెల్ల
ననావృష్టిదీరి సమృద్ధంబయ్యె నని కొనియాడునట్లు.

పడిన్దు — నీరాడవచ్చువారు రండీ యని యన్వయము.



## రెండవపాశురము

క్రిందటిపాశురములోఁ బ్రాప్యప్రాపకాధికారిస్వరూపంబులు సెప్పం బడినవి. ఇంక నధికారికిం గృత్యంబులివి యకృత్యంబులివి యని తెలుపుట యావశ్యకము. భగవద్విషయార్థులుగానివారలకుం ద్యాజ్యముల విడుచుటయు నుపాదేయంబులం బట్టుటయుం గ్లేశావహంబై యుండు; నందుకుమూలము చేతనుని కర్మవశముంబట్టి గుణదోషంబులు దోచుం గాని విషయస్వరూపంబులంబట్టి వచ్చు గుణదోషంబులు లేవు. ఎట్లనిన—ఒక్క డొక్కప్పు డొక్కదాని నాదరించి వాఁడే మఱియొక్కప్పుడు దాని నుపేక్షించుటయు మఱియొక్కప్పు డుపేక్షించినదానినే యాదరించుటయుం గలదు. కాఁబట్టి యాదరోపేక్షలు కర్మానుగుణములు గాని వాస్తవములు గావు. అన్నివిషయములు స్వరూపంబుల నల్పంబులు నస్థిరంబులునే యగుట నందు వాసియెన్నుట కఠినము. అల్పములు నస్థిరంబులు నగుట హేయంబులగు విషయంబుల విడిచి సమస్తకల్యాణగుణాత్మకునిం బట్టువానికిఁ దదంగంబులం బట్టుటయు నితరంబుల విడుచుటయు సులభము. గాన నితరదుర్లభమును వీరలకు సులభము నగు కృత్యంబులు నకృత్యపరిహారంబులుం దెల్పుచున్నారు.



## 2

వైయత్తువాఴ్వీర్గాళ్ నాముమ్నమ్బావైక్కు
చ్చెయ్యుఙ్గిరిశైగళ్ కేళీరో, పాఱ్కడలుళ్

పైయత్తుయిన్ఱ పరమనడిపాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ నాట్కాలే నీరాడి

మైయిట్టెఴుదోమ్ మలరిట్టు నామ్ ముడియోమ్
శెయ్యాదన శెయ్యోమ్ తీక్కుఱళై శెన్ఱోదోమ్

ఐయముమ్ పిచ్చైయు మాన్దనైయుఙ్గైకాట్టి
ఉయ్యుమాఱెణ్ణి యుగన్దేలో రెమ్బావాయ్.

| | | |
|---|---|---|
| వైయత్తు వాఴ్ వీర్గాళ్ | : | భూమిలో సుఖించు భాగ్యవతులారా ! |
| నాముమ్ నమ్ పావైక్కు | : | మనము మన నోమునకు |
| ఉయ్యుమ్ ఆఱు ఎణ్ణి | : | ఉజ్జీవన ప్రకారము ననుసంధించి |
| ఉగన్దు | : | సంతోషించి |
| శెయ్యుమ్ కిరిశైగళ్ | : | చేయవలయు క్రియలు |
| కేళీరో | : | వినుండీ – |
| పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ | : | క్షీరసముద్రమున లఘునిద్ర సేయుచున్న |
| పరమన్ అడి పాడి | : | సర్వాధికుని శ్రీపాదము ననుసంధించి |
| నాట్కాలే నీరాడి | : | అత్యంత ప్రాతఃకాలముననే తీర్థమాడి |
| ఐయముమ్ పిచ్చైయుమ్ | : | దానంబును భిక్షయును |
| ఆన్దనైయుమ్ కైకాట్టి | : | నగువరకుం జెయి జూపి |
| నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ | : | నెయ్యి భుజింపము పాలు భుజింపము |
| మైయిట్టెఴుదోమ్ | : | కాటుక వెట్టి రేఖ దీయము |
| మలరిట్టు నామ్ ముడియోమ్ | : | పువ్వులం దుఱుమి ముడిచికొనము |
| శెయ్యాదన శెయ్యోమ్ | : | శిష్టులు చేయని పనులం జేయము |
| తీక్కుఱళై శెన్ఱోదోమ్ | : | దుష్టవాక్యములం బ్రసంగింపము. |

వైయత్తు వాழ்వీర్ గాళ్ — సర్వేశ్వరుండు వ్రేపల్లెలోఁ గృష్ణుండై యవతరించు కాలంబునఁ బుట్టుటయె భాగ్యము. ఇచ్చటి భాగ్యంబునకు వైకుంఠంబును సదృశంబు గాదు. అందు మహత్త్వంబెతక్క సౌలభ్యం బిందువలె ననుభవింపఁ జెల్లదు. అందు భోక్తలు సంకుచితులు. ఇందు భోగ్యం బసంకుచితము. దయనీయు లున్నచోఁ గదా దయాది గుణంబు లనుభవించునది. అందు విషయంబులేమి దయాది గుణంబులు ప్రకాశించుట కవకాశము లేదు. అందలివారలు నిందలి గుణంబు లనుభవించి యక్కొఱంతం దీర్పవలయును. అవతార గుణంబులం దవిలనివారలు 'భావో నాన్యత్ర గచ్ఛతి' (రా) అని - నా భావంబు మఱియొక్కయెడకుం జనదనియు, 'ఇన్దిర లోకమాళు మచ్చువై పెఱినుమ్ వేణ్డేన్' (తి — మా) అని ఇంద్రలోకం బేలునట్టి రసానుభవంబు దొరకొనిన నొల్లననియు, 'అరఙ్గనెన్నముతినై కణ్డకణ్గళ్ మత్తొన్ఱినై కాణావే' (అమల) అని రంగనాథుని భోగ్యామృతస్వరూపునిం గాంచినకన్నులు మఱియొక్కదానిం జూడననియుం జెప్పిరిగదా. (పక్షాన్తరము) మరుభూమియందు చన్నీరట్లు 'ఇరుళ్ తరుమా ఞాలమ్' (తి - మొ) అని చీకటినిచ్చు మహాపృథివి యనంబడిన సంసారమున నుండియె కృష్ణానుభవసుఖంబుఁ జెందం బుట్టినవారలారా అనియుం జెప్పవచ్చును. వాழ்వీర్ గాళ్ - కృష్ణావతారంబునకు మున్నైనఁ బిమ్మటనైనం బుట్టక యక్కాలంబునందే పుట్టుట. అందును మఱియొక్కచోటం గాక యియ్యూరునం బుట్టుట. అందును బ్రాయమునిండియుండక తత్కటాక్షలక్ష్యంబులగు నట్లీడుజోడై యుండుట యిది భాగ్యాతిశయంబుగాదే. ఈ యూరున నివసించుటయు భాగ్యంబునని రెండు లేవు. అట్టిచో నివసించుటయె భాగ్యము. 'వేంగడత్తై ప్పదియాగ వాழ்వీర్ గాళ్' (నా-తి) అని వేంకటాచలము వాసముగా సుఖించువారలారా యని చెప్పంబడియెంగదా. తమకు నట్టిసుఖంబు లభించుట సరియైయుండినను 'వాழ்వీర్ గాళ్' అని

వేఱుగాఁ జెప్పుట యేమన్నను — ప్రత్యేకానుభవము రసముగాఁ దోచమిం దమకు రసము గలిగించువారని సూచించుట.

నామమ్ — అతనిచేతనే యన్నియు ఘటిల్లునని యున్న మనము. రుచిబలాత్కారంబునం దాము ప్రవర్తిల్లుటెంతియు. అది యతండు ఘటించినదే యగుచుండు. ఇట్టిఫలంబు సంనిహితంబయ్యెనే యని యున్నమనమును అనియుం జెప్పవచ్చును.

నమ్ పావై క్కు — పరద్రోహంబునకై చేయు ననురయాగంబుల వంటివి గాక కృష్ణుండును కృష్ణవిభూతియు నుల్లసిల్లంజేయు నోమునకనుట.

శెయ్యుమ్‌కిరిశై కళ్ — కృతకృత్యులు సైతము సత్కాలక్షేపం బునకై చేయు ననుష్ఠానంబనుట. ఆరంభించి విడుచునవి గావు. సాహసకృత్యంబులవలెం జూపి విడుచునవి గావు. వేఱువేఱుగాఁ జేసి తీర్పవలయునవి యనుట.

కేళీరో — పడుచులు సుమ్మా కృష్ణుండు సుమ్మా యని నిషేధించు నూరిలో నిట్టిలాభంబు గలిగెనే యనియు భగవద్విముఖుల సందడిలోఁ గృష్ణానుభవంబున కిందఱు గలిగిరే యనియు ననుసంధానం బున సబ్ధలగుటంబట్టి వినుండీ యనుట. మేత దొరకొనునప్పుడు నెమరు వెట్టుట గలదే. ఈ దినంబులు గడచినచో మనల నిట్లు చేరనిత్తురే. కేళీరో — 'సంశ్రవే మధురం వాక్యమ్' అనియును 'పురుషార్థో ఽయమేవైకో యత్కథాశ్రవణం హరేః' అనియుం జెప్పినచొప్పున వినుటయుం బ్రయోజనంబె యనుట. ఆచార్యపదనిర్వాహంబునకుం గాదు. అజ్ఞాతజ్ఞాపనంబునకుం గాదు. 'బోధయన్తః పరస్పరమ్' (భ-గీ) అనుచొప్పున సత్కాలక్షేపంబుసేయుట కనుట.

అట్లయినచోఁ జెప్పు మనవుడుం జెప్పుచున్నారు.

పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ — ఆనన్దాత్మకస్వరూపస్థితిం దెలుప నాశ్రితులకుం దోచుచోఁ బరమపదంబునుండి యొక్కపయనంబు వచ్చి పాలకడలిం బవ్వళించి దేవీభోగంబునకు నెడమిడక జగద్రక్షణచింతా పరాయణుండై యార్తధ్వనికిం జెవియిచ్చియున్నట్లు దర్శనంబొసంగుట 'వెళ్ళైవెళ్ళత్తిన్ మేల్ ఒరుపామ్బై మెత్తైయాగ విరిత్తదన్మేలే కళ్ళ

నిత్తిరె కొళ్లిన్ద' (పె. తి.) అని వెల్లనివెల్లువపై నొక్క పామును బరువుగాఁ బరిచి దానిపయిం గల్లనిద్దురం గైకొన్నచందమును దత్త్వజ్ఞులు సెప్పిరి గదా. కావుననే లఘునిద్ర యనుట.

పరమన్ — జగద్రక్షణార్థ నిద్రాప్రయుక్తంబగు గుణాతిశయంబును తగదునం దాపిన రతనంబువలె ననంతునిపైం బవ్వళించుటం గలుగు పరభాగకాన్తిమహత్త్వంబు నిందు బ్రస్తుతములు.

అడి పాడి — వాని యాధిక్యోన్నతి నెన్నుచోఁ దాము నైచ్యకాష్ఠనుండవలయుం గదా. మహీషీవర్గంబునై తమ శేషత్వము సర్వసాధారణంబగుటంబట్టి 'పళ్ళికొళ్ళుమిడ త్తడికొట్టిడ' (నా-తి) అని పవ్వళించునప్పుడు పాదంబుఁ బట్టనని చెప్పినచొప్పునం బాదంబులం బట్టుట సహజంబు గానం బాదంబులం బాడుట. 'ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః । నాగపర్యఙ్కముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్' (వి. అ.) అన్నచొప్పున క్షీరాబ్ధిశాయియే కృష్ణుండని యెఱింగియున్నను మున్నె శంకించు గొల్లలు దైవంబొసంగిన యీ సంగంబునకు భంగంబు సేతురొక్కో యను భయంబున రూపాన్తరంబునం బాడుట.

నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ — భోగ్యాన్తరంబుల నస్వాయింపమని హృదయము - భుజించినవారు భుజింప నొల్లరు గదా - అది యెట్లన్నను. 'పాథేయం పుండరీకాక్షనామసంకీర్తనామృతమ్' అనియు, 'ఉణ్ణానాళ్ పశియావ తొన్నిల్లై యోవాదే నమో నారణా వెన్నెణ్ణానాళు మిరుక్కుశుచ్చామవేద నాణ్ మలర్ కొండు నిన్ పాదమ్ నణ్ణానాళ్ వై తత్తుఱు మాగిలన్నెనక్కువై పట్టినినాళే' (పె - తి) అని తిననినా డాకలి యగుటలేదు - ఎడలక నమో నారాయణాయ అనియని యెన్ననినాడును బుగ్యజుస్సామ మన్త్రపుష్పంబులం గొని నీ పాదముఁ జెందని దినంబును తటస్థంబులయినచో నాడు నాకుపవాసదినం బనియును, 'వాసుదేవస్సర్వమ్' (భ-గీ) 'ఎల్లామ్ కణ్ణన్' (తి - మొ) అని ధారకపోషక భోగ్యములన్నియుఁ గృష్ణుఁడే యనియు, 'కూత్తై శోఱివై వేణ్డువదిల్లై' అని వస్త్రము నన్నము నను వీని యపేక్షించుట లేదనియును గదా జ్ఞాని వ్యవహారము. కృష్ణుండు పుట్టినపై నాహార వ్యుత్పత్తి లేమి

నాతండే తెంచువరకు నుపవాస కృశల మగుచున్నామనుట. ఈ యుప వాసంబు తనదిగా నెంచువాఁడు గదా కృష్ణుండు.

నాట్కాలే నీరాడి— అతండు వచ్చినపై స్నానంబు సేయనుండక పెందలకడనే తద్భోగయోగ్యముగా స్నానము సేతమనియు 'ఓదినామమ్ కుళిత్తుచ్చినాన్నాలోళిమాలర్ ప్పాదనాళుమ్పణివోమ్నమక్కే నలమూద లిల్' (తి-మొ) నామములం బఠించి స్నానము చేసి శిరమున నుజ్జ్వల మహాపుష్పసదృశపాదమును సేవింతము. మనకే మంచిది గాన, అన్న చొప్పునం దాము త్వరాతిశయంబున స్వరక్షణప్రవృత్తిం జేసి యాతని క్షీరాబ్ధిశాయిత్వం బసత్సము సేతమనియు హృదయము. 'అత్యన్త సుఖసంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః । కథం న్వపరరాత్రేషు సరయూ మవగాహతే' (రా - అయో) అన్నచొప్పున శ్రీ భరతుండట్ల వీరును విరహతాప మారుటకు నోమను వ్యాజమున స్నానము సేయుట.

మైయిట్టెళుదోమ్ — 'మైయకణ్ణాళ్' అన్నచొప్పున మున్నె కాటుక కన్నులవారు గదా. ఇంకం గాటుక వెట్టుట మంగళార్థము. అది మానుద మనుటచే నాతని కవకాశమిడమి దోచుచున్నది. అతండు పరమ ప్రణయి యగుటచే వీరలయెడం గించిత్కారము సేయకుండఁ జాలఁడు. వీరలు గాటుక వెట్టఁ గడంగుచో నాతండు నడుమనందికొని శేషము పూరింపంబూనును. అందు కవకాశ మిడమి దోచుచున్నదని శృఙ్గారపద్ధతి నాలఙ్కారికులు సెప్పుదురు.

మలరిట్టు నామ్ముడియోమ్— 'శురుమ్బార్ కుళ్లల్ కోదై' (నా. తి.) తుమ్మెదలు నిండియున్న కేశపాశముగల స్త్రీ అనియు, 'వాశమ్ శెయ్ పూఙ్గుళ్లలాళ్' (తి - మొ) అని పరిమళించు స్పృహణీయ కేశ భారముగలది యనియుఁ గదా చెప్పంబడినది. ఇంకఁ బుష్పంబునకుఁ బరిమళం బిడుటకుఁ గదా పువ్వుల ముడిచికొనుట. అది మేము సేయము. 'అత్రోపవిశ్య సా తేన కాఽపి పుష్పైరలంకృతా । అన్య జన్మని సర్వాత్మా విష్ణురభ్యర్చితో యయా' (వి-౫అ) అన్నచొప్పున జన్మాన్తరీయభాగ్యవశంబున నాతండె పూదండఁ దెచ్చి ముడిచి యలంకరించి యది తీయవలవదనుచోఁ జేయునది లేదని శృఙ్గార పద్ధతి.

శెయ్యాదన శెయ్యోమ్ — వైదికవిధుల నెఱుంగనివారలకును విధు లెఱుంగరాని కృత్యంబులయందును సందేహవిషయంబుల యందును శిష్టాచారంబులే కదా ప్రమాణములు. ప్రత్యక్షవిధివిరుద్ధంబులైనచోఁ గదా శిష్టాచారంబు లప్రమాణంబులగుట. రాజ్యంబు సేయుమని యనుజ్ఞ యొసంగినను సర్వప్రకారంబుల యోగ్యత గలిగినను మున్ను కులంబునం బెద్దలు సేయనిపని చేయంజాలనని కదా శ్రీ భరతుండు చెప్పినది. చేయందగని పనులం జేయమనియు మున్ను లేచినవారలె లేవనివారల లేపి యందఱుం గూడినం గాక కృష్ణునిం దఱియం జనువారము కామనియు హృదయము.

తీక్కుఱళై శెన్ఱోదోమ్ — పరానర్థకరంబుల నసత్యంబులం బలుకము. శ్రీసీతాదేవి యేకాక్ష్యేకకర్ణీప్రభృతులు పెట్టిన వెత నేకాన్తంబునం దేని స్వామికిం జెప్పదయ్యెఁ గదా. తమలోఁ దాము చేసికొను నధిక్షేపోక్తులు శ్రీ కృష్ణుని సన్నిధిం బ్రసంగింపమనియు హృదయము.

ఐయముమ్ పిచ్చైయుమ్ ఆన్దనైయుమ్ కైకాట్టి — దానము యోగ్యవిషయమున సబహుమానముగా వ్యయము సేయుట. భిక్ష బ్రహ్మచారులకును సన్న్యాసులకుం బెట్టినది. అగువరకు ననఁగా యథాశక్తిగా ననుట. వారలు గొనఁజాలిన వరకు నర్థులగు వరకు ననియును చెయ్యంజూపుట యనఁగా నన్నియు నొసంగియు నేమియు నర్వాంబుగాఁ జేయమైతిమనుకొనుట యనియుం జెప్పుదురు. కృష్ణానుభవంబు గోరు వారల కతని ననుభవింపించుటయును గుణచేష్టితాదులు వినుదమనువారికి వినుపించుటయుం జేతమని హృదయము.

ఉయ్యుమ్ ఆఱు ఎణ్ణి — 'అసన్నేవ' (తై. ఆ.) అనుచొప్పున నసత్కల్పత్వంబు విడిచి భగవద్విషయంబునం జొరుట యను సత్త లభించు విధంబెఱింగి యని హృదయము.

ఉగన్దు, ఎణ్ణియుగన్దు — 'సుసుఖం కర్తుమ్' (భ. గీ.) అన్న చొప్పున మనోరథవేళనుండియు రసించునట్లని హృదయము. చేయు పనులు వినుండీ యని యన్వయము.

## మూడవ పాశురము

స్వర్గాదులు ప్రధానఫలములుగా నుద్దేశించువారికి 'ఆయురారోగ్య శాస్త్రే' అను చొప్పున నాయుఃపుత్రాద్యవాన్తరఫలంబులుం గలవు. 'మాతా పితా భ్రాతా నివాసశ్శరణం సుహృద్గతిర్నారాయణః' అనియు 'శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలాత్తాయ్‌తన్దైయుమవరే' అని మీనాక్షులగు స్త్రీలును పెద్దసంపదయును సత్పుత్రులును మేలైన తలిదండ్రులు నతండే యింక నగుననియుం జెప్పినచొప్పున నన్నియు నతండే యని యుండువారలకు ఫలాంతరంబులనావశ్యకంబులై యున్నను యాగప్రవృత్తులగు ఋత్విజులు దమకు ముఖ్యముగా దక్షిణలం గోరువారలైనను యజమానునకు స్వర్గాదిఫలం బపేక్షించుటయు నట్లు సిద్ధించుటయు నవ్యాహతంబు లగునట్లు వీరలుం గారయితలగు గోపవృద్ధుల కభీష్టంబగు వర్షాదిఫలంబు నపేక్షించి యవి యవ్యాహతంబులని చెప్పుచున్నారు.

'యత్రాష్టాక్షరసంసిద్ధో మహాభాగవతః స్థితః । న తత్ర సంచరిష్యన్తి వ్యాధిదుర్భిక్షతస్కరాః' అను చొప్పున నొక్క భాగవతోత్తముం డున్నచోటనే దుర్భిక్షాదుల కవకాశంబు గలుగదు గదా - ఇంద ఱెట్టివారున్నచో దుర్భిక్షంబు దీర వర్షంబు గురియు టరుదే యని చెప్పుచున్నారనియుం జెప్పుదురు.



ఓఙ్గి వులగళన్ద వుత్తమన్ పేర్పాడి...

నీరాడినాల్ ...ఓఙ్గు పెరుఞ్జెన్నెలూడు...

ప్పూఙ్గువళై ప్పోదిల్ ..కుడమ్ నిఱైక్కుమ్ పెరుమ్పశుక్కళ్

నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దు'



## 3

ఓఙ్గి యులగళన్ద వుత్తమన్ పేర్పాడి
నాఙ్గళ్ నమ్బావైక్కుచ్ చాట్రి నీరాడినాల్

తీఙ్గిన్రి నాడెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు
ఓఙ్గు పెరుఞ్జెన్నెలూడు కయలుగళ

పూఙ్గువళై ప్పోదిల్ పొఱివణ్డు కణ్పడుప్ప
తేఙ్గాదే పుక్కిరున్దు శీర్త్త ములై పట్రి

వాఙ్గ క్కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్బశుక్కళ్
నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దేలోరెమ్బావాయ్.

| | |
|---|---|
| ఓఙ్గి ఉలగు అళన్ద | : ఎదిగి లోకములను గొలిచిన |
| ఉత్తమన్ పేర్ పాడి | : ఉత్తముని నామంబులం బాడి |
| నాఙ్గళ్ నమ్బావైక్కు | : మేము మా నోమునకు |
| శాత్తి నీరాడినాల్ | : పూనుకొని తీర్థమాడినచో |
| తీఙ్గు ఇన్ఱి | : వ్యాధి దుర్భిక్షాద్యమంగళములు లేకుండ |
| నాడు ఎల్లామ్ | : దేశమెల్లను |
| తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు | : నెల మూడువానలు కురిసి |
| ఓఙ్గు పెరుమ్ శెన్నెల్ | : ఎదిగిన పెద్ద సస్యములు |
| ఊడు కయల్ ఉగళ | : మధ్యప్రదేశంబున మత్స్యంబులు పొరలుచుండ |
| పూఙ్గువళై ప్పోదిల్ | : వికసిత కువలయ పుష్పములందు |
| పొఱివణ్డు కణ్ పడుప్ప | : కాన్తిగల తుమ్మెదలు నిద్రింప |
| తేఙ్గాదే పుక్కిరున్దు | : వెను దీయక చొచ్చి కూర్చుండి |
| శీర్ త్తములై | : పీన స్తనమును |
| పత్తి వాఙ్గ | : పట్టి పిదికినం |
| వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్ | : ఔదార్యముగల శ్రేష్ఠములైన పశువులు |
| నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దు | : అవిచ్ఛిన్నమగు సంపద సమృద్ధ మగునట్లు |
| కుడమ్ నిఱైక్కుమ్ | : కుండ నింపును |

ఓజ్గీ ఉలగు అళన్ద — వీరలు మొదట నారాయణుండని యుభయ విభూతియోగము జెప్పి పాలకడలిం బవ్వళించియున్న చొప్పుం జెప్పి యిందవతారంబువరకుం జూడం బట్టుచున్నారు. ఓజ్గీ - ఎదిగి - జగద్రక్షణంబునకై క్షీరాబ్ధిశాయియై యుండి యందార్తరక్షణావకాశ లాభంబు లేనివరకును మంచు దవిలి వాలిన వెదురువలె నుండి మహాబలి బాధితలగు దేవతల యార్తధ్వని విని నంతన కలిగిన పరోపకారలాభ హర్షంబున గాని మున్ను వామనుండై యుండియు ప్రార్థితంబు లబ్ధంబయ్యె నని పొడమిన సంతోషంబున గాని నెదిగినట్లు దోచి తన చేతం బడిన దానధారోదకంబును తన శ్రీపాదంబును బ్రహ్మ క్షాళనంబు చేసిన నీరు నొక్కమాఱు వడునట్లెదిగి.

ఉలగు అళన్ద — లోకముం గొలిచిన సత్తాధారణార్థంబగు జగద్వ్యాప్తియందట్ల సకల ప్రాణులయెడ నడుగిడుచో గుణాగుణ నిరూపణంబు సేయక తన కొక్క ప్రయోజనంబు లేకున్నను నిద్రించు బిడ్డం గౌగలించు తల్లి చందంబునం దనకు నేతత్స్పర్శంబె ధారకంబని తోచునట్లుండుట. గుణాగుణవ్యవస్థ నిరూపింపమియు నతిమానుష చేష్టితంబులును విగ్రహ సౌందర్యంబునుం జూడం గృష్ణావతారసమం బగుటచే శ్రీ వామనావతారంబుం దలంచుట.

ఉత్తమర్ — 'భక్తానాం త్వం ప్రకాశసే' అనియును ' అప్యహం జీవితం జహ్యాం ' అనియుం జెప్పినచొప్పున భక్తులకై మేను దాల్చుటయు వారల కార్యంబు వచ్చినచో నదియైనను విడుచుటయుం బూనియున్న వానికి తనది సెడఁ జూచియు నొరున కుపకరించుటయు నది సెడకుండు నట్లుపకరించుటయుం దన పనికై యొరునిది సెడం జూచుటయుం గదా యుత్తమమధ్యమాధమ లక్షణములు.

పేర్ పాడి — తదర్థగుణప్రీతియై పాడుటకు హేతువు. మొదట నారాయణశబ్దంబును రెండవ పాశురంబున గుణపూర్తిం జెప్పి పరమ శబ్దంబును ఇందు వ్యాప్తిప్రత్యభిజ్ఞాపక త్రివిక్రమాపదానంబుం గలుగుట యును 'మన్దిరత్తాల్' (తిరునె) అని మంత్రప్రస్తావము చేసి త్రివిక్రమాపదానంబుం జెప్పుట తిరుమంగై యాళ్వారి ప్రబంధంబునం గానవచ్చుటయుం జూడ మూలమంత్రంబు పాడుటయె హృదయం బనియుం జెప్పుదురు. ఇతరులం జూడ నీశ్వరునకుం గల యుత్తమత్వంబు వంటిది కేవల భగవత్స్మరణంబు కంటెం దన్నామస్మరణంబునకుం గల వాసి. మొదటిది గట్టిబంగరువంటిది, రెండవది పనిచేసిన బంగరువంటిది. మాతృఘాతకుండు సైతము చెయ్యి నొచ్చినచో నమ్మా యనునట్లు నాస్తికులు సైతము వ్యాధిపరిహారాదులకై నామంబులం బఠింతురు. ఇది యోగ్యతాపేక్షంబు గాక తానే యోగ్యత నొసంగును అనియుం జెప్పుదురు.

నాఙ్గళ్ — నామంబులు పఠింపనిచో నిలువలేని మేము. రెండ మునకుం గావలివెట్టు నూరి నిట్టి లాభంబు గలుగుటం దమ్మునె కొనియాడుచున్నారనియుం జెప్పుదురు.

నమ్పావైక్కు — ప్రాప్యరుచి బలాత్కారకారితంబగు నీ నోమునకు.

శాత్తి నీరాడినాల్ — నోమునకని పలుకుచు విరహతాపంబు దీర నీరాడినచో. కృష్ణసంశ్లేషంబు సేయనని హృదయము. ఇంతకు మున్ను నామసంకీర్తనంబు చేసి యనుటచే సంబన్ధజ్ఞానపూర్వకంబగు కృష్ణసంశ్లే షము సేయనని ఫలితము.

తీఙ్గు ఇన్ఱి నాడు ఎల్లామ్ — ఒక్కొక్కని సుకృతమునకు ఫలంబు కలుగుచో నది యొక్కొక్కండే కదా యనుభవించునది. అచ్చటి

యప్పటి సకలజనుల సుకృతపరిపాకంబగు నవతారంబు వైభవంబునం గలుగు ఫలంబు వారల సమష్టిభాగ్యంబు గదా. 'రామే రాజ్యం ప్రశాసతి' (రా-యు) అని శ్రీరామదేవ రాజ్య కాలంబున 'ప్రహృష్టముదితో లోకః' (రా-యు) అని లోకంబెల్ల యోగ క్షేమజనిత హర్షామోదంబులం జెందినది గాదే.

తీఙ్గిన్ఱి ముమ్మారి పెయ్దు — అతివృష్ట్యనావృష్టులను నీతులు లేకుండ నూఱునూనె యెక్కించినట్లు వలయు దినంబు లెండంగాయుచు 'నికామే నికామే నః పర్జన్యో వర్షతి' (యజుర్వే) అనుచొప్పున వలయునప్పుడెల్ల వర్షంబు గురియుట.

ఓఙ్గు పెరుమ్ శెన్నెల్ — ప్రాతఃకాలంబున నునిచి మధ్యాహ్న కాలంబునం జూచుచోఁ దలయెత్తి కేలడ్డబునిచి చూడవలయు నట్లుండుటయనియు, 'వృక్షే వృక్షే హి పశ్యామి' (రా-అ) అని మారీచుండు భయంబున రామరూపంబె చూచుచున్నట్లు వీరలును రాగభరంబునఁ ద్రివిక్రమాపదానంబె చెట్టుచెట్టునకుఁ జూచుటయనియు ఒక్క మొదలొక్క మడి వ్యాపించి యందుకు నవధిలేమి నాకాశావకాశం బెల్ల పెల్లు పెరుగుటయనియు నాలంకారికోక్తి.

ఊడు కయల్ ఉగళ — మధ్యప్రదేశంబున మత్స్యంబులు పొరలు చుండ మదంబునం గలభంబుల తెఱఁగున నెదిగిన మీలుచేనిలోఁ జొచ్చి పోనెడములేమిఁ దుళ్ళుచుండి పోవుం ద్రోవ యెఱుంగక త్రివిక్రమాప దానంబుంగని యనుకూలులు పడిన పాటులు పడుచున్నవట.

పూఙ్గువళై ప్పోదిల్ — కలువ వికసించుగాలంబున ననియుం జెప్పవచ్చును.

పొఱివణ్డు కణ్ పడుప్ప — మధుపానాన్యోన్యసంశ్లేషములం గలిగిన తేజంబెల్ల నోడలం బ్రయలుపడునట్లు కాంతిగల తుమ్మెదలు

పరస్పరానుకూల్యంబుగాఁ జొచ్చి పుష్పస్పర్శసుఖంబున విషము దవిలినట్లు నిద్రించి మేల్కాంచుచో నన్ను నీవు లేపవయితివని యొండొంటితో నాడుకొనుట దోపం గోలాహలంబులం జేయుచుండు నట. తేనె గ్రోలం దుమ్మెద కలువం జేర నింతలో నదియు సస్యము నొక్కపెట్ట నెదుగ నందున్న మీలు పొరలం గదిలి తూగుటుయ్యేల నిద్రించు రాజకుమారుల చందంబున మధుముఖంబులతోనే నిద్రించునట. 'పళ్ళికమల త్తిడై ప్పట్ట పగువాయలవన్ ముగమ్నోక్కి నళ్ళియయూడుమ్' పడకయగు తామరం దవిలిన పెద్దనోటి మగ రొయ్య యెంద్రిమోమును జూచి యాడు రొయ్యెంద్రి (ఇది తగునే యని) దూరునని చెప్పినట్లు.

ఇది సస్యసమృద్ధి - ఇఁక నూరిసమృద్ధి చెప్పఁబడును.

తేఙ్గాదే పుక్కిరున్దు — పశువులు పాలిచ్చుచోఁ దరుగకుండుట స్థావరప్రతిష్ఠవలెనుండి పాలు పిదుకంబూనుట సముద్రలంఘనమునకుం బూనుటవంటిది గాన ముంగేలి బలిమి కడిమి గలిగినవారలు గాక యాతనికిఁ జొరవట.

శీర్ త్తములై — పీన స్తనమును బ్రేలం బట్టఁ దరముగాదు గాన రెండు చేతులంబట్టి పిదుకవలయునట.

పఙ్గ్ వాఙ్గ కుఙ్డమ్ నిఱైక్కుమ్— పట్టి విడిచినం దానే కుండ నింపుననియుఁ బెట్టిన కుండలు దివియం దివియ నింపు ననియుం జెప్ప వచ్చును. కుండనిడనివారిదే తప్పుగాక పశువులకు లోపంబు లేదు. ఇచ్ఛ యున్నవా రీశ్వరునిం జేరి కృతకృత్యులగు నట్లే పశువులం జేరినం గృత కృత్యులగుదురట.

వళ్ళల్ — ఎవ్వారేనియు బిలిచి దూత్యము సేయుమన్నను సేయ వెడలు శ్రీకృష్ణునిచందంబున నిప్పశువులును పసిబిడ్డలకు సైతము కట్టం గొట్టం బట్టువడి తమ్ము వారివశము సేయునట.

**పెరుమ్ పశుక్కళ్** — కసవు నీరును ధారకముగాఁ బెరుగుట గాక శత్రుంజయము శ్రీరామస్పర్శంబున నట్లు కృష్ణస్పర్శంబుననే పెరిగినవట.

**నీజ్గాద శెల్వమ్ నిఱైన్దు** — చేతనుల పుణ్యపాపమూలం గొలిచి ఫలంబిడు నీశ్వరుని పట్టికాక 'పాపానాం వా శుభానాం వా' యని పాపశుభులనెన్నని దయగల యామె కటాక్షమునఁ గలిగినదని తోఁపించునట. నిండునట్లు కుండ నింపునని యన్వయము.



## నాల్గవ పాశురము

పర్జన్యదేవునిం గృష్ణసాదృశ్యమునం గొనికూడి స్వాభిమతవర్ధకంబగు వర్షఫలంబుం బ్రార్థింపుచున్నారు.

'ద్రవన్తి దైత్యాః ప్రణమన్తి దేవతాః' అని భగవత్సమాశ్రయణంబు చేసినవారలకు దైత్యులు బెదరుటయు దేవతలుపస్థానంబు సేయుటయు 'స్వపురుషమభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య కర్ణమూలే। పరిహర మధుసూదనప్రపన్నాన్ ప్రభురహమన్యనృణాం న వైష్ణవానామ్' (విష్ణు) అనియు 'తిఱమ్బెల్మిన్ కణ్డీర్ తిరువడి తన్నామమ్ మఱన్దుమ్ పుఱన్దొழாమాన్దరై — ఇఱైజ్జియుమ్ శాదువరాయ్ ప్పోదుమిన్గళెన్ఱాన్ నమనుమ్ తన్ తూదువరై క్కూవి చ్చెవిక్కే' అనియు భగవత్ప్రపన్నులం జూచి సేవించి సాధువులై పొండీ యని యముండు తన దూతలకుం జెప్పెననియు నిట్లు భగవత్సమాశ్రయణ ప్రభావంబుండ సర్వేశ్వరుండై కృష్ణుండై తమకు విధేయుండై యుండు మహాభాగ్యం బొనగూడినచో దేవతలు విధేయులగుట యాశ్చర్యంబు గాదు గాన పర్జన్యదేవత విధిప్రతీక్షయగుటం గాంచి యిట్టిట్లు సేయవలయునని విధింపుచున్నారనియుం జెప్పెదురు.



ఆఴిమఴైక్కణ్ణా!...
ముదల్వన్ ఉరువమ్బోల్ మెయ్కఱుత్తు...
ఆఴిపోల్ మిన్ని, వలమ్బురిపోల్ నిన్ఱదిర్న్దు...
శరమఴై పోల్ వాఴ వులగినిల్ పెయ్దిడాయ్



# 4

ఆఴిమఴైక్కణ్ణా! ఒన్ఱు నీ కై కరవేల్

ఆఴియుళ్ పుక్కు ముగన్దుకొడార్ త్తేఱి

ఊఴిముదల్వనురువమ్పోల్ మెయ్కఱుత్తు

పాఴియన్దోళుడై ప్పఱ్పనాబన్ కైయిల్

ఆఴిపోల్ మిన్ని వలమ్బురిపోల్ నిన్ఱదిర్న్దు

తాఴాదే శార్ఙ్గముదైత్త శరమఴైపోల్

వాఴవులగినిల్ పెయ్దిడాయ్ నాఙ్గళుమ్

మార్గఴినీరాడ మగిఴ్న్దేలోరెమ్బావాయ్.

ఆఴిమఴైక్కణ్ణా : గంభీరస్వభావుండవై వర్షము నిర్వహించువాడా

ఒన్ఱు నీ కై కరవేల్ : ఒక్కపుడును నీ యౌదార్యంబుం దప్పకుమీ

ఆఴియుళ్ పుక్కు : సముద్రములో జొచ్చి

ముగన్దు కొడు : జలపానము చేసి

ఆర్త్తు ఏఱి : గర్జించి ఎక్కి

ఊఴి ముదల్వన్ ఉరువమ్ పోల్: కాలోపలక్షిత జగత్కారణంబైన వాని విగ్రహంబువలె

మెయ్ కఱుత్తు : మేను నల్లబడి

పాఴి అమ్ తోళ్ ఉడై : ప్రబలమై (విశాలమై) సుందరంబైన భుజంబు గల

పఱ్పనాబన్ కైయిల్ : పద్మనాభుని శ్రీహస్తంబునందలి

ఆఴిపోల్ మిన్ని : శ్రీ సుదర్శనంబు మాడ్కి మెఱిసి

వలమ్బురిపోల్ నిన్ఱు అదిర్న్దు : దక్షిణావర్తంబగు శ్రీ పాంచజన్యంబు చందంబున నిలిచి ఘోషించి

శార్ఙ్గమ్ ఉదైత్త శరమఴైపోల్: శ్రీ శార్ఙ్గము చిమ్మిన బాణవర్షంబు వలె

వాఴ : సుఖించుటకు

నాఙ్గళుమ్ మార్గఴి నీరాడ : మేమును ఆనందించి మార్గశీర్ష

మగిఴ్న్దు : స్నానంబు చేయ

తాఴాదే : తడవు చేయక

ఉలగినిల్ పెయ్దిడాయ్ : లోకమందెల్ల వర్షింపుమీ.

ఆఴిమఴైక్కణ్ణా — సృష్టి సంహారంబుల బ్రహ్మ రుద్రులపై నునిచి పాలనంబు తానె నడపు నారాయణునియట్ల లోకుల దండించుట మొదలగు క్రూర వ్యాపారంబుల యమాదులపై నుంచి జగమును సరసవ్యాపారంబులం గాపాడువాఁడవు గావే నీవు. ఇందువలన లోకుల నీచత్వంబెన్నక నీ మహాత్త్వంబునకుం దగునట్లు వర్షింపుమనుట - మండలవర్షనిర్వాహకా యనియుం జెప్పవచ్చును - వేఱువేఱుగ జనుల సుకృత దుష్కృతంబుల విచారింపక యస్మద్భాగ్యఫలంబు నందఱకుం బంచియిడుమని భావము. 'పాపానాం వా శుభానాం వా' (రా-యు) అని పాపశుభవిభాగంబు విడిచి యందఱం గాపాడ దలంచు నామె తెగవారుగాన నిట్లు సెప్పుట. లోకదృష్టి రాజాన్తఃపురంబున నున్నం దగునే యనియుం జెప్పుదురు. బాలలు గానఁ బర్జన్యదేవా యని పిలువ నెఱుంగమి నధికృతకృత్యముం బురస్కరించి పిలుచుట.

ఒన్ఱు నీ కై కరవేల్ — చేతనుల గుణదోషములం గొలిచి ఫలంబులిడు నీశ్వరుని గోష్ఠిం జూడక 'న కశ్చిన్నాపరాధ్యతి' (రా-యు) యను మావారి సిద్ధాన్తముఁబట్టి వర్షింపుమని భావమని చెప్పుదురు.

ఆఴియుళ్ పుక్కు — సగరపుత్రులు త్రవ్విన గుంటందాగు మహాసముద్రమునం జొరవలయునట. అదియు రేవునం గాదు. మధ్యభాగంబున నట.

ముగన్దు కొడు — పైపై నీరు గొనివచ్చుట గాదు - సముద్రములో నిసుక శేషింపవలయునట.

ఆర్త్తు — కానరాక యుండి కాపాడు నంతర్యామివలెం గారాదు. ప్రాయోపవిష్టులగు వానరులెల్ల నాంజనేయుని యాగమంబుగని సంభ్రమంబందినట్లు నాడెల్ల నీ ధ్వని విని మనునట్లు మెఱుపులు నుఱుములు విల్లుం జూపి మహాసంరంభంబుతోఁ గానరావలయునట.

ఏఱి — ఆకాశంబెల్ల నిరవకాశంబగునట్లు. 'విణ్ణీలమేలాప్పు విరిత్తాఱ్పోలే' (నా-తి) మిన్నెల్ల నల్లని వితానంబు పరిచినట్లును 'మదయానై పోలెழுన్దు' అని మదగజంబులవలె లేచియు వ్యాపరింపవలయునట.

ఊశ్రీముదల్ వఽ ఱరువన్పోల్ మెయ్కఱుత్తు — అవిభక్తతమ శ్శబ్దవాచ్యంబగు నవస్థంజెందిన ప్రకృతిశరీరంబుగాన నిట్లు సెప్పుట. చిరకాలము తనయం దుపసంహృతంబైన జగము వెండియుం బొడమింప సంకల్పించుచోఁ గారుకొన్న పైరులకట్లు మొదలం బొడమిన వైలక్షణ్యంబు దలంచి యిట్లు సెప్పుట యనియుం జెప్పుదురు. మేను నల్లదనంబున సాటియగుటెంతియగాక యాతనిలోని సారస్యంబు మీఁకు గలుగునే. వర్షించిన పై వెల్లబారుట తప్పదని తోఁపింప మేను నల్లఁదుటయె చెప్పంబడినది.

పాశ్రీఅమ్ తోళ్ ఉడై — కువలయాపీడ మల్ల కంసాదినిరసనంబున ననాయాసంబగుటం బ్రబలత్వము - 'బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః' (రా-) అనుచొప్పున రక్ష్యవర్గంబెల్లఁ దన నీడ నొదిగినను తన రక్షణసామగ్రి మిగిలియుండుట విశాలత్వము. అట్లుగాక నిస్సారంబై నంగూడ విడువంజాలని యందమున సుందరంబగుట. రక్షకంబే భోగ్యంబయ్యెనని భావము.

పఱ్పనాబన్ — బిడ్డను తొట్టెలోఁ బెట్టి చుట్టుం దెరంగట్టి యాయుధపాణియై కాపుండువానివలె శ్రీనాభికమలంబున బ్రహ్మను సృజించి పెట్టి భుజంబులం గాపాడువాఁడట.

కైయిలాళ్ళిపోల్ మిన్ని — గృహస్వామి పుత్రజన్మంబు విని కనియేనియుం బొడముహర్షంబు గాంభీర్యంబునం బయికిం దోపింపకున్నను దాసవర్గంబు ప్రీతి ప్రకాశంబగునట్లు వసంతమాడుట మొదలగు సంభ్రమంబులు సేయుచందంబున బ్రహ్మోత్పత్తిసంభ్రమంబు శ్రీసుదర్శనుండు గొనియాడునట.

వలమ్బురి పోల్ నిన్ఱు అదిర్న్దు— 'స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్' (భ-గీ) అన్నచొప్పున భారత సమరంబునఁ బ్రతికూలహృదయవిదారణంబగు శ్రీ పాంచజన్యంబు నూఁడ్కి నుండి దానివడువున నొక్కమాఱు ఘోషించి యుండుట లేక యేకముగా ఘోషింపవలయునట.

తాళాదే – మా నోఁబునం గలుగు నుపవాసకృశత్వము చూచుచుండు విళంబంబుం గూడదు. తన్ను సేవించుట దేవమాతృకంబువలెం గాక నదీమాతృకంబువలె నియతఫలం బగున ట్లార్తికి మున్నె రక్షించు నీశ్వరునివిధంబు గావలయును.

శార్ఙ్గమ్ ఉదైత్త శరమళై పోల్ – నిరాహార సర్పంబువలె నింతకుమున్ను నిర్విషయంబై యడంగియున్న విల్లు శ్రీరామదేవుండు కను సన్నసేయునంతన 'శరవర్షం వవర్ష హ' యన్నవిధంబున బాణ వర్షంబు తానే కురియుచుండి 'ఎయ్‌వణ్ణ వెఞ్జిలై (తి-నె) అనిన చొప్పున నేయుటయే స్వభావంబుగాఁ గల క్రూరకోదండంబు గావున స్వామి యమ్ము విడుటం దక్క చేయవలయునది లేకుండ భృత్యవర్గంబు సేగినచోఁ బృథివీపతికి నాగదన్న చందంబునఁ బ్రయోక్తకు సైతము 'అవష్టభ్య మహద్ధనుః' (రా-అ) అనుచొప్పున నతిప్రయత్ననివార్యంబై యుండునట.

వాళ ఉలగినిల్ పెయ్‌దిడాయ్ – శరవర్షంబువలె రాక్షస ధ్వంసంబు సైతము సైరింపరాదట - అనుకూల ప్రతికూల విభాగంబు లేక లోకమెల్ల సుఖింపవలయునట.

ఇది నాకు మున్నె నిశ్చితంబైన పనిగాదో యని యతండు శంకించునని తలంచి చెప్పుచున్నారు.

నాఙ్గళుమ్ మార్గళినీరాడ మగిళ్న్దు – మేము నోము నోచిన వారమై దాని ఫలంబైన వర్షంబు గలిగి కృష్ణసంశ్లేషలాభంబున నానందించి స్నానము సేతుము. ఇతరులకు మార్గశీర్ష స్నానంబుదక్క నటపై ప్రీతిపూర్వక స్నానంబుసేయు నిర్బంధంబు లేదుగదా. మా కట్లు గాదు. నీకుఁ బ్రియంబగునట్లు మేమును శ్రీ కృష్ణుఁడు నానందించి స్నానముసేయుదు మనుచున్నారట. వర్షింపుమీ యని క్రియతో నన్వయము.

## ఐ ద వ పా శు ర ము

మనమిట్లు పెద్దగా నుద్యోగించి యందుకుం బుచ్చితిమి. మన కిది సిద్ధించుటకు విరోధులయిన కర్మంబు లనేకంబులుండ నది యెట్లు సిద్ధించు. 'శ్రేయాంసి బహువిఘ్నాని' యనిన చొప్పున శ్రేయః కార్యంబులెల్ల విఘ్నభూయిష్ఠంబులు గదా. శ్రీ వసిష్ఠాదులు ముహూర్తసంవిధానము సేయు 'ఇచ్ఛామో హి మహాబాహుమ్' (రా-అ) అని యట్లు పౌరజనాభిమతంబై యును, పుణ్యాధికుం డయిన శ్రీరామదేవుని పట్టాభిషేకంబే విహతంబయ్యెగాదే యని ప్రశ్నముసేయ, వారిలో వేదాంతజ్ఞానముగల యొకర్తె ప్రాప్యప్రాపక రూపంబుల భోగ్యుండయిన భగవంతుని మనమనుభవించుచోఁ జిత్తోపహతుండు భోగార్థంబుగా క్షీరపానంబుసేయం జిత్తంబు దనంతనె తొలఁగునట్లు విఘ్నంబు లెల్లం దొలంగు ననుచున్నది.



## 5

మాయనై మన్నువడమదురై మైన్దనై
తూయ పెరునీర్ యమునైత్తుఱైవనై

ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమణివిళక్కై
త్తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్ద దామోదరనై

తూయోమాయ్ వన్దునామ్ తూమలర్ తూవిత్తొఴుదు
వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క

పోయపిఴైయుమ్ పుగుదరువాన్ నిన్ఱనవుమ్
తీయినిల్ తూశాగుమ్ శెప్పేలోరెమ్బావాయ్.

| | |
|---|---|
| మాాయనై | : ఆశ్చర్యచేష్టితుని, |
| మన్ను వడమదురై మైన్దనై | : భగవత్సంబంధంబు నిత్యముగా నుండు ను త్తరమధురకు బలవంతుని ( బాలుని, రాజును ) |
| తూాయ పెరునీర్ యమునై త్తుఱైవనై | : పరిశుద్ధము నగాధంబు నగు నీరుగల యమునానది రేవువాని |
| ఆయర్ కుల త్తినిల్ తోన్ఱుమ్ అణివిళక్కై | : గోపకులంబునం బ్రకాశించు మంగళ దీపమును |
| తాాయైకుడల్ విళక్కమ్ | : తల్లిగర్భంబునకుం బ్రకాశంబు |
| శెయ్ద తాామోాదరనై | : నేసిన దాామోాదరుని |
| తూాయోాయాాయ్ వన్దు నామ్ | : పరిశుద్ధులమై వచ్చి మేము |
| తూామలర్ తూావి | : పరిశుద్ధ పుష్పంబుల సమర్పించి |
| తొాళుదు | : సేవించి |
| వాాయినాల్ పాడి | : నోటం బాడి |
| మన త్తినాల్ శిన్దిక్క | : మనసున ధ్యానింప |
| పోయపిళ్ళైయుమ్ | : పూర్వాఘంబులును |
| పుగుదరువాన్ నిన్ఱనవుమ్ | : ఉ త్తరాఘంబులును |
| తీయినిల్ తూాశాగుమ్ | : నిప్పుపై దూదియగును |
| శెప్పు | : చెప్పుమిాా. |

మాయనై — శ్రీవైకుంఠము నందలి యైశ్వర్యంబు దలంచి అది వాచామగోచరంబు గామియు శ్రీకృష్ణావతారంబు నందలి సౌలభ్యంబుం దలంచి యదియు నట్లగుట నది వైకుంఠంబునందనుభవింపం జూచి యొక్క యూరునకు తన్ను నిచ్చిన యా సౌలభ్యంబుకంటె నొక్క లోకంబునకెల్లం దన్నొసంగిన యా సౌలభ్యంబు మిక్కుటంబు గాన నదియు నట్లగుటయు 'జాతోఽసి దేవదేవేశ శఙ్ఖచక్రగదాధర'(విష్ణు-౫౮) అనుచొప్పున నిత్యసూరులకు నద్భుతావహంబైన నిరఙ్కుశైశ్వర్యంబు వాఁడు సుమిమ్మీ యిట్లవతరించెనని యవతారసౌలభ్యంబు సెప్పంబోయి యందు మునింగి యాశ్చర్య మాశ్చర్యమని యూరకుండుట.

జాతోఽసి — దేవకికడుపునం బండ్రెండు మాసములు పుత్రత్వ మునం గొదువదీర నుండి నేడు నీవయినం బుట్టనైతి నవవశంబె యని ముదలకించుట.

దేవదేవేశ — ఇట్లు పుట్టినవాఁడవొక్కనాఁడుం గర్మస్పర్శంబు లేనివారి మేలువాఁడవు గావే యనుట.

శఙ్ఖచక్రగదాధర — నీ యసాధారణ చిహ్నంబులతోఁ గాదే నీ వవతరించితి వనుట.

మన్ను వడమదురై —మున్ను శ్రీవామనుని సిద్ధాశ్రమంబై వెనుక శ్రీ శత్రుఘ్నుండు మన్నెముం గొట్టి పట్టణంబు సేయుటయు నిప్పుడు 'మథురా నామ నగరీ పుణ్యా పాపహరా శుభా।యస్యాం జాతో జగన్నాథ స్సాక్షాద్విష్ణుస్సనాతనః॥' అనుచొప్పున 'నలమన్నమిల్లదోర్ నాడు' అనంబడిన యానందపరిచ్ఛేదము లేని లోకంబగు శ్రీవైకుంఠము మాడ్కి భోగ్యతాతిశయమున సుప్రసిద్ధమై సిద్ధోపాయమును మన కిచ్చిన సాధనంబై విరోధినిరసనమును దానే చేయంజాలి ప్రాప్యస్థానంబై జగన్నాథుండగుట తన ప్రజల పాపంబులం దీర్చ దన స్వభావంబుతోనె వ్యాపకుండైయు నిత్యుండైయు వ్యాప్త్యేకదేశంబగు తనయం దాశ్రిత

సజాతీయుండై పుట్టుటయు నిట్లు సర్వేశ్వరుండు మాటిమాటికిం దనతో సంబంధంబుగన్న ప్రదేశమనుట.

మైన్దనై — 'తన్దైకాలిల్ పెరువిలఙ్గు తాళవిழ நళ్ళిరుట్టణ్ వన్దవెన్దై' అని తల్లిదండ్రుల కాలిసంకెల సడలివచ్చిన స్వామియగుటయు నవతారానన్తరంబున బాలుండై త్రోచుటయు నందఱం దనరూపంబున వశంబు సేసికొనుటయు వరుసనే సాధకములు.

తూయపెరునీర్ యమునైత్తుఱైవనై — శ్రీ వైకుంఠంబునకు విరజయట్ల వచ్చినచోటను నొక్క నది గలదనుట. 'వసుదేవో వహా విష్ణుం జానుమాత్రోదకో యయౌ' (వి - ౫.అ) అనుచొప్పున శ్రీవసుదేవుండు శ్రీకృష్ణునింగొని పోవునప్పుడు భవ్యమై మోకాలిబంటిగా నుండుటయు, కృష్ణుండునుం బడుచులును మాటిమాటికిం బుక్కిలించుటయును, 'ప్రసాదం నిమ్నగా యాతా జాయమానే జనార్దనే' (వి - ౫అ) అని కృష్ణావతారంబునం దేటయగుటయుం బరిశుద్ధమనుటకు హేతువులండ్రు. 'యమునాం చాతిగమ్భీరామ్' (వి-౫అ) అని యత్యగాధంబైనదియె కదా భవ్యంబైనది. రాసగోష్ఠీస్థానంబు గనం బడుచులు దొరకొను రేవువాఁడనుట.

ఆయర్కులత్తినిల్ తోన్ఱుమ్ అణివిళక్కై — శ్రీ వైకుంఠము కంటెను గొల్లపల్లెలో గుణంబులు అంధకారదీపము వలె నత్యుజ్జ్వలములట. అవతారంబు మధురయందైనను బ్రకాశంబిందనియుం జెప్పవచ్చును. 'అచ్యుతభానునా దేవకీపూర్వసంధ్యాయామావిర్భూతమ్' (వి - ౫అ) అనుచొప్పున వాస్తవసంబంధంబు లేమిని పూర్వసంధ్యకు సూర్యసంబంధంబట్లు దేవకీగర్భముతో నీతని సంబంధమనుట.

తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్ద తామోదరనై — 'కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా' (రా - బా) అన్నచొప్పున కౌసల్య శ్రీరామదేవునిచేతం బ్రకాశించినట్లు. 'ఎన్ననోన్బు నోఱ్ఱాళ్ కొలో

ఇవనై ప్పెఱ్ఱవయిఱుడై యాళ్ ' (పె-ఱ్-తి) ఏమినోము నోచినదో యీతనిం గన్న కడుపుగల తల్లి యని లోకుల పొగడుగాంచుటచేం దన్నుఁ గన్నకడుపునకుం బట్టము గట్టినవాఁడై, తన భవ్యతచే లోకులు దల్లిం బొగడునట్లుగా మన బంధంబు మనకుం ద్రుంపరానియట్లు తనకుం ద్రుంపరాని తన యుదరబంధనముం జింతించు నాశ్రితుల బంధములం బోఁగొట్టువాని.

తూయోమాయ్ వన్దు నాన్ — విషయాన్తరవైముఖ్యం బను భావశుద్ధి దక్క మఱి శుద్ధి వెదుకంబని లేదు కదా. 'శుద్ధం వేత్తి విభీషణమ్' (రా-యు) అని పుత్రదారాదుల విడిచి వచ్చిన శ్రీవిభీషణునినున్న చందంబుననే శుద్ధునింగాం దలంచెగదా. ఎట్లున్నవా డట్లనే యధికారియనియు అతండు గొల్లవాఁడుగా మేము వ్రేతలమై వచ్చితిమని యర్థంబనియు భట్టార్యుని గోష్ఠికి నత్త్రైవర్ణికులు వెలిగా నిలువ నిప్పుడిది గొల్లపల్లెనుండీ రండీ యనెననియుం జెప్పుదురు. 'ఉపస్థేయైరుపస్థితః' (రా-అ) అని నేను వచ్చి సేవింపందగినవారు నన్ను జూడవచ్చిరని చెప్పినవాఁడు గాన నతండు రాఁజూచు మనమె వచ్చి. ఉపాయమందలి అధ్యవసాయంబు వెడలనీనియ ట్లుపేయత్వర మర్యాదనుండనీదు.

తూమలర్ — 'మిక్కశీర్ తొండరిట్ట పూన్దుళవు' (తి-మొ) మిక్కిలి గుణములు గల దాసులిడిన శ్రీతులసి యనియు, 'శూట్టున న్మాలై గళ్ తూయనవేన్ది' (తి-వి) చుట్టిన మంచి పూదండల శుద్ధులై యెత్తి అనియుం జెప్పినచొప్పున ననన్యప్రయోజనంబులైన పూవులు యోగ్యాయోగ్యవిభాగంబుం జూడక కంటికిఁ దోచిన పుష్పమెల్ల ననియుం జెప్పుదురు.

తూయ్ — 'యథా తథా వాఽపి' (ఆ-స్తో) అను న్యాయం బునం బ్రేమబలాత్కారంబునం గ్రమము దప్పియైనను.

తొழுదు — 'ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి' అని మొఱవెట్టిన మాత్రనె ఋణంబు పెరిగి యెద నెడలకున్న దను వాఁడు గాన నంజలియె యతనికి భరంబట. వాని యంజలిం గొను

వారు వాని కంజలి సేయుట పిత్రాదులకుఁ దప్పఁగాఁ దోఁచకుండుటకై యనియు నాలంకారికపద్ధతిం జెప్పుదురు.

వాయినాల్ పాడి — నోరుగలుగుట సఫలంబయ్యెనే యని శ్రీమన్నామంబులం బాడి; మనస్సహాయము లేకుండనే పాడి యనియును, 'ఉవాచ' అన్నచొప్పున వచ్చుటయుం గాక చెప్పుటయుం జేసితి మనుటయుం జెప్పుదురు.

మనత్తినాల్ శిన్దిక్క — 'యత్పురుషో మనసాఽభిగచ్ఛతి యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి' అని మనసునం దలంచినదానిని నోటం బలికి క్రియం జేయునను క్రమంబు తప్పనట్లు వేలువేలుగాఁ గరణంబులు పైబడుచున్నవట.

పోయ పిఴైయుమ్ పుగుదరువాన్ నిన్ఱనవుమ్ — పూర్వాఘంబులును ఉత్తరాఘంబులును కృష్ణానుభవప్రతిబంధకంబులగునవి యెల్ల ననుట.

తీయినిల్ తూశాగుమ్ — శర్కరయుం బాలును గ్రోలం బిత్తరోగంబు తానే పోవునట్లు, 'ఇషీకతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత' (ఛాన్దో) అని నిప్పున నిడిన దూది భస్మంబగునట్లు నశించుట.

శెప్పు—చెప్పుమీ. అంతియు చాలునట. పూర్వాఘమనాది కాలమునుండి బుద్ధిపూర్వకముగాఁ జేసినది. ఉత్తరాఘమనఁగా భగవజ్ఞానము పుట్టినపైఁ బ్రకృతి వాసనచేతం బ్రామాదికంబుగా వచ్చునది యని చెప్పుదురు.



ఇట్లు అయిదు పాశురంబులచేతం బ్రాప్యప్రాపకాధికారి స్వరూపంబులును అట్టియధికారి కనుష్ఠేయమగు నంశంబును అవాంతర ఫలంబగు వర్షాది సంపత్తియును వర్షార్థంబుగాఁ బర్జన్యదేవుని శ్రీ కృష్ణసాదృశ్యంబునం బొగడుటయును, ప్రధాన ఫలంబైన భగవదనుభవంబునకు వచ్చు విరోధులు శమించు విధంబునుం జెప్పి ‘కాలాళుమ్ నెఞ్జళియుమ్ కణ్ శుళలుమ్’ అని కాళ్ళు దిగంబడును మనసు శిథిలంబగును కన్నులు దిరుగుననియు ‘ఉయిర్ కాత్తాళ్చెయ్యిమ్మిన్’ (తి-వా-మొ) ఆ ప్రాణమును గాచుకొని దాస్యము సేయుండీ యనియును ‘ఆళియొఱుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయ వడిగళై యిన్నారెన్ఱఱియేన్’ (తి - మొ) చక్రముతో సువర్ణపూర్ణంబైన శార్ఙ్గధనువుగల స్వామి నిట్టివారని యెఱుంగననియుం జెప్పినచొప్పున నవగాహించువారి ముంచివేయు స్వభావంబుగల భగవద్విషయంబున ‘అడియార్గళ్ కుళాఙ్గళై’ అని నిత్యసూరుల సంఘంబుల ననుటచేత వారలకు సైతమొంటిగా ననుభవించుట దుస్తరంబు గాన పూర్ణనదీప్రవాహంబునం జొచ్చు చందంబున సహాయాపేక్ష గలుగుటయు నందును, ‘ఇమైయోర్తమక్కుమ్-శెవ్వే నెఞ్జాల్ నినైప్పరిదాల్ వెణ్ణెయూణెన్నుమీనచ్చొల్’ అని నిత్యసూరులకు సైతము లెస్సమనసుచేఁ దలంప శక్యంబు గాదు వెన్న దినుటయను నీ లఘూక్తి యనుచొప్పున సౌలభ్య మహిమ సౌందర్య సాగరం బయిన శ్రీ కృష్ణుని గుణానుభవంబు నిత్యసూరులకు సైతము దుస్తరంబై యుండ గొల్ల పిన్నపడుచులకు కైముతికన్యాయసిద్ధం బగుటయు, ‘ఏకః స్వాదు న భుఞ్జీత’ అనునట్లు ఒంటిగా స్వాదుపదార్థంబు

లనుభవింపని ధార్మికప్రకృతులగుటయు **రు**చిగలవా రందుకుం జెడుచోఁ జూచి సైఁచువారు గామియు. భగవదాశ్రయణంబుం దదీయ పురస్సరంబుగాఁ జేయుట యౌత్సర్గికంబగుటయు ననుభావ్య కృష్ణగుణంబులు కొందఱి నిమిత్తులంజేసి కృత్యముగ్ధులం జేయుటయుం గొందఱి నున్నచో నుండనీక నాడించుటయుం గలదు గాన మున్ను లేచినవారలు లేవం జాలక పవ్వళించియున్నవారల లేపంబూని యందును ముందుగా నూతనురాలగుట నోమునందలి రుచి లెస్సగా నెఱుంగని యొక్క పడుచును లేపుచున్నారు.





## 6

పుళ్ళుమ్ శిలమ్బినకాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్

వెళ్ళైవిళిశఙ్గిన్ పేరరవమ్ కేట్టిలైయో

పిళ్ళాయెఴున్దిరాయ్ పేయ్ములైనఞ్జుణ్డు

కళ్ళచ్చగడమ్ కలక్కఴియక్కాలోచ్చి

వెళ్ళత్తరవిల్ తుయిలమర్న్ద విత్తినై

ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్గళుమ్ యోగిగళుమ్

మెళ్ళవెఴున్దరియెన్ఱ పేరరవమ్

ఉళ్ళమ్పుగున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్.

పిళ్ళాయ్ : పిన్నదానా

పుళ్ళుమ్ శిలమ్బినకాణ్ : పక్షులు కూసినవి సుమ్మా.

పుళ్ళరైయన్ కోయిలిల్ : గరుడస్వామియగు సర్వేశ్వరుని యాలయమునందు

వెళ్ళై విళి శఙ్గిన్ : వెల్లనైన ఘోషించు శంఖముయొక్క

పేరరవమ్ కేట్టిలైయో : మహాఘోషము వినవే.

పేయ్‌ములై నఞ్జు ఉణ్డు : పూతనాస్తన విషం బారగించి

కళ్ళచ్చగడమ్ కలక్కఴియ : వంచకమగు శకటము బలక్షీణంబగునట్లు

కాలోచ్చి : కాలు చిమ్మి

వెళ్ళత్తు అరవిల్ : పాలసముద్రమున శేషసర్పముమీద

తుయిల్ అమర్న్ద విత్తినై : యోగనిద్రలో అమరిన కారణభూతుని

ఉళ్ళత్తు క్కొణ్డు : మనసునం గొని

మునివర్గళుమ్ యోగిగళుమ్ : మననశీలురును యోగాభ్యాసముసేయు వారలును

మెళ్ళ ఎఴున్దు : మెల్లగా లేచి

అరి యెన్ఱ పేరరవమ్ : హరిర్హరిః అనిన మహాఘోషము

ఉళ్ళమ్ పుగున్దు కుళిర్న్దు : హృదయములో జొచ్చి చల్లపడునట్లు

ఎఴున్దిరాయ్ : లే లే

పుళ్ళుక్ శిలమ్బినకాణ్ — ఈ పదుచులు పెందలకడ లేపంజూచి తెల్లవారుచుండం బన్నుండందగునే యని శిష్టగర్హసేసి ఆబిడ తెల్లవార లేదనినం దెల్లవారినదనిన నందు కెచ్చటాలం బేమనిన మేము మేలుకనినదే యనిన 'ఉణ్ణో కణ్కళ్ తుఞ్జుదలే' (తి-వి) కలదో కన్నులు మోడ్పుట యన్నచొప్పున నున్న మీకు నిద్దురయును మేల్కనుటయుం గలదే యనిన వేఱడియాలంబు గలదనుటకుం బక్షులు సైతము రొద సేయుచు లేచి మేత కేగుచున్నవనుట.

మీరు పక్షులను లేపినవి లేచి యుండును, 'కాలై యెழున్దిరున్దు కరియ కురువిక్కణఙ్గళ్' (నా తి) ప్రాతఃకాలమందే లేచియుండి పక్షిగణములు నామకీర్తనంబు సేయు నన్నచొప్పున మీరు పుట్టిన యూరిలోం బక్షులకు నిద్దురగలదే మఱియొక్కటి సెప్పం డనినం జెప్పుచున్నారు.

పుళ్ళరైయన్ కోయిలిల్ — గరుడాలయమునందని కాని, గరుడస్వామియగు సర్వేశ్వరుని యాలయమునందని కాని చెప్ప వచ్చును.

వెళ్ళై విళి శఙ్గిన్ పేరరవమ్ కేట్టిలైయో — ప్రాబోధిక శంఖధ్వని గాదే యది యనుట. శ్రీ రామదేవుఁడవతరించి సర్వస్వామియని కొనియాడం బడుచుండియు 'సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్' (రా-అ) అనుచొప్పునం దాను భజించుటకొక్క యాలయంబు గలుగునట్లు శ్రీకృష్ణునకు నొక్క దేవాలయంబు గలదని యెఱుఁగునది. 'లక్ష్మణపూర్వజం చ' (రా) అనుచొప్పున నాశ్రితులంబట్టి తనపేరు నిరూపించునట్లీశ్వరుండు వారలకైశ్వర్యం బిడుటంబట్టి గరుడస్వామి యనుట. పురుషకారపూర్వకముగాఁ జనువారు గాన నిట్లనిరనియుం జెప్పుదురు. అది యామంబులం దెలుపు

శంఖంబు గాదే యని శంకించుచునని మహాఘోషం బనుట. 'విళి శఙ్గు' అనఁగా పిలుచు శంఖంబు గాన సత్త్వోత్తరమయిన కాలంబున సేవింప రండీ యని పిలుచునట. శంఖధ్వని వినినప్పుడె దాని ధావళ్యంబు నుద్దేశ్యమయి తోఁచుట నదియుం జెప్పుట.

ఇట్లన విని నిరుత్తరయైయుం బన్నుండినం జెప్పుచున్నారు.

పిళ్ళాయెళ్లున్దిరాయ్ — భగవద్విషయంబునం బ్రోత్తదానవు గాన భాగవతసంశ్లేషభోగ్యత నెఱుఁగవు. మేము నిన్నుం జూడ నాసపడినట్లు నీవు మమ్ముం జూడ నాసపడవలదే. మిమ్ము నెవ్వరు లేపిరనినను దమదమ కార్యంబులు సేసికొను వారి ధ్వని విని లేచితి మనుచున్నారు.

పేయ్ములై నఞ్జుణ్డు — కావంగన్నతల్లియు డగ్గరని సమయంబున మారణసంకల్పముతో వచ్చిన దాని నా సంకల్పముతోనే నాశమునేయుట.

కళ్ళచ్చగడమ్ కలక్క—ళియక్కాలోచ్చి—తల్లి రక్షకై యుంచిన శకటమె యసురావేశంబున నపాయకారణంబగుచో స్తన్యపానమునకుం జాగర్యో నను పేర నిగుడం దన్నిన శ్రీపాదంబు దవిలి యది భగ్నమగుట. ఈ యపాయంబులు విన్నచో నులికి చయ్యన లేచునని యీ యపదానంబులెత్తుట.

వెళ్ళత్తరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై — ఇట్టి యపాయ ప్రసంగంబు లేక తన సౌకుమార్యంబునకుం దగునట్లు చల్లని వెల్లిలో నదియు నొత్తకుండ శైత్యమార్దవ సౌరభప్రకృతియగు శేషశయనముపై శ్రీ సంశ్లేషసంమర్దమునకుం గూడ నిద్దుర సెడక నలిపిన యవతారంబులం దనవిదీరక సకలావతారకందంబై యుండుటయు నిశ్వాససంస్పర్శ మాత్రంబున మధుకైటభులు మడియుటయుం దలంచి నిర్భయులై యానందింపుచున్నారు.

ఉళ్ళత్తుక్కొణ్డు — ' అరవత్తమళియినోడుమ్ అఙ్గియ పాఙ్కడలోడుమ్ అరవిన్దప్పావైయున్దానుమగమ్బడి వన్దు పుగున్దు ' అని పాము పానుపుతోడఁ బాలకడలితోడం బద్మాలయయుం దాను లోపలవచ్చి చొచ్చి యనియు, 'పనిక్కడలిల్ పళ్ళికోళై ప్పళ్ళగవిట్టోడి నన్నెన్మనక్కడలిల్ వాழవల్ల మాయమణాళనమ్బి ' అని చల్లని సముద్రమునందలి పడకను నిద్రను ప్రాతదియగుట విడిచి నా మనసను సముద్రమున సుఖింప సమర్థుండై యాశ్చర్యచేష్టితుండును శ్రేష్ఠుండునయిన పూర్ణుడా అనియుం జెప్పినచొప్పున మనసున ధ్యానించి.

మునివర్గళుమ్ యోగిగళుమ్ — ఇందుం బవ్వళించి యున్న వారిని లేపువారిని బోలిన వారలు. కృష్ణుని యవతారమయినప్పై నిచ్చటి మందలయందు సైతము యోగులు కాపుందురట.

మెళ్ళ ఎழுన్దు — ' హృదయేనోద్వహన్ హరిమ్ ' అన్న చొప్పున నీశ్వరుని డెందంబునం దాల్చినవారలు గాన గర్భిణులు ప్రజకు ప్రయాసంబు లేకుండ లేచునట్లు లేతురట.

అరియెన్ఱ — భగవదనుభవవిరోధులం బోఁగొట్టుకొనుట. భగవత్సంబంధ జ్ఞానము పుట్టిన పిదప ' అథ సోఽభయంగతో భవతి ' ( తైత్తి ) అని నిర్భయుండయి యున్నను స్నేహంబు మిక్కుటంబగుటను స్వానుభవవిషయంబగు నవ్విగ్రహమున కేమివచ్చునో యని బెదరుచుండుం గాన నసురులవలనం దనకుం గలుగు కీడులను దానే పోఁగొట్టి యీవలయు నను మంగళాశాసన మనియుం జెప్పుదురు.

పేరరవమ్ — అందఱును మేల్కాంచు కాలము గాన నొక్కపెట్టనే ఘోషించుట.

ఉళ్ళమ్ పుగున్దు కుళిర్న్దు — పడకక్రింద నీరువారినట్లు భగవన్నామము చెవి వెంటనే చొచ్చి వడకించుచున్నదట. భగవంతుండు వారి యుల్లములం జొచ్చి యానందించు నట్లు కృష్ణవిరహంబున బీటలువారిన హృదయము పదనుసేయునట్లు వీరిధ్వని మా డెందములం జొచ్చి యానందింపుచున్నది. కాంబట్టి లెమ్మా యనుచున్నారు.



## ఏడవ పాశురము

కృష్ణసంశ్లేషరసం బెఱింగియు మఱచియున్న యొక్క తెను లేపుచుండి తెల్లవారినది లెమ్మనంగా నా బిడ యందుకానవాలేమని శంకింపం జెప్పుచున్నారు.



## 7

కీశుకీశ్శెన్ఱెఙ్గు మానైచ్చాత్తమ్ కలన్దు
పేశినపేచ్చరవమ్ కేట్టిలైయో పేయ్ప్పెణ్ణే

కాశుమ్బిఱప్పుమ్ కలగలప్ప క్కై పేర్త్తు
వాశనఱుఙ్గుఴలాయ్చ్చియర్ మత్తినాల్

ఓశై పడుత్తతయిరరవమ్ కేట్టిలైయో
నాయగప్పెణ్పిళ్ళాయ్ నారాయణన్మూర్త్తి

కేశవనైప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో
తేశముడైయాయ్ తిఱవేలోరెమ్బావాయ్.

| | | |
|---|---|---|
| పేయ్ పెణ్ణే | : | వెఱ్ఱి పడుచా |
| కీశుకీశువెన్ఱు ఎఙ్గుమ్ | : | కీచుకీచు అని ఎల్లెడను |
| ఆనై చ్చాత్తన్ | : | భారద్వాజ పక్షులు |
| కలన్దు పేశిన పేచ్చరవమ్ | : | కూడి పలికిన పలుకుల శబ్దమును |
| కేట్టిలై యో | : | వినవో |
| కాశుమ్ పిఱప్పుమ్ కలకలప్ప | : | మంగళసూత్రముం దదితర కంఠాభరణంబులును ధ్వనింపగా |
| కై పేర్త్తు | : | చేతుల నాకర్షించి |
| వాశనఱుమ్ కుళల్ | : | వాసనం బరిమళించు కేశభారంబు గల |
| ఆయ్చ్చియర్ | : | గొల్లపడుచులు |
| మత్తినాల్ ఓశై పడుత్త | : | కవ్వమునం దరచబడిన |
| తయిరరవమ్ కేట్టిలై యో | : | పెరుగు శబ్దంబు వినవో |
| నాయగప్పెణ్ పిళ్ళాయ్ | : | స్వామినివైన పిన్నపడుచా |
| నారాయణన్ మూర్త్తి కేశవనై | : | నారాయణమూర్తియగు కృష్ణుని |
| పాడవుమ్ | : | పాడుచున్నను |
| నీ కేట్టే కిడత్తియో | : | నీవు వినియే పవ్వళించితివో |
| తేశముడై యాయ్ | : | తేజము గలదానా |
| తిఱ | : | తెఱువుము. |

కీశుకీశెన్ఱెఙ్గుమ్ ఆనై చ్చాత్తన్ కలన్దు పేశిన పేచ్చరవమ్ కేట్టిలై యో- ఒక్క పక్షి యరచినచో( దెల్లవారు ననవచ్చునే యనినను ఎల్లెడం గూయుచున్నవని చెప్పి అవియును మీరు లేపిన లేచియుండునన నొం డొంటి నెడబాసిపోవుచో( బగలంతయుఁ గలుగు విరహంబునం గలుగు వ్యసనంబుదోప( గలుగుచున్న కంఠనాదంబు వినవో. వినమికి నేమయినం గోలాహలంబు గలదో యని మరోన్మేద్ఘాటనము సేయు చున్నారు. వీరిట్లు సెప్పుటయే పనియని యా బిడ యూరక పన్నుండం జెప్పుచున్నారు.

పేయ్ప్పెణ్ణే — ఎఱింగియు నూరకున్నావే బుద్ధిహీనురాలా యనుట. భగవద్విషయమునం జొచ్చువారలకుఁ దదీయవిషయం బత్యన్తాభిమతంబు గాదే యని హృదయము.

నా బుద్ధిహీనతకేమి, తెల్లవారుట కానవాలు సెప్పుడీ యనినం బెరుగు తరుచు శబ్దము వినవో యనుచున్నారు.

కాశుమ్ పిఱప్పుమ్కలకలప్ప—'అరవ్వాఙ్గుశలాయ్మలైతేయ్క్క మొలి' (తి-య్-మొ) వాసుకిసర్పము త్రాడుగా మందరము దర్చు శబ్దమను నట్లు ధ్వనించుననుట.

కై పేర్త్తు — పెరుగు పేర్మియుం దమ సౌకుమార్యంబుం బట్టి కొండం బెకలించి నట్లుండుననుట. కృష్ణసన్నిధి లేమిం జేతులు సడలె ననియు నతండె చేరి, 'మోరార్ కుడమురుట్టి' (శి - తి - డల్) అని తత్రపూర్ణకుంభంబులం బొరలం ద్రోచి యనినట్లు పెరుగు మజ్జిగసేయనీ నని చెయ్యిపట్టి యూడిగబడుట ననియుం జెప్పవచ్చును.

వాశమ్ నఱుమ్కుఴల్ ఆయ్చ్చియర్—ఆయాసంబునం గ్రొమ్ముడి వీడం బరిమళంబు వెల్వడుననుట.

మత్తినాల్ ఓశై పడుత్త తయిరరవమ్ కేట్టిలైయో—'ఉద్గాయ తీనామరవిన్దలోచనం వ్రజాఙ్గనానాం దివమస్పృశద్ధ్వనిః । దధ్నశ్చ

నిర్మన్థనశబ్దమిశ్రితో నిరస్యతే యేన దిశామమఙ్గళమ్.' అనుచొప్పున వ్రజకన్యలు వాని పుండరీకంబులువోని కన్నుల యందంబునం దగిలి యూర్ధ్వలోకంబునకు సైతము వినంబడునట్లు పాడుటయు మందరంబున సంద్రంబు ద్రచ్చు విధంబునం బెరుగుద్రచ్చుటయుం గూడిన శబ్దంబు లెల్లదిశల నమంగళంబు లడంగునట్లు వెడలుచుండ నీకు వినంబడదో.

ఈ యూర లేయుంబగలు నెడమిడక ద్రచ్చుటయె స్వభావంబు పొమ్మని యూరకుండం జెప్పుచున్నారు.

నాయగప్పెణ్ పిళ్ళాయ్ — నీవిందఱకును నిర్వాహకురాలవగు చందంబిదియో యనియు చెప్పిన దానికెల్ల సాకు చెప్పుచుండుట యైశ్వర్యమదంబున ననియుం దోపం జెప్పుట. భావంబొక్కటియె గాన వెళ్ళెదనుటకును స్వామిని యనుటకును వాసిలేదు.

ఇట్లు సెప్పిన నూరకుండుటం జూచి చెప్పుచున్నారు.

నారాయణ్ణ మూర్త్తి కేశవన్నై ప్పాడవుమ్ నీకేట్టే కిడత్తియో— నీవు లేతువని మేము పాడ నది నీకు కాలువట్టినట్లు నిద్రాకరంబయ్యెనో, కానరాకయె వాత్సల్యమున రక్షించువాఁడు సౌశీల్యమునం గృష్ణుండై కంటికిం దోచి విరోధియగు కేశిని సంహరించుట నారాయణ కేశవ శబ్దముల నెత్తి ఖరవధానంతరమున 'భర్తారం పరిషస్వజే' అని స్వామిని గౌగలించికొన్న జనకరాజపుత్రివలె కృష్ణునిం గౌగలింప వెడలుదు వనుకొని చెప్పితి మదియు విరోధిభయంబు దీరి నీకు సుఖ నిద్రకుం గారణమయ్యెనే యనుట.

తేశముడై యాయ్ తిఱ — ఎంత సెప్పినను లేవమిచే నిది యేమని జాలకరంధ్రములం జూచుచోఁ గృష్ణగుణానుసంధానానందమున మేనం బుట్టిన తేజము గాంచి యా ప్రవాహంబునకుం గట్టుకట్టక నిన్నుఁజూడ మికి రాత్రియయి యున్న మా చీకటి తొలగునట్లు నీతేజము సూపుచు నీ నడ యందము గానవచ్చునట్లు నీవే వచ్చి తలుపు తెఱవుమీయనుట.



# 8

## ఎనిమిదవ పాశురము

అందఱును వచ్చి లేపునట్లు కృష్ణునివలని యతిశయము గల యొక్క పడుచును లేపుచున్నారు.

కీఴ్ వానమ్ వెళ్లె న్ఱెరుమైశిఱువీడు
మేయ్వా౯ పరన్దనకాణ్ మిక్కుళ్ళపిళ్ళైగళుమ్
పోవాన్పోగిన్ఱారై ప్పోగామల్కాత్తు ఉన్నై
కూవువా౯వన్దు నిన్ఱోమ్ కోదుకలముడైయ
పావాయెఴున్దిరాయ్ పాడిప్పఱైకొణ్డు
మావాయ్పిళన్దానై మల్లరై మాట్టియ
తేవాదిదేవనై చ్చెన్ఱునామ్ శేవిత్తాల్
ఆవావెన్ఱారాయ్ న్దరుళేలోరెమ్బావాయ్.

కీழ் వానమ్ వెళ్ళెన్రు : తూర్పుదెస నాకసము తెల్లవారినది
ఎరుమై శిఱువీడు మేయ్‌వాన్ : గేదెలు కొన్ని విడువడి మేతకై స్వేచ్ఛగా
పరన్దనకాణ్ : జెదరుచున్నవి
మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్ : తక్కిన పడుచులును.
పోవాన్ పోగిన్ఱారై పోగామల్ : పోవం బోవుచుండువారలం బోకుండ
కాత్తు : నిలిపి
ఉన్నైక్కూవువాన్ వన్దు నిన్ఱోమ్ : నిన్ను పిలువవచ్చి నిలిచితిమి
కోదుకలముడైయ పావాయ్ : కౌతూహలముగల భామినీ
ఎழுన్దిరాయ్ : లెమ్ము.
పాడి ప్పఱై కొణ్డు : పాడి వాద్యవిశేషముం గొని
మావాయ్ పిళన్దానై : అశ్వరూపుడైన కేశి నోరు చీరినవాని
మల్లరై మాట్టియ : చాణూరాది మల్లుల సంహరించిన
తేవాదిదేవనై శెన్ఱు నామ్ : దేవదేవుని సన్నిధిం జేరి మనము
శేవిత్తాల్ : సేవించినచో
ఆవావెన్ఱు ఆరాయ్‌న్దు అరుళ్ : అయ్యోయని విచారించి దయసేయును.

కీழ் వానమ్ వెళ్ళెన్ఱు — ఇంకం బవ్వళింతువో అనుట.

తూర్పుదెసం జూచుచో మీ ముఖకాంతులందుం బ్రతిఫలించినం దెల్లవారెనని యన్యథాజ్ఞానము వొడమె నింతియ యని యా బిడ సెప్ప వేఱొక యడియాళ్ము సెప్పుచున్నారు.

ఎరుమై శిఱువీడు మేయ్‌వాన్ పరన్దనకాణ్ — గేదెలు కొన్ని విడువడి మేతకై స్వేచ్ఛగాఁ జెదరుచున్నవి. మంచుగడ్డిమేతకు విడువడి చేలకు సాగినవి. నందగోపాలునకుఁ గృషి గోరక్ష వాణిజ్యములు మూడుం గలవు. కృష్ణుండు వానివెంట నేగినచో నావెనుక నెవ్వనిం జూచెదము. అగ్నిహోత్రానస్థానములందక్క వేఱెయుఁగని విష్ణుచిత్తుని కూతురు గేదెలమందవాని యెఱుఁగునట్లు గదా హృదయాభినివేశము పరిణమించినది.

మీ ముఖకాంతులకో యరుణోదయమునకో బెదరి చీకటులు గుంపుగుంపులుగా నవి గేడెలని భ్రమించెద రింతియ. లేనిచో బహుజన సంకులంబయిన యీయూరంగల తక్కిన పడుచులును లేవరే యనినం జెప్పుచున్నారు.

మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్ పోవాన్ పోగిన్రారై ప్పోగామల్ కాత్తు ఉన్నైక్కూవువాన్ వన్దునిన్రోమ్ — తక్కిన పడుచులు నీవలె లేపు నందాక నుండలేక యర్చిరాదిగతి-అక్రూరయాన-శ్రీ వేంకటయాత్రల మాడ్కి గమనమే ఫలముగా నేగుచుండం జేయరాని పని నేయమను వ్యవస్థం దలంచి నిన్నుంచివైచి యేగం గూడదని నిలిపి 'ఉత్తరం తీర మాసాద్య' (రా - యు) అని విభీషణుఁడు సముద్రోత్తరతీరంబున కేగి నిలిచినట్లు నీ వాకిటం గాచియుంటిమను లాభంబునకై, 'ఖస్థ ఏవ వ్యతిష్ఠత' అని యాతండు నెలకొన్నట్లు మేమును నెలకొంటిమి.

కృష్ణసంబంధముంబట్టి మన మందఱము సరిగా నుండఁగా నన్నిట్లనం గూడునే యనినం జెప్పుచున్నారు.

కోదుకలముడైయ పావాయ్ ఎழுన్దిరాయ్ — 'నారీణాముత్తమా వధూః' అన్నచొప్పునం గృష్ణవల్లభత్వంబున మాకన్న నతిశయిత. వైన నిన్ను మున్నుగొని నీకు మంచివారలమై యేగుచో నతనికిం బ్రేమపాత్రంబుల మగుదుమని వచ్చితిమి. స్త్రీక్లేశం బెఱుంగని యతనివంటి దానవు గావనికదా నిన్నాశ్రయించితిమి. నీవు లేచునప్పటి పరిస్పందంబు గూడ నానఁగొంటి మనుట.

లేచి చేయునది యేమనినం జెప్పుచున్నారు.

పాడి ప్పఱైకొణ్డు — ఇప్పుడు మనకు దొరకొనిన యైశ్వర్యంబు తొంటివిధముననే యున్నదో; మున్ను కృష్ణుండునుండీ, పడుచులు నుండీ యని శంకించువారి భయంబున లోలోనె కృష్ణగుణానుభవంబు నేసి

యూ హర్షంబు పైకి వెల్వడకుండ దాచియుంటిమి. ఇప్పుడు వారలే యనుమతించుటం గాలువ కట్టుం గొట్టినట్లు కృష్ణగుణానుభవ ప్రీతిపొంగి పారల నోరారం బాడుదము. వాద్యవిశేషవ్యాజంబున సేవాలాభంబుం జెందెదమనుట.

ఎప్పట్టునం బాడుదమన్న వీరచరితంబుల నని చెప్పుచున్నారు.

మాపాయ్‌పిళన్దానై మల్లరై మాట్టియ దేవాదిదేవనై — కేశిని జంపి దన్నుం గాపాడుటయు, 'సఖ్యః పశ్యత' (వి-౫అ) అని మధురానగరస్త్రీలు చూడరే చెలులారా యని చెందిన హర్షలాభంబును దమ లాభముగా నెంచుట. 'జాతోఽసి దేవదేవేశ' (వి-౫అ) అనియు, 'సోహంతే దేవదేవేశ' (జితంతే) అనియుం జెప్పినచొప్పున నిత్యసూరులకు నధిపతి యగుట దేవదేవత్వము.

'నగరస్త్రీకలాలాపమధు శ్రోత్రేణ పాస్యతి। మధురాం ప్రాప్య గోవిన్దః కథం గోకులమేష్యతి॥' (వి-౫అ) అనినచొప్పున మధురాపురంబున నాగరిక స్త్రీల మధురభాషణంబులం గ్రోలి మిక్కిలి విదగ్ధుండగువాఁడు కడియెడమల నెఱుంగని మనకు వశ్యుండగునే యనినం జెప్పుచున్నారు.

శెన్ఱు నామ్ శేవిత్తాల్—విరహాభక్షితంబులైన మన శరీరంబులతో మన మేగినచో. 'ఉపస్థేయై రుపస్థితః' అనియును, 'పద్భ్యామభిగమాచ్చైవ' అనియును తానే వచ్చి కావవలె ననువానిని అందలిదిందలిదైనచో మహాభరంబై హృదయక్షతంబు సేయదేయనుట.

ఆవావెన్ఱా రాయ్‌న్దరుళ్ — నేనె రక్షకుండనని నమ్మి నా రాక చూచువారలు సైరింపంజాలక నేనున్నచోటికి వచ్చిరే యని కనికరించు ననుట. 'ఆనృశంస్యం పరో ధర్మః' అని చెప్పినవాఁడు ప్రణయిత్వంబు మఱచినను ఆర్తరక్షణంబు మఱచునే యనుట.



# 9

## తొమ్మిదవ పాశురము

'తత్తస్య సదృశం భవేత్' (రా-సు) అని తానే యిచ్చటికి వచ్చి నన్నుఁ గైకొనుట యతని పని యన్నచొప్పున కృష్ణుండు తానే వచ్చుంగాతమనియున్న యొక్కతెను లేపుచున్నారు.

తూమణి మాడత్తుచ్చుట్రుమ్ విళక్కెరియ
 త్తూబమ్ కమழ త్తుయిలణైమేల్ కణ్ వళరుమ్
మామాన్ మగళే మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్
 మామీరవళై యెழుప్పీరో ఉన్ మగళ్ దాన్
ఊమైయో అన్ఱిచ్చెవిడో వనన్దలో
 ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో
మామాయన్ మాదవన్ వైగున్దనెన్ఱెన్ఱు
 నామమ్ పలవుమ్ నవిన్ఱేలోరెమ్బావాయ్.

తూమణి మాడత్తు : శ్లాఘ్యమణి ఖచితంబైన సౌధమున
శుఱ్ఱుమ్ విళక్కు ఎరియ : చుట్టును దీపములు జ్వలింపగా
తూబమ్ కమழ : ధూపంబు పరిమళింప
తుయిలణైమేల్ కణ్ వళరుమ్ : తల్పంబునఁ బవ్వళించు
మామాన్ మగళే : మామ కూతురా
మణిక్కదవమ్‌తాళ్ తిఱవాయ్ : మణికవాటము తలుపుం దీయుము.
మామీర్ : అత్తా
ఉన్ మగళ్ తాన్ ఊమైయో : నీ కూతురు మూగయో
అన్ఱి శెవిడో : లేక చెవుడో
అనన్దలో : అపరాత్రి నిద్రయో
ఏమమ్, పెరున్దుయిల్ మన్దిరమ్: కావలి పెట్టిరో, గాఢ నిద్రామంత్ర
పట్టాళో : వాదంబునం దగిలినదో
మామాయన్ మాదవన్ : ఆశ్చర్యగుణచేష్టితుండు శ్రీవల్లభుండు
వైగున్దన్ ఎన్ఱెన్ఱు : వైకుంఠనాథుండు అని
నామమ్ పలవుమ్ నవిన్ఱు : నామంబులు పెక్కులు సెప్పి
అవళై ఎழுప్పీరో : ఆవిడను లేపవమ్మా

తూమణిమాడత్తు — 'తువళిల్ మామణిమాడమోఙ్గు' (తి-య్-మొ) అని దోషరహితమహామణిఖచితసౌధంబులని చెప్పం బడిన తొలైవిల్లిమంగల మను దివ్యక్షేత్రమున నుండు మేడలకు దోషశఙ్క గలుగుటయు నది లేదనుటయుం గలిగె, నీ సౌధంబున కట్టి శఙ్కయు లేదట. ముక్తులకంటె నిత్యసూరులకుం గల వాసివంటి వాసి గలదట.

శుఱ్ఱుమ్ విళక్కెరియ — మాణిక్యప్రభలు పగలు సేయు చుండినను మంగళార్థంబుగా. కృష్ణుండు వచ్చి తన చెయ్యిపట్టి లీలాగతు

లోనరించుచోటు లెల్ల శయ్యలును పీఠంబునై యుండుటయు, గతసంవృ గోడలు గానం బై నున్న వీరలకుం గానవచ్చుటయు నట.

తూబమ్ కమళ — పొగ గానరాకయుం బరిమళంబు వెల్లి గొనుట. 'శీరుశ్ వగిల్ పుగై' ఇత్యాదిగాఁ జెప్పంబడిన శ్లాఘ్యం బగు నగరు ధూపాదికము నైతము ఇప్పుడు మా కింపుగాని పరిమళంబు నీ కింపగుట యెట్లనుట.

తుయిలణై మేల్ కణ్‌వళరుమ్ — కృష్ణవిరహంబును నైతము ఆర్పందగు తల్పమట. 'మెన్‌మలర్‌ప్పళ్ళి వెమ్బళ్ళి' యన్నచొప్పున మృదు పుష్పతల్పము మాకు క్రూరతల్పంబుగా నీకు తల్పంబునింత యింపయ్యెనే యనుట.

మామాన్ మగళే — ఆడి యాడించుకొనుటకుం దగిన చుట్ట రికముం జెప్పుట. భగవత్సంబంధులతో సంబంధంబెల్ల నడుగువరా చేయుం (అతిశ్లాఘ్యమగును) గాన స్వామినియు సఖియు ననుటయొకాక ప్రకృతిసంబంధబాంధవంబును దన కుజ్జీవనంబని యాండాళనుభవించుట.

మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్ — మణి కవాటము తలుపుం దిగియు. మీరు మీ గడియం దిగిచి రారాదో యన్నను, మాణికాం తులచే మా కెఱుంగరాదయ్యె ననుట.

వారు పిలుచుచుండ నీ వూరక పన్నుండుట యేమని తల్లి యడుగ నది విని యామెం బిలుచున్నారు.

మామీర్ అవళై యెళుప్పీరో — ఆబిడ తల్లిగాన నిట్లనుట. అందుకును లేవకున్నం జిరాకుపడి చెప్పుచున్నారు.

ఉన్ మగళ్ తాన్ ఊమైయో — నీ కూతురు మూగయో. వ్యవహారయోగ్య కాదో యనుట.

అన్ని చ్చెవిడో — మూఁగయయినను [illegible]పిని తలుపు తిగియం గూడును. చెవి వివరంబు సైతము లేకుండం బోలును.

అనన్దలో — తడవుగాఁ గృష్ణానుభవంబు చేసి నిద్రించిన దిప్పుడేయో.

ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో — 'మైయలేఱ్ఱి మయక్క-ఉన్ ముగమ్ మాయమన్దిరన్దాన్కొలో' (నా-తి) అని ఆశపుట్టించి భ్రమింపించుటకు నీ మొగము మాయమంత్రంబె యొక్కో. యని చెప్పిన చొప్పున నేమైనం గలదో యనుట.

ఈ బిడ మేల్కాంచునట్లు భగవన్నామంబులం బలుకుమని తల్లి పలుకం బలువిధముల నీవరకే పలికితి మనుచున్నారు.

మామాయర్ — ఆశ్చర్యచేష్టితుండు కావుననే యబలల మమ్ము నమ్మఁడు వడంగొనె ననుట.

అందుకు మూలమేమన్నను,

మాదవన్—శ్రీవల్లభుండు. సౌలభ్యంబునకు గురుకులవాసంబుం జేసెనట.

వైగున్దన్ — శ్రీవల్లభుండై యట్టిమహత్త్వంబునకుం దగిన దేశవిశేషముం గలవాఁడనుట. ఇట్టివాఁడు నుండి మనకు సులభుండయ్యె ననుట.

నామమ్ పలవుమ్ నవిన్ఱు — మహత్త్వంబును సౌలభ్యంబు నుభయమూలంబుం దెలుపు వైకుణ్ఠ మహామాయ శ్రీవల్లభనామంబులం జెప్పితి మనుట. లేపవమ్మా యని క్రియాన్వయము.



# పదవ పాఠము

కృష్ణుఁడన్నం గన్యకలెల్ల పక్షపాతులు కృష్ణుఁడే తనయెడం బడునట్లు వీరత్వాతిశయముననో, 'ఆనన్దం బ్రహ్మణో విద్వాన్' (తై-ఉ) అని బ్రహ్మానన్దము నుపాసించుటకంటెను, 'ఏష హ్యేవానన్దయాతి' (తై - ఉ) అని యతండానందంబిడుటయందె డెందంబు దవిలియో, శ్రీకృష్ణుని పొరుగింటిదై నడుమదారియుం గలుగుట నతని నేకముగా ననుభవించుటనో యేమియుం బలుకక యున్నయొక్క కన్నియను లేపుచున్నారు.



# 10

నోఱ్ఱుచ్చువర్ క్కమ్ పుగుగిన్ఱవమ్మనాయ్
మాఱ్ఱముమ్ తారారో వాసల్ తిఱవాదార్

నాఱ్ఱత్తుఴాయ్ముడి నారాయణన్ నమ్మాల్
పోఱ్ఱప్పఱై తరుమ్ పుణ్ణియనాల్ పణ్డొరునాళ్

కూఱ్ఱత్తిన్ వాయ్ వీఴ్న్దకుమ్బకరణనుమ్
తోఱ్ఱుమ్ ఉనక్కే పెరున్దుయిల్దాన్ తన్దానో

ఆఱ్ఱవనన్దలుడైయాయ్ అరుఙ్గలమే
తేఱ్ఱమాయ్ వన్దు తిఱవేలోరెమ్బావాయ్.



పోర్ఱిప్పత్తై దరుమ్ పుణ్ణియనాల్ . . .
కూన్ఱత్తిన్ నామ్‌వీఴ్న్ద కుమ్బకరణనుమ్
తోన్ఱుమ్ ఉఱక్కై పెరున్దుయిల్ దాన్ తన్దాన్

నోఱ్ఱు శువర్క్క-మ్పుగుగిన్ఱ : నోమునోచి స్వర్గమునం జొరందగిన

అమ్మనాయ్ : నక్షకలారా

వాశల్ తిఱవాదార్ : తలుపు తెఱవనివారు

మాత్తముమ్ తారారో : ప్రత్యుత్తరము నివ్వరో

నాత్తత్తుళ్ళాయ్ ముడి : పరిమళించు తులసిశేఖరము గల

నారాయణన్ : నారాయణుండును

నమ్మాల్ పోత్తప్పఱై

తరుమ్ : మనచే స్తుతింపబడువాడును వాద్య విశేషం బొసంగువాడు నగు

పుణ్ణియనాల్ : పుణ్యాత్మునిచేత

పణ్డొరునాళ్ కూత్తత్తిన్ వాయ్ వీళ్న్ద : తొల్లి యొక్క-కాలంబున మృత్యు-ముఖంబునం బడిన

కుమ్భకరణనుమ్ : కుంభకర్ణుండును

తోత్తునక్కు ఉనక్కే పెరుమ్ తుయిల్దాన్ తన్దానో : ఓడి నీకే పెద్ద నిద్దురను దానే యిచ్చి నాడో

ఆత్త అనన్దల్ ఉడైయాయ్ : అధిక నిద్రాజాడ్యము గలదానా

అరుమ్కలమే : (మూగోష్ఠికి) ఆభరణమా

తేత్తమాయ్ వన్దు తిఱ : తెలివిగా వచ్చి (తలుపు) తెఱవుమీ

నోఁఱ్ఱు చ్చువర్కళ్ళమ్ పుగుగిన్ఱ — తెల్లవారినను లేవమివే నవ్వ్మా లెస్సగా నోఁచి సుఖమందఁ గోరితివని క్షేపించుట యొండెఁ నిప్పుడు నోమునోఁచ నక్కఱలేకయె ఫలము చేకూరినదని యొండెఁ నభిప్రేతము. సిద్ధసాధననిష్ఠయగుట నుపాయాంశమున నిర్భరవై యున్న దనియుం జెప్పుదురు. 'విదుః కృష్ణం బ్రాహ్మణాస్తత్త్వతో యే తేషాం రాజం త్సర్వయజ్ఞాస్సమాప్తాః' అని చెప్పఁబడినది గదా. కృష్ణ తత్త్వ జ్ఞానము జన్మాంతర శతానుష్ఠితసర్వయజ్ఞ ఫలమని దానిభావము. ఇందు స్వర్గమనునది సుఖము. అదియుం గృష్ణానుభవంబె. 'యస్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా' అని భగవంతుని సంశ్లేష విశ్లేషములె స్వర్గనరకంబు లనంబడినవి.

అమ్మనాయ్ — నీ రక్షకత్వమును మా రక్ష్యత్వమును జక్కఁగా నున్నదని భావము.

'ప్రహర్షేణావరుద్ధా సా వ్యాజహార న కిఞ్చన' (రా-సు) అని యాంజనేయుని పలుకాలకించి శ్రీ సీతాదేవియట్లు హర్షపరవశయై యేమియుం బలుకం జాలకున్నట్లో, 'సంశ్రవే మధురం వాక్యమ్' అనుచొప్పున వీరల పలుకులు విన నింపగుటనో, తమకు విధేయురాల నయిన నన్ను రక్షకురాలా యనుదురే యను ప్రణయరోషముననో, మాఱుమాట వలుకమిం జూచి చెప్పుచున్నారు.

మాఱ్ఱముమ్ తారారో వాశల్ తిఱవాదార్-తలుపుమూసినచో నోరును మూయవలయునో, ఐశ్వర్యము మీరినచో బంధుల నేమననుం గూడదో; 'బోధయన్తః పరస్పరమ్' అని యొండొరులకు బోధించు కొను చందముం దొలఁగినదో; ఒడలు కృష్ణున కొసంగితే మాకు పలుకైనం జిలుకరాదో; 'మధురా మధురాలాపా' అన్నచొప్పున రూపసూక్తిలాభములు లేమిని మా చెవులుం గన్నులుం బస్తుండవలెనో.

కృష్ణుండేందుఁగలండా యనం జెప్పుచున్నారు.

నాళ్ త్తుళ్ళాయ్ ముడి—దివ్యగంధము నీకు వాచుందని. అతం డొక్కసారి గూడినచో నది యయిదాఱు స్నానంబులవరకు నిలుచుం గదా.

కావలి గలచో నతండు వచ్చుట యెట్లన్నం జెప్పుచున్నారు.

నారాయణన్ — మావలె నతండు తలుపుదొడ్డం గాచియుండునే. వ్యాప్తి ముఖ్య ప్రతికూలుల సైతము విడువక వ్యాపించువాఁ డనుకూల వయిన నిన్ను విడుచునే.

నమ్మాల్ పోర్ ప్పత్తై దరుమ్ పుణ్ణియనాల్ — అకించనలమగు మనముసైత మాశ్రయింపం గూడునట్లు, 'కృష్ణం ధర్మం సనాతనమ్' అన్న చొప్పున సిద్ధసాధనమై యున్నవాఁడనుట.

పణ్డొరునాళ్ కూర్ త్తిల్ వాయ్వీళ్ న్ద కుమ్బకరణనుమ్ — జల పానంబునకై త్రవ్విన తటాకంబున మునింగి చచ్చువారి వైఖరి 'రిపూణామపి వత్సలః' అని చెప్పంబడిన శ్రీరామదేవునియెడం దప్పుచేసి చచ్చెం గాదే.

తోఱ్ఱుమ్ ఉనక్కే పెరున్దుయిల్ దాన్ తన్దానో — నిద్రాళువు లకుం దలయగు నతండె నీకోడి తన నిద్దురంగూడ నిచ్చిపోయెనో. వానిది నిద్దుర, నీది పెద్దనిద్దుర. వాఁడొక్కతె నెడఁబాపంజూచె, నీ విందఱ తోడఁబాసి నిద్రింపుచున్నావనుట యనియుం జెప్పుదురు.

ఇట్లువలుక విని నిద్రాజాడ్యముతోఁ గృష్ణకృష్ణ యనుచు లేవం జెప్పుచున్నారు.

ఆఱ్ అనన్దల్ ఉడైయాయ్ — మే మచ్చటికిం బోయి కృష్ణుని మేలుకొలుపులు పాడవలెనే, నీవు లేచువిధంబుఁగాంచినం జాలదేయనుట.

అరుఙ్గలమే — హారమును జేసి దానికి రతనంబమర్చినట్లు మాకు శిరోభూషణంబవైన నీవు మా గోష్ఠింజేరి సనాథము సేయవలెనే.

ఇట్టియార్తి విని తటాలున రాంబోవం జూచి చెప్పుచున్నారు.

తేత్తమాయ్ వన్దు తిఱ — చీకటివోటం బన్నుండినావు గానం దడబడక తెలివిఁగొని వచ్చి తలుపు దెఱవుమనుట. ఊరంతయుం జేరియున్నది కావున వన్నున్న చొప్పుననే 'సా ప్రస్థితాస్మి' యన్న చొప్పున తడబడుచు వచ్చిన తారవలెఁగాక సదస్యవై వచ్చి తెఱవు మనుట.



## పదునొకొండవ పాశురము

అన్నిట నభిజాతయై కృష్ణునకు సాటియగు నొకతెను లేపుచున్నారు.



కఱవై క్కణఙ్గళ్ పలకఱన్దు...
కుఱ్ఱమ్ ఒన్ఱిల్లాద కోవలర్దమ్ పొఱ్కొడియే!...
తోழిమార్ ఎల్లారుమ్ వన్దునిన్
ముఱ్ఱమ్ పుగున్దు ముగిల్వణ్ణన్ పేర్పాడ...
ఎఱ్ఱుక్కు ఉఱఙ్గుమ్ పొరుళ్ ?'



## 11

కఱ్ఱుక్కఱవైక్కణఙ్గళ్ పల కఱన్దు
    శెఱ్ఱార్ తిఱలఴియచ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్

కుఱ్ఱమొన్ఱిల్లాద కోవలర్ద పొఱ్కొడియే
    పుఱ్ఱరవల్గుల్ పునమయిలే పోదరాయ్

శుఱ్ఱత్తుత్తోఴిమారెల్లారుమ్ వన్దు నిన్
    ముఱ్ఱమ్ పుగున్దు ముగిల్వణ్ణన్ పేర్పాడ

శిఱ్ఱాదే పేశాదే శెల్వప్పెణ్డాట్టి నీ
    ఎఱ్ఱుక్కుఱఙ్గుమ్ పొరుళేలో రెమ్బావాయ్.

కఱ్ఱుక్క ఱవై కణఙ్గళ్ పల : ఈనినపశువుల సమూహము లనేకములు

కఱన్దు : పితికి

శెఱ్ఱార్ తిఱల్ అఴియ : శత్రువులబలము మాయునట్లు

శెన్ఱు శెరు శెయ్యుమ్ : వెడలి యుద్ధము సేయు

కుఱ్ఱమ్ ఒన్ఱిల్లాద : దోషమొక్కటియు లేని

కోవలర్ దమ్ పొఱ్కొడియే : గోపాల వంశమున స్పృహణీయమగు లతకూనా

పుఱ్ఱరవల్గుల్ పునమయిలే : పుట్టలోని సర్పమువంటి నితంబము గల వనమయూరీ

పోదరాయ్ : రమ్మా

శెల్వప్పెణ్డాట్టి : ఐశ్వర్యంబు గల పొలతీ

శుఱ్ఱత్తు త్తోఴిమార్ ఎల్లారుమ్ వన్దు : బంధుజనంబైన సఖులెల్ల వచ్చి

నిన్ ముఱ్ఱమ్ పుగున్దు : నీవాకిటం జొచ్చి

ముగిల్ వణ్ణన్ పేర్ పాడ : మేఘవర్ణుని నామములం బాడ

శిఱ్ఱాదే పేశాదే నీ : చెదరక పలుకక నీవు

ఎఱ్ఱుక్కు ఉఱఙ్గుమ్ పొరుళ్ : ఎందుకు నిద్రించు నభిప్రాయము

క౯ ఇక్కిఅవై — నిత్యసూరులు భగవత్స్వర్గంబున పంచ వింశతి వార్షికరూపులై యున్నట్లు — 'భవామి దృష్ట్వా చ పునర్యువేవ' అన్నచొప్పున వెండియు యౌవనంబిడు భగవద్దర్శన స్పర్శనప్రభావంబున నన్నియు దొలిచూలు వడ్డలగుట.

కణాజ్గళ్ పల — వేలువేలుగా, నెన్నం దీరమియె కాక సమూహంబులు నిన్నియని యెన్నం దరముగాదు. 'రథకుఞ్జరవాజిమాన్' అను యరదంబులు నేనుంగులు గుఱ్ఱంబులుం గలవాండనియె ఱిసనేకంబులు గలవాండనుటింతియు.

కఱన్దు — ఈశ్వరుండు సర్వనియమనంబు సేయునట్లు గోపాలకుల శ్రేష్ఠత్వంబుంబట్టి యన్నియుం దానే పిదుకంజాలుట. పాలు నెయ్యియు సమృద్ధంబగుటం జంటి సలుపు దీరుటకే పిదికి యనియుం జెప్పుదురు.

శెత్తార్ తిఱలళియ — వీరలకు శత్రువులు కృష్ణద్వేషులగు కంసాదులు. దేవతలను సైతము గణింపని వారలు సైతము ప్రకటంబుగాం జొరరాని బలము గలదనుట.

శెన్ఱు శెరుచ్చెయ్యుమ్ — శత్రువులు వచ్చినం బోరుటయెకాక, 'అభియాతా ప్రహర్తా చ' అన్న శ్రీరామదేవునిమాడ్కి వార లున్నచోటి కెత్తివెడలి పోరుదురనుట.

కుత్తమొన్ఱిల్లాద — ఎత్తిరాంజూచుట యొండెం జేతియాయుధము క్రిందం బడవైచిన వారి నెదిరించుట యొండె లేదనుట. సేగి సేయుచున్నారని కృష్ణసన్నిధిని మొఱవెట్టినను 'సాధురేవ స మన్తవ్యః' అనియును, 'శెయ్దారేల్ నన్ఱు శెయ్దార్' (పె-ర్-తి) అనియుం జెప్పినచొప్పున లెస్స చేసినవారే పొమ్మని కృష్ణుండు చెప్పునట్లు పుట్టిన వారలనియుం జెప్పుదురు.

కోవలర్ దమ్బొల్కొడియే — 'జనకానాం కులే కీర్తి మాహరిష్యతి మే సుతా' (రా - అ) అని సీతాదేవి జనకకులమునకుం గీర్తి దెచ్చినట్లు గోపాలకులంబునకు శ్లాఘాస్పదంబనుట. అందుకుం గృష్ణ సంశ్లేషైకజీవనత్వంబె మూలము.

పుక్కరవల్ గుల్ — మార్దవ విశాలత్వముల సాటి చెప్పుట. 'పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్' అన్నచొప్పున నతండు పురుషుల స్త్రీలం జేయునట్లు, 'యాః స్త్రియోదృష్టవత్యస్తాః పుమ్భావం మనసా యయుః' అని చెప్పిన ద్రౌపదీసౌందర్యముతీరున స్త్రీలం బురుషులం జేయు నట్టిదంబనుట.

పునముయిలే — కృష్ణునిం దన్ను ను భూషింపంజాలు నలకభారము గలదనుట. లతకూనయని సముదాయశోభయు నీ సుశేషణద్వయమున నవయవశోభయుం జెప్పఁబడినవి.

పోదరాయ్ — 'శోభయన్ దణ్డకారణ్యమ్' అన్న చొప్పున మమ్ము శోభింపం జేయుమీ.

అందఱును వచ్చిరో యనినం జెప్పుచున్నారు.

శుత్తత్తు త్తోళిమార్ ఎల్లారుమ్ వన్దు — ఈయూరెల్ల నీనిడకుం జుట్టంబులే యనుట.

నిన్ ముత్తమ్ పుగున్దు — 'ఉత్తరమ్ తీరమాసాద్య' అన్న చొప్పున మాకు నీ వాకిలి ప్రాప్యంబగుట యరుదే. 'ముత్తత్తూడు పుగున్దు నిన్ముగమ్ కాట్టి' (నా - తి) అన్నచొప్పున నీవాకిటం జొచ్చి కృష్ణుఁడే తన ముఖముఁ జూపునట్టు శేషియగువానికే ప్రాప్యంబుగాదే.

కృత్యముం జెప్పుచున్నారు.

ముగిల్ వణ్ణన్ పేర్ పాడ — నీ ప్రియుని సౌందర్యౌదార్యముల కోడి పాడుచున్నను అనుట.

అవ్విగ్రహము దలంచి యూరకుండఁ జెప్పుచున్నారు.

శిత్రాదే పేశాదే — లేచినందు కడియాళ్ళంబైన చేష్టయుం జేయక వార్తయుం బలుకకుండెనని యందాన కలుగుటచే విషణ్ణలగుట.

శెల్వప్పెణ్డాట్టి నీ — కృష్ణగుణానుభవంబై యుం డైశ్వర్యంబు. మాకెల్ల నైశ్వర్యంబైన పొలతీ యనియుం జెప్పవచ్చును.

అట్టైశ్వర్యంబు నిండియున్నదే యన్నం జెప్పుచున్నారు.

ఎత్తుఱుక్కు ఉఱజ్గుమ్ పొరుళ్ — అట్లుగాకున్నచో నీయుద్దేశ్యంబును మా విరహమును గృష్ణుని నిరతిశయభోగ్యత్వంబుం జూడక యేల నిద్రించుట యనుట. 'అడియార్ గళ్ కుళ్ఙాజ్గళై యుడన్ కూడువదెన్ఱుకొలో' (తి - య్ - మొ) అని భాగవతులసంఘంబుతోఁ జేరుట యెన్నఁడో యని కోరందగిన ఫలము విడిచి కైవల్యమువలె నిద్రించుటకు ఫలమే మనియుం జెప్పుదురు.



## పంద్రెండవ పాశురము

కృష్ణునెడబాయక శ్రీ లక్ష్మణునియట్లు యుండు నొక్కని చెల్లెలగుట శ్లాఘ్యయగు నొక్కతెను లేపుచున్నారు.



ఎరుమై కన్ఱుక్కు ఇరఙ్గి...

నిన్ఱు పాల్ శోర

ననైత్తు యిల్లమ్ శేఱాక్కుమ్ నఱ్చెల్వన్ తఙ్గాయ్!...

తెన్నిలఙ్గైక్కోమానై చ్చెఱ్ఱ

మనత్తుక్కు యినియానై ప్పాడవుమ్ నీ వాయ్తిఱవాయ్!



## 12

కనైత్తిళఙ్గఱ్ఱెరుమై కన్ఱుక్కిరఙ్గి
నినైత్తు ములైవఴియే నిన్ఱు పాల్శోర

ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్ నఱ్చెల్వన్ తఙ్గాయ్
పనిత్తలై వీఴ నిన్ వాశల్ కడైపఱ్ఱి

శినత్తినాల్ తెన్నిలఙ్గైక్ కోమానైచ్చెఱ్ఱ
మనత్తుక్కినియానైప్పాడవుమ్ నీ వాయ్తిఱవాయ్

ఇనిత్తానెఴున్దిరాయీదెన్న పేరుఱక్కమ్
అనైత్తిల్లత్తారు మఱిన్దేలోరెమ్బావాయ్.

ఇళఙ్కఱ్ఱెరుమై : లేదూడగల గేదె

కనైత్తు : ( పితుకువారు లేమిని చన్నునలుపున )
అఱచి

కన్ఱుక్కు ఇరఙ్గి నినైత్తు : తన వత్సమునకై కనికరించి తలంచి

ములై వళియే నిన్ఱు పాల్ శోర : స్తనద్వారములచే స్థిరముగా పాలుగార

ననైత్తు ఇల్లమ్ శేఱాక్కుమ్ : తడిపి యిల్లు బురదసేయు

నఱ్చెల్వన్ తఙ్గాయ్ : మంచి సంపద గలవాని చెల్లెలా

పని తలై వీళ : మంచు తలపై బడుచుండ

నిన్ వాశల్ కడై పఱ్ఱి : నీ వాకిలి గడప బట్టి

శినత్తినాల్ తెన్నిలఙ్గై : కోపమున దర్శనీయుండగు లంకేశ్వరుని

క్కో మానై శెఱ్ఱ : సంహారించిన

మనత్తుక్కినియానై : మనస్సునకు ప్రియుని

పాడవుమ్ నీ వాయ్ తిఱవాయ్ : పాడినను నోరు తెఱవవు.

అనైత్తిల్లత్తారుమ్ అఱిన్దు : అన్ని యిండ్లవారు నెఱింగి

ఈదు ఎన్న పేరుఱక్కమ్ : ఇది యేమి పెను నిద్దుర

ఇనిత్తాన్ ఎళున్దిరాయ్ : ఇకనైనను లేవవే.

కన్నైత్తు — పిదుకువారు లేమిని చన్ను సలుపున నఱచుట.

ఇళఙ్గన్ఱెరుమై — లేదూడగాన నెడబాయలేకుండుట.

కన్ఱుక్కు ఇరఙ్గి — తన చంటి సలుపట్లుండ వత్సంబేమగునో యని కనికరించుట. ఈశ్వరుండాశ్రితవిషయమునం గనికరించుటకిది నిదర్శనం బంద్రుడు. అతండు గేదెలను బిదుకనిచో నవి పడు పాటు నీచేత మేము పడుచున్నా మనుట.

నినైత్తు ములైవழియే — వత్సస్మరణభావనాప్రకర్షంబున చంట దాని నోరున్నదనుకొని చేతంబిదుక నక్కఱలేకయే చంటిద్వారముననే పాలు గారుచుండును.

నిన్ఱు పాల్ శోర — తలంపు మాఱమిం దిరుమల సెలయేరుల చందంబునం బాలుగారుట. అతఁడు 'న దేవలోకాక్రమణం నామ రత్వమహం వృణే' అని లక్ష్మణుని చందంబునం గృష్ణునిం బాయ లేఁడు గాన నవకాశంబులేమిం బిదుకంజాలఁడు. ప్రాప్యవిరోధులయందుఁ దగులముడుగుట యనియుం జెప్పవచ్చును.

ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్—పాలమిక్కుటముచే నిల్లు వెల్లువవారును దానిపైఁ ద్రొక్కువడి బురదయగుట.

నత్చెల్వన్—తోఁచి మాయునదిగాక 'లక్ష్మణో లక్ష్మిసమ్పన్నః' అన్నచొప్పునం గృష్ణనిరంతరసేవ యను సంపదయె 'ఊరుమ్నాడు ములగముమ్ తన్నెప్పోల్' (తి-య్-మొ) అని యూరునాడు లోకంబును దనవలె వైష్ణవశ్రీసమృద్ధం బనునట్లు సేయు నైశ్వర్యం బిది.

తఙ్గాయ్ — 'రావణస్యానుజో భ్రాతా' (రా) అని గుణహానికి రావణునితమ్మునియట్ల గుణసంపదకు తనయన్నకన్న నెక్కు

పనిత్తలైప్పూ నిఱవాశల్ కడైపత్తి — పైని మంచును క్రిందం బొలును నడుమ ననురాగంబును వెల్లువవార నిలువంజాలక తెప్పం బట్టు చందంబున వాకిటి గడపదండియం బట్టియుండుటం గలుగు ధర్మం బెఱుంగవే యనుట.

ఇట్లు సెప్పుచున్నను వీరుపడు ప్రయాసలం జూతమని యా బిడ యూరకుండ నవిచ్ఛిన్నముగా స్త్రీలను బాధించు కృష్ణావతారము విడిచి స్త్రీరక్షకింబగు రామావతార వృత్తాంతంబు సెప్పిన నీ బిడ లేచునని తలంచి చెప్పుచున్నారు.

శినత్తినాల్ తెన్నిలఙ్గైక్కోమానై చ్చెత్త — ఈశ్వరునకుం గోపంబు గలదే యన్నను ఆశ్రితశత్రువుల సంహారించుటకుం దెచ్చికోను నది గలదు. ‘తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్। దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశమేయివాన్’ అన్న చొప్పున సుగ్రీవునకు రావణుండు క్షతంబుసేయం గోపవశంబుం జెందుటయు, సుగ్రీవుండు కుపితుండై నచో వాలిం జంపుటయు నతం డేడ్చుచోఁ గూడ నేడ్చుటయు, ‘ద్విషదన్నం న భోక్తవ్యమ్’ అని పాండవశత్రువులఁ దనశత్రువులని చెప్పి కౌరవాన్నంబు భుజింపమియుం జెప్పంబడినవిగదా. లంకేశ్వరుని దర్శనీయత్వం బేమన్నను—‘యద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః। స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా’ అని యితండధార్మికుండే గాని-చో నింద్రలోకంబు సైతముం బాలింపం జాలునని యాంజనేయుండు సైత మెన్నిన యైశ్వర్యంబు గలుగుట. అట్టివాని నొక్క బాణంబునం దలద్రుంపక సేనంజంపి రథముమాపి యాయుధంబులం ద్రుంచి, ‘కోఱపోలుమ్’ (తి - మొ) అన్న చొప్పున నభివృద్ధమై యున్న రాక్షసరాజత్వాభిమానమును మాపి కుందించి చంపినవాఁడన్నట్లు.

మాత్తుక్కనియాన్ై — 'వేమ్బియాగ వళర్త్తాళ్' అని వేప మాని పోల్కి నగు నట్లు పెంచినదని చెప్పినచొప్పున స్త్రీలను క్షతం బెఱింగి నెతంబెట్టి హింసించు కృష్ణునట్లుగాక — 'సజ్ఞాతబాష్పః పరవీరహన్తా' (రా - యు) అన్నచొప్పున శత్రువీరులం జంపునప్పుడు సైతము కంటనీరు నెట్టు స్వభావమువాఁడై యేకదారవ్రతుండగు వాని ననుట.

పాడప్పుమ్ నీ వాయ్ తిఱవాయ్—'కణ్ణ నామమే కుழఱికొణ్ణ్ ఱిక్' (తి-య్-ఝ్) అని కృష్ణునినామమే చెప్పి చంపితి వనినచొప్పున బాధించు కృష్ణనామంబు పేక్షించి 'మృతసఞ్జీవనం రామవృత్తాన్తమ్' అన్న చొప్పునం గృష్ణవిరహాంబునం బీటలువారిన డెందంబు పదనుకొను నట్లు శ్రీరామదేవునిం బాడుచున్న నోరు తెఱవవు. ప్రీతి వెలువడుటకుం ద్రోవ వలదే.

ఇనత్తా నెழున్దిరాయ్—మా తాళంజాలమీ దెలిపినను నిద్రించెదవే యనుట.

ఈదెన్న పేరుఱక్కమ్ — 'భగవతస్త్వరాయై నమః' అని గజేంద్రుని యార్తనాదంబు వినంబుట్టిన భగవంతుని త్వరాతిశయం బెఱింగియుండియు నిట్లు నిద్రించెదవే. ఆపన్నులకై మేలుకొనువాని చందముంగాక కాలము లేపిన మేల్కాంచు సంసారులవిధముం గాక యున్నదే నీ నిద్దుర యనుట.

అనైత్తిల్లత్తారుమ్ అఱిన్దు — పడుచు తెల్ల వచ్చి నీవాకిటనుండి పిలుచుట యూరియందఱు నెఱుంగవలెనని యుండంబోలును, అందఱు నెఱింగిరికలెమ్మా యనుట. భగవద్విషయము రహస్యముగా

ననుభవింపవలె నిట్లనుభవించుట కోరుటలు గలరే యని యుంటివైన నది యెల్లెడం బ్రసిద్ధంబయ్యెననుట యనియుం జెప్పుదురు. శ్రీ రామానుజావతారకాలంబు విధంబయ్యె నీ విజవిధంబని యాచార్యులు సెప్పుదురు.



## పదుమూడవ పాశురము

నేత్రసౌందర్యముం బట్టి కృష్ణుండు తానే వచ్చునని యున్న యొక్క తెను లేపుచున్నారు.



పుష్పమ్ శిలమ్బినకాణ్...

పళ్ళి క్కిడత్తియో పావాయ్నీ ?



## 13

పుళ్ళిన్ వాయ్ కీణ్డానై ప్పొల్లావరక్కనై
క్కిళ్ళిక్కళైన్దానై క్కీర్ త్తిమైపాడిప్పోయ్

ప్పిళ్ళైగళెల్లారుమ్ పావైక్కళమ్ పుక్కార్
వెళ్ళియెఴున్దు వియాఴముఱఙ్గిఱ్ఱు

పుళ్ళుమ్ శిలమ్బినకాణ్ పోదరిక్కణ్ణినాయ్
కుళ్ళక్కుళిరక్కుడైన్దు నీరాడాదే

పళ్ళిక్కిడత్తియో పావాయ్ నీ నన్నాళాల్
కళ్ళన్దవిర్న్దు కలన్దేలో రెమ్బావాయ్.

పుళ్ళిన్ వాయ్ కీణ్డానై : పక్షినోరుజీరినవాని

పొల్లా అరక్కనై క్కిళ్ళిక్కళైన్దానై : దుష్టరాక్షసుని గిల్లి పరిహరించినవాని

కీర్త్తిమై పాడిప్పోయ్ : చరితమును పాడి వెడలి

పిళ్ళైగళ్ ఎల్లారుమ్ : పడుచు లెల్ల

పావైక్కళమ్ పుక్కార్ : సంకేత స్థలముం జొచ్చిరి.

వెళ్ళి ఎళున్దు వియాళమ్ ఉఱఙ్గిఱ్ఱు : శుక్రుం డుదయించె గురుం డస్తమించె.

పుళ్ళుమ్ శిలమ్బినకాణ్ : పక్షులుం గూయుచున్నవి సుమ్మా.

పోదు అరి క్కణ్ణినాయ్ : పుష్ప హరిణనేత్రంబులం బోలిన కన్నుల దానా

పావాయ్ నీ : అందకత్తెవగు నీవు

నన్నాళాల్ : మంచిదినమున

కళ్ళమ్ తవిర్న్దు కలన్దు : కపటము విడిచి కలిసి

కుళ్ళ క్కుళిర : మిక్కిలియుం జల్లగా

కుడైన్దు నీరాడాదే : అవగాహించి తీర్థమాడక

పళ్ళిక్కిడత్తియో : శయనమున నిద్రింతువే.

పుళ్ళిన్ వాయ్ కీణ్డానై — 'పళ్ళత్తిల్ మేయుమ్ పఱవై యురు కొణ్డు' (పె - తి) అన్న చొప్పున పల్లమునమేయు పక్షి శరీరముం దాల్చి వచ్చిన బకాసురుని నోరు బద్దలు చేసినవానిని.

పొల్లావరక్కనై క్కిళ్ళిక్కళైన్దానై — శరీరాత్మలను వేఱుపరచి నట్లు జగమునకుం దల్లియు దండ్రియు నైన సీతారాములను వేఱుపఱచిన నిష్కృణుండనుట. 'పొలావిరావణన్' (తిరుక్కు-ఱు) అన్నచొప్పున దుష్టరావణుండనుట. 'త్వాం నీచ శశవత్ స్మృతః' (రా - యు) అన్నచొప్పున నీచుండనుటయుం దక్క నిట్టిదని నిరూపింప రాని దుష్టత గల రావణుని క్రీడాసమయంబుల నొప్పిసేయుట్టులం గిల్లివైచునట్లు నిరసించినవాని ననుట. 'విభీషణస్తు ధర్మాత్మా' (రా) యని మంచి రక్కసుండును గలఁడు గాన దుష్టరాక్షసుఁడనుట.

కీర్త్తిమై — 'శత్రోః ప్రఖ్యాతవీర్యస్య' (రా) అన్నచొప్పున పగతురకు సైతము 'రఞ్జనీయస్య విక్రమైః' అన్నచొప్పున రంజకం బైన బీరము వలచిన పిన్నపడుచులకుఁ జెప్పవలెనే. రావణుఁడు బీరంబునకు నోడె నతని చెల్లెలందనమునకుం గన్నుగలఁగె నతని తమ్ముఁడు శీలంబున కోడెనఁట.

పాడిప్పోయ్ — 'పాథేయం పుణ్డరీకాక్షనామసంకీర్తనామృతమ్' అన్నచొప్పున వీరల కిదియె పాథేయము.

పిళ్ళైకళెల్లారుమ్ — మనము లేపవలసిన పిన్నపడుచులు సైత మనుట.

పావైక్కళమ్ పుక్కార్ — సంకేతస్థలముం జొచ్చిరి.

వెళ్ళియెழுన్దు వియాழముఱఙ్గిన్ఱు — శుక్రుఁడుదయించె గురుం డస్తమించె.

మీాకు నక్షత్రములన్నియు శుక్రగురువులుగాఁ దోచునన్నం జెప్పుచున్నారు.

పుళ్ళుమ్ శిలమ్బిన కాణ్ — లేచుటమాత్రమె కాదు మేతకై కూయుచుం బోయినవి.

పోదరిక్కణ్ణినాయ్ — పుష్ప హరిణనేత్రంబులం బోలిన లేక పుష్పములోని తుమ్మెదం బోలిన లేక ప్రొద్దు హరించునవి లేక పూవులతోఁ గయ్యమాడినవి యగు కన్నులదానా. నీవు 'నెడుఙ్గణ్ణిళమాన్' అన్న చొప్పున నిడుపు కన్నుల పిన్నలేడివి, అతఁడో యన్నను 'అనైత్తులగుమ్ముడైయ వరవిన్దలోశనన్' అన్నచొప్పునను జగమెల్ల నేలు నరవిందలోచనుఁడు. నీ కన్నుల నతని నోడించి యతని కన్నులకు నీ వోడ మీాయిరువుర కన్నుల యందంబులకును మే మోడవలదే. మాకు లాభకరమగు సౌందర్యంబు వాడ వయినంబు హానికర మయ్యెనే.

కుళ్ళకుళిర — సూర్యోదయమున నీరు వేడిగాకమున్న.

కుడైన్దు నీరాడాదే — 'సరయూామవగాహతే' (రా) అని భరతుఁడు రామ విరహతాపంబుదీర సరయూనది నీరాడునట్లు కృష్ణ విరహతాపంబుదీర వెండియుం గృష్ణవిరహము రాకుండం గృష్ణగుణముల నవగాహించి యనుభవింపక యుని హృదయము.

పళ్ళిక్కిడత్తియో — కృష్ణస్పర్శము గల పడక మూానూచిలోను చున్నావో — పైరు పండియుండ గింజలేరువారు గలరే.

నన్నాళాల్ — కృష్ణుండు నుండీ పడుచులు నుండీ యను వారోడంబడ నతఁడును మనముం గూడి జలక్రీడ సేయుచో మన మతని

తోసం గూర్చుండునట్లు చేసినావో: ఇతక వంటియుండెదే. పైవచ్చు విఘ్నములు రావణాదులవలె విశ్లేషావహంబులు గావే యనుట.

కళ్ళమ్ తప్పర్ న్దు — ప్రత్యేకానుభవము సేయుచు మాకుఁ గానగాకుండ నిన్ను దాచుట యను నాత్మాపహారంబు విడిచి యనుట.

కలన్దు — నీరాడక నిద్రింతువే యని యన్వయము.



## ప దు నా ల్గ వ  పా శు ర ము

నేనే వచ్చి యందఱ లేపెద ననిచెప్పి వచ్చి యట్లుసేయక నిద్రించి యున్న యొక్కతెను లేపుచున్నారు.



శెఙ్గఴునీర్ వాయ్ నెగిఴ్న్దు ఆమ్బల్ వాయ్ కూమ్బినకాణ్ . . .
తఙ్గళ్ తిరుక్కోయిల్ శఙ్గిడువాన్ పోగిన్ఱార్



## 14

ఉఙ్గళ్ పుఴైక్కడైత్తోట్టత్తు వావియుళ్

శెఙ్గఴునీర్ వాయ్నెగిఴ్న్దామ్బల్ వాయ్కూమ్బినకాణ్

శెఙ్గల్పొడిక్కూఱై వెణ్బల్ తవత్తవర్

తఙ్గళ్ తిరుక్కోయిల్ శఙ్గిడువాన్ పోగిన్ఱార్

ఎఙ్గళై మున్నమెఴుప్పువాన్ వాయ్పేశుమ్

నఙ్గాయెఴున్దిరాయ్ నాణాదాయ్ నావుడైయాయ్

శఙ్గొడు శక్కరమేన్దుమ్తడక్కైయన్

పఙ్గయక్కణ్ణానై ప్పాడేలోరెమ్బావాయ్.

| | |
|---|---|
| ఉజ్గల్ పుళ్ళక్కడై త్తోట్టత్తు వావియుళ్ | : మీ పెరటి తోట బావిలోని |
| శెజ్గళునీర్ వాయ్ నెగిళ్ న్దు | : కల్హారములు ముఖవికసితంబులయ్యె |
| ఆమ్బల్ వాయ్కూమ్బినకాణ్ | : నీలోత్పలంబులు ముఖముకుళితంబులయ్యె జూమీ |
| శెజ్గల్ పొడిక్కూత్తై | : కావిపొడిం దడిపిన వస్త్రములవారై |
| వెణ్ పల్ తవత్తవర్ | : తెల్లని పండ్లుగల తపోవేషంబుగల శివద్విజులు |
| తజ్గళ్ తిరుక్కోయిల్ | : తమ దేవాలయములలో |
| శజ్గు ఇడువాన్ పోగిన్టార్ | : కుంచెకోలలిడంబోవుచున్నారు. |
| ఎజ్గళై మున్నమ్ ఎళుప్పువాన్ | : మమ్ము మున్నుగా లేపునట్లు |
| వాయ్ పేశుమ్ నజ్గాయ్ | : నోటం బలికిన పూర్ణురాలా |
| నాణాదాయ్ | : (చెప్పినట్లుసేయనైతినని) సిగ్గుపడనిదానా |
| నా ఉడైయాయ్ | : పలుకులాడీ |
| శజ్గొడు శక్కరమ్ ఏన్దుమ్ తడ క్కైయన్ | : శంఖముతో జక్రము దాల్చిన విశాల హస్తములవానిని |
| పజ్గయక్కణ్ణానై పాడ | : పుణ్డరీకాక్షునిం బాడుటకు |
| ఎళున్దిరాయ్ | : లెమ్మా. |

ఊజ్గళ్ పుట్టుక్కడై త్తోట్టత్తు వావియుళ్ శెజ్గఝునీర్ వాయ్ నెగిళ్ న్దు ఆమ్బల్ వాయ్‌కూమ్బినకాణ్ — కల్హారములు వికసించె నిన్దీవరములు ముకుళితంబులయ్యెననం బొలంబులకుం బోతిరో మీ కెట్లు తెలిసెనన పెరటితోటబావిననుట. అవి మీరు బలాత్కారమున వికసింపం జేసితిరో యన్నను అసూర్యంపశ్యమని తోచుటకు మీ పెర డనుట. స్నేహమున 'మన' యనవలసినను లేవదయ్యె ననుః చిరాకున వేఱుచేసి చెప్పుట.

అవి వికసింపనాయితమ్ములై యున్నచో వికసించె ననుచుందురు. మఱి యడియాళము గలదో యన్నను,

శెజ్గల్ పొడికూఱై వెణ్‌పల్ తవత్తవర్ తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోగిన్ఱార్ — సన్న్యాసులు తమ యారాధనగృహంబుల కేగుచున్నారనియుం జెప్పుదురు.

శివారాధనకాలంబు కృష్ణారాధనపరల మయిన మనకుం బ్రమా ణంబే యన్నను అట్టి నీమాటయుం బ్రమాణంబుగాదయ్యె ననుచున్నారు.

ఎజ్గళై మున్నమ్ ఎழుప్పువాన్ వాయ్ పేశుమ్ నజ్గాయ్ — పలుకుటయే కాని క్రియ లేదనియును కృష్ణపరిచయంబునం గల్లమాటా డుట యనియుం దోచుచున్నది. మిమ్ము విడిచినచో సైరింపంజాలనని చెప్పి నిరపేక్షవై వాక్క్రియల కైకకంఠ్యంబులేని నీకుం బూర్ణత్వము గలిగెనే యనుట.

ఎழున్దిరాయ్ — మా లోపంబు దీర్ప లెమ్మా యనుట.

నాణాదాయ్ — చెప్పినట్లు సేయనయితినను సిగ్గును లేదయ్యెనే. అట్లైన నాయెడకు మీ రేలవచ్చితిరన్నం జెప్పుచున్నారు.

నావుడై యాయ్ — 'నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః నాసామవేదవిదుషః' అని ఋగ్యజుస్సామవేదంబులెఱుంగని వాని

క్కిట్టిపలుకులబ్బవనియు, 'నూనం వ్యాకరణం కృత్స్నమ్' అని వ్యాకరణంబెల్లం జదువంబోలుననియు, 'సంశ్రవే మధురం వాక్యమ్' అనియుం జెప్పినచొప్పున నీ వాఙ్మాధుర్యము వినంగోరి యిట్లు వచ్చితి మనుట.

మీకు నేను చేయవలయునది యేమన్నను,

శఙ్గొడుశక్కరమ్ ఏన్దుమ్ తడక్కైయన్ పఙ్గయక్కణ్ణానైప్పాడ–
'ఆఴియొడుమ్ పొన్నార్ శార్ఙ్గముడైయడిగళై యిన్నార్ రెన్ఱఱియేన్'
అని చక్రముతో శార్ఙ్గంబుగల సామి నిట్టివాఁడని యెఱుంగనని చెప్పిన చొప్పున ననుభవించువారి వెంగలులం జేయు శ్రీ సుదర్శనంబును విగ్రహంబునకుం బరభాగంబైన శ్రీ పాఞ్చజన్యంబునుంగూడఁ దన వశంబు చేసికొనునట్లు వానిపైఁ దెరవారు చూడ్కుల యందంబున–
'ఇళవాయ్చ్చియర్ కణ్ణినుళ్ విడవే శెయ్దు విఴిక్కుమ్బిరాన్' అని గోపికల కన్నుల దూత్యము సేయంజూచు సామియని చెప్పినట్లు మనల నోడించికొనిన వానిం బ్రీతిపరివాహంబు వెడలునట్లు పాడుటకు. శ్రీ కృష్ణుండు శంఖచక్రధరుండై యవతరించెనని వినుటయు భక్తు లగుట నట్లు దోచుటయుం గలుగుట నిట్లు సెప్పుట.



## పదియేనవ పాశురము

ఇందటిగోష్ఠియుం జూడవలెనని యున్న యొక్కతెను లేపుచోఁ గలిగిన ప్రశ్నోత్తరములం జెప్పుచున్నారు.



ఇళఙ్గళివో ! యిన్నమ్ ఉఋఙ్గువియో ?

శీకాన్లు అక్రై యొన్మిన్ ! నఙ్గైమీర్ !



## 15

ఎల్లే యిళఙ్గిళియే యిన్నముఱఙ్గుదియో
శిల్లెన్ఱళైయేన్మిన్ నఙ్గైమీర్ పోదరుగిన్ఱేన్

వల్లై ఉన్ కట్టురైగళ్ పణ్డే యున్ వాయఱిదుమ్
వల్లీర్గళ్ నీఙ్గళే నానేతాన్ ఆయిడుగ

ఒల్లై నీ పోదాయ్ ఉనక్కెన్న వేఱుడైయై
ఎల్లారుమ్ పోన్దారో పోన్దార్ పోన్దెణ్ణిక్కొళ్

వల్లానై కొన్ఱానై మాత్ఱారై మాత్ఱళిక్క
వల్లానై మాయనై ప్పాడేలోరెమ్బావాయ్.

ఎల్లే ఇళఙ్కిళియే : ఓహో లేతచిలుకా

ఇన్నమ్ ఉఱఙ్గుదియో : ఇంకను నిద్రించుచున్నావో.

నఙ్గైమీర్ : పూర్ణలారా

శిల్లెన్ఱు అఴైయేన్మిన్ : చివుక్కునం బిలువకుండీ

పోదరుగిన్ఱేన్ : వచ్చుచున్నదాన

వల్లై ఉన్ కట్టురైగళ్ : నీ చతురోక్తులచేత సమర్థురాలవై ఉన్నావు.

పణ్డే ఉన్ వాయ్ అఱిదుమ్ : మున్నే నీ నోరు నెఱుంగుదుము.

వల్లీర్‌గళ్ నీఙ్గళే : సమర్థులు మీరే

నానే తాన్ ఆయిడుగ : నేనే కానిండు.

ఉనక్కు వేఱుడైయై, ఎన్న : నీకని ప్రత్యేకానుభవము గలిగి యున్నావే, ఇదియేమి ?

ఎల్లారుమ్ పోన్దారో : అందరును వచ్చిరో?

పోన్దార్ పోన్దు ఎణ్ణిక్కొళ్ : వచ్చినారు - వచ్చి లెక్కపెట్టుకొనుము.

వల్లానై కొన్ఱానై : బలవద్గజమును జంపినవానిని

మాఱ్ఱారై మాఱ్ఱఴిక్క వల్లానై : శత్రువుల బలము మాప సమర్థుని

మాయనై పాడ : ఆశ్చర్యగుణచేష్టితునిం బాడుటకు

ఒల్లై నీ పోదాయ్ : శీఘ్రముగా నీవు రమ్ము.

ఎల్లే ఇళఙ్ కిళియే—శంఖచక్రధరుండగు పుండరీకాక్షునిం జూచుట
కని వీరలు పొరుగింటి పడుచును లేపుచోఁ బలికినదివిని యన్నామం
బులు దాను పాడుచుండ నదివిని యాబిడపలుకనకుంజిలుక యెనయగుం
గాని యెలప్రాయంబునకదియును సాటిగాదని తలంచి యిట్లనుట.

వీరలు పిలుచుట తన యనుసంధానంబునకు విఘ్నంబుగావున
నూరకయుండుం జెప్పుచున్నారు.

ఇన్నముఞ్జుదియో — కృష్ణవిరహంబున నిద్దురసెకి నీ కటాక్షం
బునవలంబనంబుగాంగొని మేమువచ్చినప్పుడును నిద్రింతువేయనుటయు,
కృష్ణానుభవంబునకేకాంతంబగు కాలము సిద్ధించినను నిద్రింతువే
యనుటయు.

స్వానుసంధాన విఘ్నంబగుట రొదసేయవలదని యాబిడ ప్రత్యు
త్తరము సెప్పుచున్నది.

శిల్లైన్లు అళ్లై యేన్మిన్ నఙ్గైమీర్ పోదరుగిన్ఱేన్ — పూర్వా
చార్యులు తిరువాయ్మొళి పాడుచుండ భగవద్బలిబేరయాత్రసైతను
దుస్సహమయినట్లు వీరలమాట దుస్సహంబగుటదోషం జెప్పి మేమును
మాపలుకు నసహ్యంబులగునట్లు పూర్తిగలిగెనే యని వీరలు వలుకం
జివుక్కున బెదరి మీరు పలుకకుంటిరేని వచ్చెద ననుచున్నది.

వీరలు సెప్పుచున్నారు.

వల్లై ఉన్ కట్టురైగళ్ పణ్డే ఉన్ వాయఱిదుమ్ — పూర్ణ
లారాయని బాంధవములేని యట్లు కఠినోక్తులు చెప్పుటయు నింతయుం
జెప్పి మాపైఁదప్పున్నట్లు చెప్పుటయును మున్నేయెఱుంగుదుమనుట.

ఆబిడ సెప్పుచున్నది.

వల్లిరగళ్ నీఙ్గళే నానేతాన్ ఆయిడుగ - మనమాటవిని సంత సిల్లు నీబిడ యదిసైత మనవ్యామగునట్లు కృష్ణగుణావగాఢయమ్మోనని సంతసిల్లుటకుబదులుగా నాపై దోషారోపంబుసేయుట మీ చాతుర్యం బుగాదే. అది యట్లుండుంగాత. నే నే దుష్టురాలనగుదుఁ గాత. 'మత్పాప మేవాత్ర నిమిత్తమాసీత్' పరుల యకృత్యంబునకుఁ దనపాపమే నిమిత్త మనిన శ్రీ భరతుని చందమునం జెప్పుట.

వీరలు సెప్పుచున్నారు.

ఒల్లైనీపోదాయ్ ఉనక్కెన్న వేఱుడైయై — నిన్నువిడిచి యొక్క తిఁణమేనియు మేను నిలువంజాలము. 'శాదుక్కోట్టియుళ్ కొళ్ళప్పడు వారే' (పె - తి) అని సాధుగోష్ఠీపరిగృహీతత్వంబభ్యర్హితంబై యుండ స్వయంపాకంబుసేయువారి విధంబున నీకుం బ్రత్యేకానుభవంబు దగునే. భగవద్భక్తుల బహిష్కరించి సేయు భగవదనుభవంబుసైత మభ్యర్హితంబు గాదనుట. శ్రీ రామానుజసంబంధుల రానీవలదని రాజశాసనమున శ్రీరంగద్వారంబుననున్న భటులు, నీవు మంచి వాఁడవు లోపలంజొచ్చి సేవింపవచ్చునని చెప్పినం గూరత్తాళ్వాను శ్రీ రామానుజసంబంధము బహిర్భూతంబైనచో భగవద్దర్శనంబొల్లనని పలికెనఁట.

నాకు మిమ్మును విడిచి వేఱొక్క సుఖంబు గలదే యందఱును లేచినంగాని లేవననియుంటి నింతియయని యీబిడ సెప్పుచున్నది. ఎల్లారుమ్ పోన్దారో.

వీరలు సెప్పుచున్నారు.

పోన్దార్ పోన్దు ఎణ్ణిక్కొళ్ — అందుకుఫలము వేఱువేఱుగఁ జూచుటయు ననుభవించుటయు.

మనమిప్పుడు సేయునది యేమన్నం జెప్పుచున్నారు.

వల్లానై కొన్ఱానై మాఱ్ఱారై మాఱ్ఱళిక్క వల్లానై మాయనై ప్పాడ—కువలయాపీడంబుం జంపి మనకు జీవనంబైన లేన్నుంగాచి చాణూర కంసాదులం జంపి, "న సమం యుద్ధమిత్యాహుః" అన్న చొప్పున నీ సుకుమారుల కీ కఠినులతోఁ బోరు సరిగాదని వేచిన నాగరికసుందరుల తాపంబుం దీర్చి తనచేతమనము పడవలయు పాటును మనచేతం దాఁ బడుచుండువానిం బాడుటకనుట. గజంబువంటి మన స్త్రీత్వాభిమానం బునడచి శత్రుబలంబువలె మనకు విరోధియగు గోపవృద్ధ సంకల్పంబుజిపి తనచేత శత్రువులోడినట్లు మనచేత నోడు నాశ్చర్యభూతునిం బాడుట కనుటయు.



## పదియాఱవ పాశురము

ఇట్లందఱుంగూడి శ్రీ నందగోపగృహంబునకరిగి యది గృహపాల ద్వారపాలపాలితంబుగావునం దదనుజ్ఞ వడయుట యావశ్యకంబుగాన వారల సభాజనపూర్వకంబుగాఁ గవాటార్గళోద్ఘాటనంబు వేడుచున్నారు. భగవత్సమాశ్రయణంబు పురుషకారపూర్వకంబుగా చేయనిచో మేరదప్పిన శూర్పణఖచందంబగునని తలంచి మున్నుగా వారల వేడుచున్నారనియుఁ జెప్పుదురు.



కోయిల్ కాప్పానే! కొడిత్తోన్ఱుమ్ తోరణ
వాయిల్ కాప్పానే! మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్



## 16

నాయగనాయ్ నిన్ఱ నన్దగోపనుడైయ
    కోయిల్ కాప్పానే కొడిత్తోన్ఱుమ్‌తోరణ
వాయిల్ కాప్పానే మణిక్కదవమ్ తాళ్‌తిఱవాయ్
    ఆయర్‌శిఱుమియరోముక్కు అఱైపఱై
మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్‌నేర్‌న్దాన్
    తూయోమాయ్ వన్దోమ్ తుయిలెழప్పాడువాన్
వాయాల్ మున్నమున్నమ్ మాత్తాదేయమ్మా నీ
    నేయనిలైక్కదవమ్ నీక్కేలోరెమ్బావాయ్.

నాయగనాయ్ నిన్ఱ నన్దగోప : నాయకుండైన నందగోపుని
నుడైయ

కోయిల్ కాప్పానే : గృహంబు కావలివాఁడా

కొడిత్తోన్ఱుమ్ తోరణవాయిల్ : ధ్వజముదోఁచు తోరణయుక్త ద్వారము
కాప్పానే కావలివాఁడా

మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్: రత్నకవాటము గడియ దిగియుమీ

ఆయర్ శిఱుమియరోముక్కు : గొల్ల పిన్నపడుచులమగు మాకు

అఱై పఱై : వాయించు వాద్యవిశేషమును

మాయన్ మణివణ్ణన్ : ఆశ్చర్యగుణ చేష్టితుండును మణివర్ణుండు
నగు కృష్ణుండు

నెన్నలే వాయ్‌నేర్‌న్దాన్ : నిన్ననే (ఇచ్చెదనని) వాగ్దానమిచ్చినాఁడు.

తుయిలెళ పాడువాన్ : మేలుకొలుపం బాడుటకు

తూయోమాయ్ వన్దోమ్ : పరిశుద్ధులమై వచ్చితిమి.

వాయాల్ మున్నమున్నమ్ : నోట మున్నమున్నగా నిషేధింపకుము.
మాత్తాదే

అమ్మా : స్వామీ

నీ నేయనిలై క్కదవమ్ నీక్కు : నీవే స్నేహముగల స్థిరకవాటమును
తెఱవుమీ.

నాయగనాయ్ నిన్ఱ నన్దగోపనుడైయ కోయిల్ కాప్పానే — నాయకుండనైన కావలివాండా యని 'పాపిష్ఠః క్షత్రబన్ధుశ్చ పుణ్డరీకశ్చ పుణ్యకృత్। ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్' అని ఫలసిద్ధి యాచార్యాధీనంబని చెప్పంబడుటయుం బ్రథాన శేషికన్నను ద్వారశేషి యుద్దేశ్యుండగుటయు నుపకారకుని నాయకుండనుచున్నారనియుం జెప్పుదురు - తమయాశ్రయణీయుండు పారతన్త్ర్యప్రియుండు 'అడియార్ నిలాగిన్ఱనై కున్దమో' (తి - వి) అని - దానులధిష్ఠించియున్న వైకుంఠంబని తనవిభూతి దాసులపరంబు సేయుట యింపగుటయుం దనకు స్వామినపేక్షించి యిందవతరించుటయుం గాన నందగోపుని గృహంబనుట యని యుం జెప్పుదురు. పిన్న పడుచులగుటచే గృహంబు కావలివాండా యని వాని పనింబట్టి పిలుచుట 'యథోచితం శేష ఇతీరితేజనైః' అని యనేకవిధకైంకర్య వృత్తులంబట్టి యనంతుండు శేషుండనంబడుంగాన శేషవృత్తి ప్రయుక్తంబగుపేరే యాత్మకు ముఖ్యనామంబగుటచే వాని నానందింపింప నిట్లనుచున్నారనియుం జెప్పుదురు.

అతండు కనుసన్నం బొమ్మనినట్లుగాఁ దోప ద్వారపాలునిం బిలుచుచున్నారు.

కొడిత్తోన్ఱుం తోరణవాయిల్ కాప్పానే — ఎవ్వరు విఘ్నము సేతురో యను భయంబున నిందరిని వేడుట. మున్ను చెప్పిన గృహపాలుండే ద్వారపాలుండుగాన వానినే పిలుచుచున్నారనియుం జెప్పుదురు. ఆర్తత్రాణంబునకు ధ్వజంబు నాటి తోరణము గట్టు చందంబున మా యార్తిం దీర్చి మోదమిచ్చుటకుం గదా నిన్నుంచుట యని చెప్పుచున్నారఁట.

మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్ — 'పొన్నియలుమాడ కవ్వాడమొకడన్దు పుక్కు' ( పె - డల్ ) అని సువర్ణాలంకృతసౌధ కవాటము దాటి చొచ్చి యన్నచొప్పునం జొచ్చువారలం దన యంద

సును బంధంబు సేయుచుం జొచ్చిన వారు వెలువడనీని కృష్ణునిచొప్పున నున్న తలుపనుట.

గడియం దిగియుమనవుడు భయస్థానంబగు నీ ప్రదేశంబున మధ్యరాత్రిం బిలుచు మీరెవ్వరని యతండడుగ - సర్వభయహరుం డున్నచో భయకారణంబేమని వీరడుగ - యుగము త్రేత, తండ్రి శంబరాంతకుండు, కుమారులు పురుషసింహంబులు, పురంబయోధ్య, మంత్రులు వసిష్ఠాదులు నైన నాటివలె నున్నదో నేడు. యుగము కలిసన్నిహితంబగు ద్వాపరము, తండ్రి సాధువగు శ్రీ నందగోపాలుండు, కుమారులు దుశ్చేష్టలు సేయు బాలురు, ఊరు గొల్లపల్లె, కంసుండు ప్రబల శత్రువు, కానవచ్చు నంకురములు సైతమసురాంకురములు, ఇట్లుండ భయముదీరి యుండవచ్చునే యని యతండన-స్త్రీలంగాంచియు భయపడవలయునే యని వీరన - శూర్పణఖ స్త్రీగాదో యని యతండు పలుక - నందకుమారుల సేమంబు గోరు గొల్లయింతులకును భయపడం గూడునే యన్నను పూతనం గన్నది మొదలుగ నిదియుం గూడునని యతండనం జెప్పుచున్నారు.

ఆయర్ శిఱుమియరోముక్కు — కృత్రిమం బెఱుంగని యెల ప్రాయంబువారల మనుట.

అట్లైనచో వచ్చినకార్యంబు సెప్పుమనం జెప్పుచున్నారు.

అత్తై పత్తై — వ్రతమునకు నది గావలసి వచ్చితి మనుట.

అట్లైనచో నిద్దుర మేల్కాంచిన విన్నవించెదము. ఆవరకు నుండుండనం జెప్పుచున్నారు.

మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్నేర్న్దాన్ — నీవు నేడు వేఱుగ విన్నవింప నక్కఱలేదనుట. స్త్రీగోష్ఠిలో నైచ్యానుసంధానంబు సేయుట నాశ్చర్యం బనుట. అట్లు సేయకున్నను విడువంజాలని

మొదలి సొబగున మణిప్రవాళమునఁ ‘ వాస్మి శ్రీమాన్ ’ ( రా - జా ) అన్నచోట్లను బలుకునప్పటి యర్థరసస్ఫూర్తి శోభ యనియుం జెప్ప వచ్చును. చిన్ననే యనుట - చిన్న వేషంకోగా వలయు నేటివంటివో మమ్ము నర్తించు వేడికొను చిన్నటివిరుబడుట.

వినోదగోష్ఠిలోఁ బలికినది యథార్థంబగునో యని యతండు ‘ కృష్ణే న మే మోఘం వచో భవేత్ ’ అని, ద్రౌపదీ చేసాడిన పలుకు చిత్రగారవమునానిమాట యాబిడయెడ రిక్తయగుచోఁ గదా మాయెడ రిక్తయగుట యన, నది యనన్యప్రయోజనవిషయంబన, మేము నట్టివారలమే యనుచున్నారు.

తూయోమాయ్ వన్దోమ్ — వాద్యవిశేషంబు వ్యాజంబు గాన ననన్యప్రయోజనలమై యతండు వచ్చుటకు బదులుగా మేమే వచ్చితి మనుట.

అందుకే డీయాలం బేమని యతండడుగం జెప్పుచున్నారు.

తుయిలెழ్ప్పావువాన్ — ‘స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరన్తపః ’ అని సీతాదేవి యితని సుఖనిద్రాశోభ గాంచి యానందించి నట్లు మేము సుఖప్రబోధశోభం జూడ నాశపడుచున్నామనుట.

అల్లైనచోఁ దెఱచెద నుండుం డని యతండనం జెప్పుచున్నారు.

వాయాల్ మున్నమున్నమ్ మాత్ర్ నేదే — నీవు మనంబున నేమి దలంచినను నిషేధోక్తి వలుకకుమీ. నీచేతిది సుమీ మా జీవనము. శ్రీవిభీషణుండు శ్రీరామదేవునిం జేరం బోవుచో ‘ వధ్యతామ్ ’ అని చంపుమన్నవారలే ‘ అస్మాభిస్తుల్యో భవతు ’ అని మాతోసరిగా నుండుం గాతమనిన పిమ్మట గదా యతండు జీవించినది.

అమ్మా — లోనున్నవాఁడే కాడు నీవే మా యభీష్టప్రదుండవగు నాథుండవని యిచ్చకమాడుట.

గడియం దిగిచికొని చొరుఁడీ యనం జెప్పుచున్నారు.

నీ నేయనిలైక్కదవమ్ నీకు—అది నీకంటెను స్నేహంబు గల యది, మేము తెలియవంజాలము నీవే తెలియవుమనుట. చేతనాచేతన విభాగంబు లేక కంసపరివారం బెల్లం బ్రతికూలమగు నట్లీయూర నున్నది యెల్ల ననుకూలమై యుండుననుట.



## పదియేడవ పాశురము

ఇట్లు ద్వారపాలుండు గడియదిగిచి లోఁ జొరవిడువ లోఁజొచ్చి కృష్ణుని స్త్రీలు మ్రుచ్చిలుదురని కావలిగా నున్న శ్రీనందగోపాదులను లేపుచున్నారు. అనిరుద్ధుని సైతము మ్రుచ్చిలిన స్త్రీలు అట్టి యందం బునకుం బ్రభవంబైన 'సాక్షాన్మన్మథమన్మథుం'డగు కృష్ణుని మ్రుచ్చిలుట యరుదే యని చెప్పుదురు.



ఎమ్బెరుమాన్ నన్దగోపాలా ! ఎళున్దిరాయ్...
ఎమ్బెరుమాట్టి యశోదాయ్ ! అఱివుఱాయ్



# 17

అమ్బరమే తణ్ణీరే శోఱే యఱమ్శెయ్యుమ్
ఎమ్బెరుమాన్ నన్దగోపాలా వె**ళు**న్దిరాయ్

కొమ్బనార్కెల్లామ్ కొ**ళు**న్దే కులవిళక్కే
ఎమ్బెరుమాట్టి యశోదాయ్ అఱివుఱాయ్

అమ్బరమూడఱుత్తోఙ్గి ఉలగళన్ద
ఉమ్బర్ కోమానే యుఱఙ్గాదె**ళు**న్దిరాయ్

శెమ్బొఱ్క**ళ**లడిచ్చెల్వా బలదేవా
ఉమ్బియుమ్ నీయుముఱఙ్గేలో రెమ్బావాయ్

| | |
|---|---|
| అమ్బరమే తణ్ణీరే శోఱే | : వస్త్రము చల్లని నీరు అన్నమును |
| అఱమ్ శెయ్యుమ్ | : దానముసేయునట్టి |
| ఎమ్బెరుమాన్ నన్దగోపాలా | : మా స్వామీ నన్దగోపాలా |
| ఎఴున్దిరాయ్ | : లెమ్మా |
| కొమ్బనార్క్కెల్లామ్ కొఴున్దే | : లతాఙ్గులకెల్ల చిగురయిన యమ్మా |
| కులవిళక్కే | : కులదీపమా |
| ఎమ్బెరుమాట్టి అశోదాయ్ | : కృష్ణునిం గని యిచ్చి మాస్వామినివైన |
| అఱివుఱాయ్ | : యశోదా లేవవో |
| అమ్బరమ్ ఊడు అఱుత్తు | : ఆకాశావకాశము భేదించుకొని |
| ఓఙ్గి ఉలగు అళన్ద | : యెదిగి లోకములం గొలిచిన |
| ఉమ్బర్ కోమానే | : దేవతలకు స్వామీ |
| ఉఱఙ్గాదు ఎఴున్దిరాయ్ | : నిద్రింపక లెమ్మా |
| శెమ్పొన్ కఴలడి శెల్వా | : రక్తంబై స్పృహణీయంబైన బిరుదు పెండేరముతోడి శ్రీపాదము గల సంపన్నుండా |
| బలదేవా | : బలదేవుడా |
| ఉమ్బియుమ్ నీయుమ్ | : నీ తమ్ముడును నీవును |
| ఉఱఙ్గేల్ | : నిద్రింపక లెండీ. |

అమ్బరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్ — అన్నాదులలో వలయువారికి వలయునవి యెల్ల పుష్కలముగా నిచ్చుటయు; సంప నొక్కొకటి యిచ్చుటయే నిదియే యింతనికి సహజంబని తోచునట్లును ఫలాభిసంధిరహితముగా నానృశంస్యమున నిచ్చుటయు. లోకులకు ధారకాదుల నొసంగు నీవే మాకును ధారకంబొసంగుమనుట.

ఎమ్బెరుమాన్ నన్దగోపాలా ఎழுన్దిరాయ్ — 'సర్వాభాయ కేశవః' అనియును—'ఉణ్ణుమ్ శోఱు పరుగు నీర్ తిన్నుమ్ వెత్తిలై యుమెల్లామ్ కణ్ణన్' (తి - య్ - మొ) అనియును తిను నన్నము త్రావు నీరు నమలు తాంబూలంబు నన్నియుం గృష్ణుండే యనియుం జెప్పిన చొప్పున మాకు ధారకపోషకభోగ్యంబులన్నియు నయిన కృష్ణునిం గని యిచ్చిన స్వామీ. లోకములో స్త్రీలకు దానంబిచ్చువారు వేరు గదా. మాకుం గృష్ణుని దానము సేయు స్వామివి నీవే యనుట.

తయన లేచి యనుమతిదోప నూరకుండ యశోదను లేపుచున్నారు.

ఈమెను లేపి పురుషకారముగా మున్నుంచికొని శ్రీనంద గోపాలుని లేపవలసియుండగా నట్లుసేయమికి హేతువు కృష్ణునియెడ సంగాతిశయంబున సన్నిహితఖట్వాయందు పవ్వళించియుండుటయే.

కొమ్బనార్ క్కెల్లామ్ కొழுన్దే — 'నారీణా ముత్తమా వధూః' అన్నచొప్పున ననుట.

కులవిళక్కే — ఇక్కులంబునకు మంగళదీపమా యనియు స్త్రీ కులంబునకెల్ల దృష్టియయిన దీపమా యనియుం జెప్పవచ్చును. స్త్రీలలో నెవ్వరి కేకొంత గలిగినను నీ మొగంబువాడునని తోపం జిగురనుట.

ఎవ్వెరుమాట్టి యశోదాయ్ అఱివుఱాయ్—శ్రీనందగోపాలుని వలెం గాక సజాతీయవై యును ప్రియకామవై యును హితకాముఁడై న యత్తింఁడె లేచినను నీవు లేవకుంఁడువే, నీవు లేచినను మాకు గొఁఅంత గలదే యనుట.

ఆమెయు సంవాదంబిడ లోఁజొచ్చి కృష్ణుని లేపుచున్నారు.

అమ్బరమ్ ఊడఱు అఱుత్తు ఓఙ్గి ఉలగు అళన్ద — ప్రయోజనాన్తర పరులగు దేవతలకై ప్రదేశనియతి లేక నిరుపాధికరక్షకత్వంబు పట్టి యడిమె జీవనోదకంబుగా నెదిగి, నిద్రించు బిడ్డలం గాగలించికొను తల్లి విధంబున, నందఱి తలలయందును ఊరు నూనె యిడినట్లు శ్రీపాదంబులం జల్లగా నుంచినాఁడనుట.

ఉమ్బర్ కోమానే — ఆకృత్యంబున దేవతల గాని నిత్యసూరుల గాని వశీకరించికొన్నవాఁడా యనుట. మాకు శిరోభూషణంబై న శ్రీపాదమున గట్టుంబుట్టయుం గొలిచెనే యిదేమి వాత్సల్యంబని వార లోడుట.

ఉఱఙ్గాదెళున్దిరాయ్—దర్శనంబిచ్చుటకు మగవారలుం బ్రయోజ నాంతరపరులు గావలయునో. అనన్యప్రయోజనలగు నబలలయినం జాలదో. మాకు దర్శనమిచ్చుచోఁ బిన్నం బెద్దది సేయవలయునే. నీ వాసి యెఱుంగని లోకులకు సులభంబయిన శ్రీపాదము నీ వాసియెఱింగిన మాకు సులభంబుగారాదో యనుట. మిమ్ము లేపెదనన్న నీవే నిద్రించెదవే. 'అనిద్రః సతతం రామః' అన్నవిధంబు నీయెడం గల్ల యయ్యెనే యనుట.

ఇట్లు లేపినను లేవకుండుటం జూచి, మేరదప్పితిమి మున్నుగా బలదేవుని లేపవలయునని యాతని లేపుచున్నారు.

శేముషీజ్యోత్స్నాలశిష్యాఽస్త్వ బలదేవా — భిక్షలం గనున్నా బంగా రడుగుంచి పుట్టిన సిరిగలవాఁడా యనుట.

ఉమ్మియుమ్ నీయుమ్ ఉఱజ్జేల్ — పరస్పరి ఛవ్యాంగు మీరిరువురును లేవవలయును. 'సందేశైః సామమధురైః ప్రేమగర్భైరగర్వితైః । రామేణాశ్వాసితా గోప్యో హరిణా హృతచేతసః ॥' అని కృష్ణాసక్తచిత్తలగు గోపికలను, సామమధురంబులై ప్రేమగర్భంబులై యగర్వంబు లయియున్న సందేశవాక్యముల బలదేవుండూరడించెనని చెప్పిన యొప్పున మాకు నతనికిని సంధిం జేయువాఁడవు కావే యనుట.



## పదునెనిమిదవ పాశురము

ఇట్లు లేపిన నతండు లేవకుండుటం జూచి విచారించిన దేమన్నను అభినివేశప్రేరణంబున మున్నుగా కృష్ణుని లేపంబోతి మింతియ. పురుషకారపురస్సరంబుగాఁ బోవుటయే ఫలవ్యాప్తము. అట్లు గాకున్నచో శూర్పణఖచందంబు సంప్రాప్తమగునని తలంచి నీళాదేవిని లేపుచున్నారు.



ఉన్ద మదకళిర్గ్రాన్..........

నన్ద్రో పాలన్ మరుమగళ్ళే!..........

పద్దల్ మేల్ పల్ కాల్ కుయిలినజ్గల్ కూవినకాణ్



## 18

ఉన్దుమదగళిఱ్ఱ నోడాదతోళ్వలియన్
నన్దగోపాలన్ మరుమగళే నప్పిన్నాయ్

కన్దమ్‌కమఴుమ్ కుఴలీ కడైతిఱవాయ్
వన్దెఙ్గుమ్ కోఴియఴైత్తనకాణ్ మాదవి

ప్పన్దల్ మేల్ పల్కాల్ కుయిలినఙ్గళ్ కూవినకాణ్
పన్దార్ విరలి యున్మైత్తునన్ పేర్పాడ

శెన్దామరైక్కైయాల్ శీరార్వళై యొలిప్ప
వన్దుతిఱవాయ్ మగిఴ్న్దేలో రెమ్బావాయ్.

ఉన్దు మదకళిఱ్ఱన్ : ప్రసన్నమదగజమువంటివాఁడై

ఓడాద తోళ్ వలియన్ : ఓడని భుజబలంబువాఁడైన

నన్దగోపాలన్ మరుమగళే : నందగోపాలుని కోడలా

నప్పిన్నాయ్ : నీళాదేవీ

కన్దమ్ కమఴుమ్ కుఴలీ : పరిమళమునెరపుచున్న యలకభారంబు గలదానా

కడై తిఱవాయ్ : తలుపు గడియ దిగియుమీ

వన్దెఙ్గుమ్ కోఴి అఴైత్తన : వచ్చి యెందును కుక్కుటంబులు

కాణ్ : కూయుచున్నవి సుమ్మీ

మాదవిప్పన్దల్ మేల్ పల్ కాల్ : మాధవీలతల పందిళ్ళపై బలుమారు

కుయిలినఙ్గళ్ కూవినకాణ్ కోకిలసమూహంబులు కూయుచున్నవి చూడుమీ

పన్దార్ విరలి : బంతిచే నిండియున్న వ్రేళ్ళు గలదానా

ఉన్ మైత్తునన్ పేర్ పాడ : నీ ప్రియుని నామంబులం బాడుటకు

శెన్దామరై క్కైయాల్ : కెందామరవంటి కేలున

శీరార్ వళై ఒలిప్ప : సిరిమించు కంకణంబులు ఘోషింప

మగిఴ్న్దు వన్దు తిఱవాయ్ : సంతసిల్లి వచ్చి తెఱువుమీ.

ఉన్దుమదకళిఱ్ఱన్ ఓడాదతోళ్ వలియన్ నన్దగోపాలన్ మరు మగళే — మహాబలుండనియు 'యుద్ధేచాప్యపలాయనమ్' అన్న చెప్పిన ప్రతిపక్షులతోఁ బోరాడుచోఁ వెనుకదీయనివాఁడనియు; ఇతని బలంబు దలఁచుట యేమన్నను, మన మన్నయంబుం దలంచిన నీశ్వరుని రక్షకత్వంబు దలంచి భయము దీరవలయునట్లు, కంసుని ప్రాబల్యంబును కృష్ణుని ధూర్తత్వంబుం గాంచి యిమ్మిథునంబున కేమి సంభవించునో యని తోఁచు భయంబు దీరుటకు నితని బలంబు దలంచి ధైర్యంబు దెచ్చుకొనవలయునట. 'స్నుషా దశరథస్యాహం శత్రుసైన్యప్రతాపినః' అని నేను శత్రుసైన్యంబు వ్రేల్చు దశరథుని కోడలనని శ్రీ సీతాదేవి యనువిధంబునం గులస్త్రీలకు పుట్టినింటికంటెను శ్వశురకులోత్కర్షంబు ప్రియతరంబుగావునం గుంభుని కూతురనక యీతనికోడలనుట.

శ్రీకృష్ణావతారంబైనవెనుక శ్రీనందగోపాలుని కోడలనుట వ్యావర్తకము గాదుగాన నామనిర్దేశంబునం బిలుచుచున్నారు. నప్పిన్నాయ్ — నీళాదేవి అని.

కన్దమ్ కమழுమ్ కుழలీ — 'వాశమ్ శెయ్ పూఙ్గుழలాళ్' (తి - య్ - ళ్) అనుచెప్పిన పరిమళమునకు నుత్కర్షంబిదు నలక భారంబు గలదంట. 'సర్వగన్ధః సర్వరసః' అనువానికి సైతము వాసన నిడునంట.

కడై తిఱవాయ్ — కృష్ణపరిమళంబును నీ పరిమళంబును నిండి యుండం బ్రవాహంబునకుం గట్టుకట్టినట్లు నిలుపక వెలువడి మా వడ దీర్చునట్లు తలుపు తెఱవు మనుట.

నిశీథంబున నేల లేపెదరని యాబిడ యనం దెల్లవారెనని చెప్పి యందుకడియాళంబేమని యాబిడ యడుగం జెప్పుచున్నారు.

వన్దు ఎఙ్గుమ్ కోழி యழைత్తనకాణ్ — కోడి గూయుచున్న దన్నచోఁ బ్రమాదంబున నొక్కటి గూసినం దెల్లవారెనే యను శంక దీర నెందుంగూయుచున్నవనుట.

అవి జామునకొక్కమాఱు గూయుటయుం గలదన్నం జెప్పు చున్నారు.

మాదవిప్పన్దల్ మేల్ పల్ కాల్ కుయిలినఙ్గళ్ కూవినకాణ్ — స్పర్శసుఖంబున 'నోపజనం స్మరన్' అని ప్రాచీన శరీరంబు దలంచని ముక్తపురుషుని చందంబున మైమఱచి నిద్రించునవి లేచినచోఁ దెల్లవా రదే యనుట. నీ కటాక్షంబును స్పర్శంబును ధారకంబుగానుండు కోయిలలు దెల్లవారియు నిన్నుం గనమిచేఁ దగదొట్టి కూయుగన్న వనుట. ఒక్కటి యొక్కమాఱు గూసినం దెల్లవారెననవచ్చునే యను శంకదీర సమూహంబులనియుం బలుమాఱనియుం జెప్పుట.

పన్దార్ విరలి — కృష్ణునితో బంతియాడి యతని నోడించి భోగోపకరణంబుగా నతని నొక్కచేతం గొని లీలోపకరణంబుగా బంతి నొక్కచేతం గొనునట. 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ' (శ్రు) అని యొక్క వైపున విభూతి యను నారంబు, నొక్క వైపున విభూతి మంతుండగు నారాయణుని విడువక యుభయసంబంధంబునం బురుషకార భావంబు దోప దీపించు శ్రీదేవిచందంబున నుండునట. మేమును నీ చేతి బంతియయినచో బాగుగానుండునే యనుచున్నారట.

మీరువచ్చిన పని యేమనం జెప్పుచున్నారు.

ఉన్ మైత్తునన్ పేర్ పాడ — తల్లిదండ్రులయెడం బ్రవర్తిల్లు చందంబున, మీరు ప్రణయకలహంబున వివాదంబు నేయుచో నీపక్షంబున

నుండి యతని కృత్యంబుల నెల్లం జెప్పి పెట్టుటకును పరస్పరశ్లాఘా సమయంబున శ్లాఘించుటకు ననుట.

అట్లైన-చోఁదలుపు తెఱచికొని చొరఁబడుండనం జెప్పుచున్నారు.

శెన్దామరై క్కైయాల్ శీరార్ వళై ఒలిప్ప వన్దు తిఱవాయ్ — ఈశ్వరస్వాతంత్ర్యమునకు వెరచియున్నవారలకు 'భవేయం శరణం హి వః' అని మీకు శరణమగుదు నని చెప్పిన (శ్రీ) సీతాహస్తంబువంటి నీహస్తమున. మావలె వలయంబుల బోవిడువక 'శఙ్గుతఙ్గుమున్కై' అన్నచొప్పున శంఖవలయంబులుగల ముంజేయిగాన శ్రీసంపన్నంబైన నీ హస్తంబుతో నీవు తెఱచు నందంబుగని యందఱము నానందించెద మనుట. వీరిరువురుంగూడ నిడునాభరణంబులే తమచేత నిలుచునవి యట.

మగిళ్న్దు — వాకిటం గాచియుండ వేఱుగా భోగంబు సైచునే యని. ధర్మమునకై తెరచుట గూడదు. నీలాభంబనియే తలంప వలయుననుట. కృష్ణసంశ్లేషహర్షంబు ముఖమునం దోపననియుం జెప్ప వచ్చును.



## పందొమ్మిదవ పాశురము

ఈబిడ తలుపు తెఱువంబోవ మనజనులయొడ యీబిడ మున్నగునని లేవనీకుండ బిగ్గరం గవుంగిలించియున్న కృష్ణుని లేపంజూచి యతండు మాఱుమాట వలుకకుండ వెండియు నతని లేపుమని యీబిడను లేపుచున్నారు.



...ళక్కెరియ కోట్టుక్కాల్ కట్టిల్ మేల్
మెత్తెన్ఱ పఞ్చ శయనత్తిన్.........
తత్తువమ్ అన్ఱు తగవు



# 19

కుత్తువిళక్కెఱియ కోట్టుక్కాల్ కట్టిల్ మేల్
    మెత్తెన్ఱ పఞ్చశయనత్తిన్ మేలేఱి
కొత్తలర్ పూఙ్గుఴల్ నప్పిన్నై కొఙ్గైమేల్
    వైత్తుక్కిడన్దమలర్ మార్బా వాయ్తిఱవాయ్
మైత్తడఙ్గణ్ణినాయ్ నీ యున్ మణాళనై
    ఎత్తనై పోదుమ్ తుయిలెఴవొట్టాయ్కాణ్
ఎత్తనైయేలుమ్ పిరివాఱ్ఱకిల్లాయాల్
    తత్తువమన్ఱు తగవేలోరెమ్బావాయ్.

కుత్తువిళక్కు ఎరియ : దీపములు వెలుగుచుండ

కోట్టుక్కాల్ కట్టిల్ మేల్ : దంతపుకోడులుగల మంచముమీద

మెత్తెన్ర పఞ్చశయన త్తిన్ మేల్ ఏఱి : మృదువైన పంచశయనంబుపై నెక్కి

కొత్తలర్ పూఙ్గుఴల్ : గుచ్ఛములై వికసించిన పూవులతోఁ గూడిన కేశభారముగల

నప్పిన్నై కొఙ్గైమేల్ : నీలాదేవి కుచతటంబుపై

వైత్తుక్కిడన్ద మలర్ మార్బా : ఉంచియున్న వికసిత వక్షస్థలంబువాఁడా

వాయ్ తిఱవాయ్ : నోరు తెఱవవే

మైత్తడఙ్గణ్ణినాయ్ : అంజనసహిత విశాలనేత్రా

నీ ఉన్మణాళనై : నీవు నీ వల్లభుని

ఎత్తనై పోదుమ్ తుయిలెఴ : ఎంత ప్రొద్దును నిద్దురమేలుకొన

ఒట్టాయ్ కాణ్ : నీవునుమీరా

ఎత్తనై యేలుమ్ పిరివాఱ్ఱ కిల్లాయాల్ : ఎంతయు విశ్లేషంబు సహింపలేవయ్యో

తత్తువమ్ అన్ఱు తగవు : నిజముగా ధర్మము గాదు.

పత్తువిళక్కు — ఏరియు — నూవలె నూఁడినాఁడియుంగన్
యక్కఱలేక తూర్పు తెల్లవారుచున్నదను భయంబునులేక చీకటులు
గావలయు నను నపేక్షయులేక రేయి పగలుచేసికొని కృష్ణానుభ
వంబు చేసికొనుచుం బడుకం బవ్వళించెదే. ఇందఱమును వాకిటం
గాచియుండ నిదియేమనుభవంబని కోపం జెప్పుంట. 'అతీవ రామః
శుశుభేఽభిరామయా' అని సీతాదేవి శ్రీరామదేవునకుం బ్రకాశిక
యయినచొప్పున నీవు కృష్ణునకు వెలుంగవై యుండ దీపంబులుంగలిగెనే.

కోట్టుక్కాల్ కట్టిల్ మేల్ — వీరపత్ని యగుటచేతం గువలయా
పీడంబువంటి గజములం జంపి తెగిచిన దంతములంగాని నిద్దురవట్టదట.
మావలె శ్రీబృన్దావనమునకుం బోనక్కఱలేక లోగదిలో భయం
జేమియు లేక నిద్దురింపం గలిగెనే యేమి భాగ్యంబనుట. మాణిక్య
ములతోఁ జేసినను మంచమను సామాన్యవచనము వ్యవహరింప
వలయునంట.

మెత్తెన్ఱ పఞ్జశయనత్తిన్ మేలేఱి — దూదిపరుప్పై నెక్కియనియుం
జెప్పవచ్చును. సౌన్దర్య - శైత్య - మార్దవ - పరిమళ - ధావళ్యంబులుగల
శయనముకాని బంచవర్ణశయనముకాని బంచశయనమనంబడును.
మేమార్తులమయియుండం ద్యాజ్యోపాదేయంబుల విమర్శింపుచుం బడకం
బన్నుండుటింపై కంటికి నిద్దురపట్టెనే. మాకో యన్నను — 'మెన్మలర్
ప్పళ్ళి వెమ్బళ్ళి' యన్నచొప్పున మృదుపుష్పశయనంబును తీక్ష్ణశయనం
బయియుండును. 'పాదేనాధ్యారోహతి' యని పరమపదగతుండు
పరమాత్మపర్యంకంబుం బాదంబున నెక్కునన్న చొప్పున మేము నీ పడక
నెక్కినప్పుడే పో నీకు శయనంబు రుచిరంబుగాఁ గూడుననుట.

కొత్తలర్ పూఙ్గుళల్ నప్పిన్నై కొఙ్గైమేల్ — తత్కేశభార

స్పర్శంబుననే యట పుష్పంబులు గుత్తులుగుత్తులుగా వికసించుట. ప్రణయకలహంబునం దత్స్పర్శంబున వికసించుట యనియుం జెప్పుదురు.

వై త్తుక్కిడన్ద మలర్మార్బా — కుచతటంబుపై వక్షస్థలంబని కాని అది వక్షస్థలంబున ననికాని యుంచుట యనవచ్చును. ప్రణయ పద్ధతికి 'న శాస్త్రం నైవ చ క్రమః' అన్నచొప్పున శాస్త్రముగాని క్రమముగాని నియామకముగాదు. కుచతటస్పర్శంబుననే వికసించి వక్షస్థలంబు విశాలంబయ్యెనఁట. 'స్వదైకరూపరూపాయ' అను నది విగ్రహపరంబైన నెప్పుడు నొక్కవిధమున నింపయియుండు విగ్రహంబువాఁడని చెప్పవచ్చుఁ గాని యీ విగ్రహం బెవ్వరి నానందిం పింపం దాల్చెనో వారి సంశ్లేషమునం గలుగు తద్వికారంబులు లేనిచో నది వారలకింపగునే యని చెప్పుదురు.

వాయ్ తిఱవాయ్—నీ గంభీరకంఠధ్వని నొక్కపలుకు పలుకరాదే. 'ఆర్తో వా యది వా దృప్తః' (రా) అని శరణాగతుఁ డార్తుండయినను, దృప్తుండయినను గాచుట న్యాయ్యంబను నీవు నిన్ను విడిచిన నిలువలేక నీ యాగమంబు నిరీక్షింపుచుండు మాకై వెడలునెడ నీబిడ రానీనిచో నున్నచోనె యుండి 'మా శుచః' (భ-గీ) అని శోకింపవలదని యొక్క పలుకు పలుకుటయు నరుదయ్యెనే.

ఇట్లు శ్రీకృష్ణుని లేపుచుండ, నన్ను విడిచి యితనిని లేపుచున్నారు కానిమ్మని కనుసైగను పలికెదవు సుమ్మీ యని బెదరింప నది యూహించి, సౌందర్యవిశాలత్వంబుల నాబిడ కన్నుల కోడి 'న జీవేయం క్షణమపి' అని యిది విడిచినచో నొక్కక్షణంబైన బ్రతుకంజాలనన్నట్లుండు నీతండు మనకు మా టుమాట యొసంగునే యని తలంచి యీ బిడనే లేపుచున్నారు.

మైత్తడజ్జణ్ణినాయ్ — 'మైయిట్టెఝుదోమ్' అని కాటుక యుంచికొనమన్న మాకు వ్రతసమాప్తిచేసి కాటుక పెట్టించిన పైని గదా నీవు కాటుకయుంచుకొనుట న్యాయ్యము. నీకంటి సౌందర్యవిశాలతలు మాకు లాభకరంబులని యుంటిమి. హానికరంబులే యగునే యనుట.

నీ ఉన్మణాళన్నై ఎత్తనై పోదుమ్ తుయిలెళ్లవొట్టాయ్‌కాణ్ — సంశ్లేషంబునకై విశ్లేషించుటకును భయపడెదవో. గోపీజనవల్లభుండని సమష్టిగాఁ జెప్పుటయే కాక యితండు నీకే సొమ్మయి నీ కనుబొమ సన్నను మెలగుచుండ నింక నిన్నే ప్రార్థించెదము.

ఎత్తనై యేలుమ్ పిరివాఱ్ఱగిల్లాయాల్ — అది నీదోషంబు గాదు. 'అగలగిల్లేనిఱై యుమ్' అని సైరింపలేనొక్క నిమిషంబు నను శ్రీదేవి చందంబున నిమిషమయిన నెడబాయంజాలని నీ బలహాని యిట్టిది. నీ యెడబాయమి మాకు సాధకంబగుటకు బదులుగా బాధకంబయ్యెనే.

తత్త్వమ్ అన్రు తగవు—'పాపానాం వా శుభానాం వా'(రా. యు) యని పాపశుభవిభాగంబు సేయని యీామె తెగంబట్టిన నీకును 'నిహత్య రావణం సఙ్ఖ్యే' (రా. సు) యని రావణుని యుద్ధంబునఁ జంపవలెనను నాతనికిని వాసియేమి. స్వరూపంబుం గాదు పురుషకారస్వభావంబునకుం దగినది గాదనియుం జెప్పవచ్చును.



## ఇరువదియవ పాశురము

అతనికిని మాకు నాశ్రయంబైన నీవు మమ్ము నీరాడింపుమని నీళాదేవిని కృష్ణునింగూడ లేపుచున్నారు.



## 20

ముప్పత్తుమూవరమరర్కు్క మున్ శెన్రు
కప్పమ్తవిర్కు్కమ్ కలియే తుయిలెఴాయ్

శెప్పముడైయాయ్ తిఱలుడైయాయ్ శెత్ఱార్కు్క
వెప్పమ్కొడుక్కుమ్ విమలా తుయిలెఴాయ్

శెప్పన్నమెన్ ములై చ్చెవ్వాయ్చ్చిఱుమరుఙ్గుల్
నప్పిన్నై నఙ్గాయ్ తిరువే తుయిలెఴాయ్

ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దున్ మణాళనై
ఇప్పోదేయెమ్మైనీరాట్టేలో రెమ్బావాయ్.

| | | |
|---|---|---|
| ముప్పత్తుమూవర్ అమరర్క్కు<br>మున్ శెన్రు | : | ముప్పదిమూడుకోటులు దేవతలకును<br>మున్నుగా నేగి |
| కప్పమ్ తవిర్కుమ్ కలియే | : | కంపముం దీర్చు బలశాలీ |
| తుయిల్ ఎఴాయ్ | : | నిదుర మేల్కొనుము |
| శెప్పముడై యాయ్ | : | మేలుగలవాడా |
| తిఱలుడై యాయ్ | : | సామర్థ్యము గలవాడా |
| శెఱ్ఱార్క్కు వెప్పమ్ కొడు<br>క్కుమ్ విమలా | : | శత్రువులకు దుఃఖమునిచ్చు నిర్మలుడా |
| తుయిల్ ఎఴాయ్ | : | నిదుర మేల్కొనుము. |
| శెప్పన్న మెన్ములై | : | కలశములవంటి మృదు స్తనంబులును |
| శెమ్వాయ్ | : | ఎఱ్ఱని యధరంబును |
| శిఱుమరుంగుల్ | : | సూక్ష్మమయిన నడుమునుగల |
| నప్పిన్నై నఙ్గాయ్ తిరువే | : | నీళాదేవీ పూర్ణురాలా సిరీ |
| తుయిలెఴాయ్ | : | మేల్కనవే |
| ఉక్కముమ్ తట్టొళియుమ్<br>తన్దు | : | ఆలవట్టంబును కంచుటద్దంబును<br>ఇచ్చి |
| ఉన్ మణాళనై | : | నీ నాయకునిని |
| ఇప్పోదే ఎమ్మై నీరాట్టు | : | ఇప్పుడే మమ్మును నీరాడింపుమీ |

ముప్పత్తుమూవర్ అమరర్క్కు మున్శెన్రు కప్పమ్ తివిర్క్కుమ్ కలియే తుయిలెழாయ్ — రక్షించుటకు ముప్పదిమూడు కోటులని సంఖ్యానియతి గలదో. ఎందఱేనియు నార్తులయినచో రక్షించుటయే కదా నీ కుద్దేశ్యము. మరణము లేనివారికే కాని నీ కటాక్షంబు నందనిచో మరణముంజెందు మాకు నుపకరించుట కూడదో. ముఖాంతరంబున జీవించువారలకే కాని నీ ముఖంబున జీవించువారలకుఁ గూడదో. ప్రయోజనాంతరపరులగు బలవంతులకే కాని యనన్య ప్రయోజనలగు నబలలకుం గూడదో. నొప్పి కలుగకమున్నె రక్షించు నీవు నొప్పివడి వచ్చిన మమ్ము రక్షింపఁ గూడదో. మున్నుగా నేగి రక్షించు నీవు నీ వాకిటం బడియున్న మమ్ము రక్షింపవో. 'ఎழுందు మెన్తుమిదుమిగ్గై' (తి - య్ - ழி) అన్నచొప్పున నీయెడకు వచ్చుటయే యెక్కుడుగా నెంచువాఁడవటే. 'దేవాః స్వర్గం పరిత్యజ్య' అని యసురరాక్షసాదులచే స్వర్గనివాసంబు సైతము గోల్పోయి క్లేశించుచో నా క్లేశంబు దీర్చితివట. లోకుల కంపంబు దీర్చిన నీవు మాకు కంపంబు గలిగింపకుమీ. దుఃఖనివృత్తిం గోరువారలకేయో యుపకరించుట. నీ సుఖప్రబోధంబు చూడ నాసపడినవారలకుం గూడదో. అబలలమగు మాకు నీ బలంబు దక్క వేఱు ప్రాపుగలదే. దేవతలకు కాపురముజెంది బ్రతుకుటవంటిది మాకు నీ మేల్కనుటం గనుగొంట యనుట.

శెప్పముడై యాయ్ తిఱలుడై యాయ్ శెత్తార్క్కు వెప్పజ్గొడుక్కుమ్ విమలా తుయిలెழாయ్-ఆశ్రితులమేలు చెడకుండ నుండువాఁడవు. మా మేలు చెడకుండ నుండవలదే. నీ సామర్థ్యం బనాశ్రితుల నభిభవించునది గాదే. పాండవులకు మేలువాఁడవై దుర్యోధనాదులకు ననభిభవనీయుండవయితివి గాదే. ఆశ్రితశత్రువులం దక్క వేఱు శత్రువులు గలరే. అట్టివారిని చయ్యన సంహారించు నీశక్తి యిప్పుడనుకూలులపై కమ్మెనో. మాకై యమ్ము వేయవలెనో. మేల్కనం జూడం జాలదో యనుట.

అతండు మాఱుమాట వలుకమి వెండీయు నీళాదేవిని లేపుచున్నారు.

శెప్పన్న మెన్ములై శెవ్వాయ్ శిఱుమరుజ్గుల్ నప్పినై నజ్గాయ్ తిరువే తుయిలెళ్లాయ్ — అతండు దగులుకొనిన చోటులుగాన నవయవంబుల వర్ణించుట. 'మలరాళ్ తనత్తుళ్ళాన్' అని శ్రీస్తనమున నుండువాఁడని చెప్పిన చొప్పన నతని నిక్షేపకలశంబులట స్తనములు. విరహాసహత్వ మిందు మృదుత్వము. అవి యండగొని యనుభవించు జీవనఫలం బధరము. అట్లనుభవించునప్పుడును భయంబుతో నుండవలయునట్లు క్రిందును మీఁదును గాంచి నడుమున్నదని యూహించునది నడుము. పూర్ణత్వము సౌందర్యపూర్తి. 'ఒశిన్దవొణ్ మలరాళ్' అని అలసిన సుందరపుష్పవాసిని యనినట్లు సంశ్లేషగ్లానింబట్టి సిరి యనుట. నీవు లేచి మా జీవనము గావుమీ. ఆశ్రితులకై పది మాసంబులు నిద్రింపకయున్న సీతాదేవివలె నాశ్రితలమైన మాకై లేవవలదే.

లేచి చేయవలయునది యేమన్నం జెప్పుచున్నారు.

ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దు ఉన్ మణాళనై ఇప్పోదే ఎమ్మై నీరాట్టు — నీ కనుబొమ సన్నసన్న పనిసేయునట్లు భవ్యుండుగాన నీ నాయకుండనుట. ఆలవట్టమువలె నతనిని నిచ్చియనిగాని నతనిని మమ్మును నీరాడించుమనిగాని యన్వయము. విలమ్బమయినచో మేము లేముగాన నిప్పుడే యనుట. 'ఏహి పశ్య శరీరాణి' (రా. అ) అని రాక్షసులు దిన్న శరీరంబులు ఋషులు సూపినట్లు మమ్ము నని విరహము దినుచున్న మేనులం జూపుచున్నారు. వెఱ్ఱిపడుచా నాయకపుత్రీ యని యిట్లు మాలో మేము పరిహాసోక్తు లాడికొంటిమి గాని సంశ్లేషంబునకు మే మందఱమును సరిగానే యున్నామనియుం జెప్పుదురు.

'దారాః పితృకృతా ఇతి' (రా. బా) అని శ్రీరామదేవుండు సీతాదేవి సౌందర్యాదిగుణంబులుండ మాయయ్య చేయించిన పెండిలి యని కొనియాడునట్లు కృష్ణుని ప్రాప్యతాభోగ్యతలుండ మానీళాదేవి యిచ్చిన కృష్ణుండని కొనియాడవలయునఁట.



## ఇరువదియొక్కటియవ పాశురము

నీళాదేవి భోగదశయందు నేనును మీలో నొక్కతెం గానో. మనమందఱముం గూడి కృష్ణునిం బ్రార్థింతము రండన నతనిగుణంబుల క్కోడినవారోడినవిధంబు సెప్పి లేపుచున్నారు.



ఏఱ్ఱ కలఙ్గళ్ ఎదిర్ పొఙ్గి మీదళిప్ప
మాఱ్ఱాదే పాల్ శొరియుమ్ వళ్ళల్పెరుమ్బసుక్కళ్
ఆఱ్ఱప్పడైత్తాన్ మగనే యఱివుఱాయ్ !



# 21

ఏఱ్ఱ కలఙ్గళెదిర్ పొఙ్గి మీదళిప్ప

    మాఱ్ఱాదే పాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుమ్బశుక్కళ్

ఆఱ్ఱప్పడైత్తాన్ మగనే యఱివుఱాయ్

    ఊఱ్ఱముడైయాయ్ పెరియాయ్ ఉలగినిల్

తోఱ్ఱమాయ్నిన్ఱశుడరే తుయిలెఴాయ్

    మాఱ్ఱారునక్కు వలితొలైన్దున్ వాశఱ్కణ్

ఆఱ్ఱాదు వన్దున్నడిపణియుమాపోలే

    పోఱ్ఱియామ్ వన్దోమ్ పుగఴ్న్దేలోరెమ్బావాయ్.

ఉలగినిల్ తోన్ఱిక్కూయ్ నిన్ఱశుడరే — వేదంబుల విన్నంబడి యుండుట యేకాక యందఱుం గనుఁగొనునట్లవతరించి సకలమనుజనయన గోచరుండై పుట్టఁబుట్ట మాలిన్యంబెక్కు సంసారుల వలెంగాక 'స ఉ శ్రేయాన్ భవతి జాయమానః' (తైత్తి 3_౬_౧) అనుచొప్పున 'నిల్లెమ్బిల పలపిఱప్పా యొళివరు మ్మున్నలమ్' అనియుం జెప్పిన చొప్పున నియతిలేని బహుజన్మంబులెత్తియు దీప్యమానుండై పూర్ణానందుండై సానంబట్టిన రత్నంబువలె వెలుంగు ననుట. శిశుపాల దుర్యోధనాదులకు సైతము పాండవపక్షపాతంబు దెల్లంబయినట్లాశ్రిత పక్షపాతంబు లోకప్రసిద్ధముగా నున్న వాఁడనుట యనియుం జెప్పుదురు.

తుయిలెళ్ళాయ్ — మేల్కనిచోఁ జెప్పిన గుణంబులెల్ల నప్రకాశంబు లగుంజుమీ యనుట.

మాన్ఱోర్ ఉనక్కువలి తొలైన్దు ఉన్వాశల్కణ్ ఆన్ఱాదు వన్దు ఉన్నడి పణియుమాపోలే పోన్ఱియామ్ వన్దోమ్ పుగళ్న్దు — ఆశ్రితవిరోధులు శత్రువులు. వారలు బాణంబులకోడి వచ్చునట్లు మేము గుణంబులకోడి వచ్చితిమి. బాణజితులు మడిసియైనం గడతేరవచ్చును. గుణజితులకదియుం గలుగదట. బ్రహ్మాస్త్రం బేయుటకు నర్హంబగునట్లు శ్రీ సీతాదేవియెడ నపరాధముంజేసి 'త్రీన్ లోకాన్ సమ్పరిక్రమ్య - స పిత్రా చ పరిత్యక్తః' (రా - సు) అన్న చొప్పున మూఁడు లోకంబులుం దిరిగి తండ్రియగు నింద్రునిచేత సైతము విడువంబడి యెందును శరణంబు గానక 'తమేవ శరణం గతః' అని శ్రీరామదేవునే శరణము సెందిన కాకమువలె నుంటిమనుట. 'సత్యేన లోకాన్ జయతి' (రా. అ) అని సత్యమున లోకములం గెలుచు ననుచొప్పున బాణజితుల వంటివారే గుణజితులు. శత్రువులు తమ్ము గణింపక నిన్నే గణించి వచ్చినట్లు మేమును మా స్వరూపంబుం జూడక తాళలేమి యున్నచోనుండనీమిచే

వచ్చితిమి. ఆశ మడియనీదు, తాళలేమి యున్నచో నుండనీదు. శత్రువులు దురభిమానమున 'న నమేయమ్' (రా. య) అని వినతికయ్యకొననియట్లు పారతన్త్ర్యజ్ఞానంబున 'తత్తస్య సదృశం భవేత్' (రా. సు) అని మనలం గైకొనుట యతనికే తగునని యున్న! మనము తాళలేమి యున్నచో నుండనీక వచ్చితిమి. మమ్ము నోడించిన గుణంబులం బొగడుచు ననుట.



# ఇరువదిరెండవ పాశురము

ఇట్లు తమ దురభిమానశూన్యత్వంబు సెప్పి యిందనన్యార్హశేషత్వంబు సెప్పుచున్నారు.



అకశక్... సిన్ వల్లికట్టిక్కేట్రే
కజ్జిమ్ కదప్పార్ పోల్ వన్ను తరై ప్పియ్‌దోమ్...
కెజ్జిన్ కేటుప్పిత్తదే యమ్మెల్ విత్తియూవో ?



# 22

అఙ్గణ్ మాఞాలత్తరశర్ అబిమాన-

బఙ్గమాయ్ వన్దు నిన్ పళ్ళిక్కట్టిల్ కీఴే

శఙ్గమిరుప్పార్ పోల్ వన్దు తలైప్పెయ్దోమ్

కిఙ్గిణివాయ్చ్చెయ్ద తామరైప్పూప్పోలే

శెఙ్గణ్ శిఱుచ్చిఱిదే యెమ్మేల్ విఴియావో

తిఙ్గళుమాదిత్తియను మెఴున్దాఱ్పోల్

అఙ్గణిరణ్డుఙ్గొణ్డెఙ్గళ్ మేల్ నోక్కుడియేల్

ఎఙ్గళ్ మేల్ శాబమిఴిన్దేలో రెమ్బావాయ్.

అజ్గణ్ మాఞాలత్తు అరశర్ : అందమయిన మహాపృథివియందలి
రాజులు

అబిమాన బజ్గమాయ్ వన్దు : అభిమానభజ్గంబై వచ్చి

నిన్ పళ్ళిక్కట్టిల్ కీఴే : నీ పవ్వళించు మంచముక్రింద

శజ్గమ్ ఇరుప్పార్ పోల్ : సంఘముగా నుండు వారల పోల్కి

వన్దు తలై ప్పెయ్దోమ్ : వచ్చి చేరితిమి.

కిజ్గిణి వాయ్చ్చెయ్ద : కింకిణులవలె వికసితంబయిన

తామరై ప్పూప్పోలే : తామరపూవు వలె

శెజ్గణ్ శిఱుచ్చిఱిదే : ఎఱ్ఱని కన్నులు గొంచెము కొంచెము

ఎమ్మేల్ విఴియావో : మాపైఁ గటాక్షింపవలదే !

తిజ్గళుమ్ ఆదిత్తియనుమ్ : చంద్రుండును సూర్యుండును

ఎఴున్దాఱ్పోల్ : ఉదయించినట్లు

అజ్గణ్ ఇరణ్డుమ్ కొణ్డు : అందమైన కన్నులు రెండును గొని

ఎజ్గళ్ మేల్ నోక్కుదియేల్ : మాపైఁ గటాక్షించితివేని

ఎజ్గళ్ మేల్ శాపమ్ ఇఴ్ఴను : మాపైనున్న పాపములు పోవును.

అఙ్గణ్ మాఞాలత్తు అరశర్ అభిమానబఙ్గమాయ్ వన్దు నిన పళ్ళిక్కట్టిల్ కీఴే శఙ్గ మిరుప్పార్ పోల్ వన్దు తలై ప్పెయ్దోమ్ — ద్వీప సప్తకాదులచే నందమయిన మహాపృథివియందలి రాజులు బ్రహ్మాది పిపీలికాన్తభోగ్యభోగోపకరణాదిసమృద్ధంబయినలోకవిస్తారంబెల్ల ‘యావై యుమ్ యావరుమ్ తానాయమైవుడై నారణన్’ అని అన్నియు నందఱుం దానయ్యెయుండు నారాయణుని ననుకరించు పౌండ్రకవాసుదేవునిపోల్కిం దమదనుకొను రాజులు రాజ్యములు సెడి దైన్యంబుం జెంది వెండియు రాజ్యంబుగొనుమన్నను నడచిన దైన్యముందలంచి యొల్లక నీసింహాసము క్రింద సంక్షుభవించి యాప్తవర్గంబై యుండునట్ల ‘గుణైర్దాస్యముపాగతః’ అనినచొప్పున కృష్ణగుణములకోడి దాస్యరసంబునం జూచివచ్చియున్నంద అను లేపిన ప్రయాసంబెల్ల సఫలంబగునట్లుచేరితిమి. అనాదికాలము దేహాత్మాభిమానముననీసంబంధంబు మఱచియున్న మేమిప్పుడవితర్కితంబుగా జేరితిమనియు, ‘మన్యే ప్రాప్తాఃస్మ తం దేశం భరద్వాజో యమబ్రవీత్’ అని భరద్వాజుండు సెప్పిన యాప్రదేశంబుఁ జేరితిమనిన శ్రీభరతుని విధంబున నిట్లు చేరితిమనియు ‘వానరాణాం నరాణాం చ కథమాసీత్సమాగమః’ (రా-సు) అని విసదృశంబయిన వానర నర సమాగమం బెట్లయ్యె ననినట్లు విసదృశంబయిన యిది — ‘రామసుగ్రీవయోరైక్యం దేవ్యేవం సమజాయత’ అని యిట్టి యంతరంగ కార్యంబున నన్నుం బంచునట్లు రామ సుగ్రీవుల కైక్యంబు గలిగె ననినట్లు సంగతంబయ్యనే యనియు సంతోషింపుచున్నారఁట. రాజులు దమ యభిమానంబుల విడిచియుం గ్రమప్రాప్తంబైన రాజ్యాదుల విడిచియు బాణంబులకోడి సింహాసనంబు క్రిందం బడియుండునట్లు మేమును స్త్రీత్వాభిమానంబొండె దేహాత్మాభిమాన స్వాతంత్ర్యాభిమానంబుల నొండె విడిచి భోగాంతరంబుల నొండెం బ్రయోజనాంతరంబులనొండె విడిచి గుణజితులమై వచ్చితి మనుచున్నారనియుం జెప్పుదురు.

కిఙ్గిణి వాయ్చ్చెయ్ద తామరై ప్పూప్పోలే శెఙ్గణ్ చిఱుచ్చిఱిదే యెమ్మేల్ విఴియావో — ఆదిత్యకిరణంబుల వికసించు తామరలవలె

నర్థులంజూచిన వికసితంబై వాత్సల్యంబున నెఱ్ఱవడుచు నిరుపమానంబై యున్న కన్నులును ఒక్కతడి గావలయు చేనునకు వెల్లి గొలుపరాని చందంబున నొక్కమాఱుగాక సాత్మ్యంప సాత్మ్యంపం బ్రథమపరిస్పందంబు మొదలుగం గటాక్షింపవే యని యెండఁబారు పయిరొక్క వర్షము గోరి నట్లును చాతకము వర్షధారం గోరినట్లును మనోరథము చేయుచున్నారు.

తిజ్గళుమ్ ఆదిత్తియనుమ్ ఎళ్లున్దాఱ్పోల్ అజ్గణ్ ఇరణ్డుమ్కొణ్డు ఎజ్గళ్ మేల్ నోక్కుదియేల్ ఎజ్గళ్ మేల్ శాపమ్ ఇళిన్దు — చంద్రుండును సూర్యుండును ఉదయించినట్లు అందమయిన కన్నులు రెండును గొని మాపైఁ గటాక్షించితివేని మాపై నున్న పాపములు పోవును. ప్రతికూలులకుగ్రత్వంబును ననుకూలులకుం జల్లదనంబును అజ్ఞానాంధకార హారత్వంబును తృష్ణాశాంతికరత్వముం బట్టి 'ప్రసన్నాదిత్యవర్చసమ్' అనుచొప్పునం బ్రసన్నంబైన సూర్యుని తేజంబుగలిగి 'చన్ద్రకాన్తాననం రామమతీవ ప్రియదర్శనమ్' ఆపాతప్రతీతిని చంద్రుని వలె మోము దోచిన నంతకంటెను ప్రి[illegible]దర్శనంబై యుండునని చెప్పినట్లు కోపప్రసాదంబులకుం జంద్రసూర్యులు సరిగా రనంజా[illegible] నీ కన్నుల రెండుం గొని నీ దర్శనంబు లేక తపించియున్న మాపై ని ప్రసరింపించితివేని యాతనా శరీరంబుమాడ్కిని శాపోపహతులచందంబునను విశ్లేషవ్యసనమే పడుచున్న మా దుఃఖమనుభవింపక తీరనిది గాన శాపం బనంబడిన మా పాపము విషవైద్యుండు చూడంజూడ విషముదీరునట్లు దీరుననుట.





శిక్షణే...  నిమిషాన్ను ముక్షిప్పుబిప్పట్టు
పోషరుమూ పోలేసి...  శీరియ శిక్షా శన త్తిరుద్ను



# 23

‘వచసా సాన్త్వయిత్వైనమ్’ అన్న చొప్పున వీరల నతండు సాంత్వనంబుసేయ నూరడిలి మేము వచ్చిన పని విని కనికరంబు సేయు మనుచున్నారు.

మారిమలై ముఴఞ్జిల్ మన్నిక్కిడన్దుఱఙ్గుమ్
　　శీరియశిఙ్గమఱివుఱ్ఱు త్తీ విఴిత్తు
వేరిమయిర్ పొఙ్గవెప్పాడుమ్పేర్న్దుదఱి
　　మూరినిమిర్న్దు ముఴఙ్గి ప్పుఱప్పట్టు
పోదరుమాపోలే నీపూవైప్పూవణ్ణా ఉన్
　　కోయిల్ నిన్ఱిఙ్గనే పోన్దరుళి క్కోప్పుడైయ
శీరియశిఙ్గాశనత్తిరున్దు యామ్ వన్ద
　　కారియమారాయ్న్దరుళేలోరెమ్బావాయ్.

| | |
|---|---|
| మారి మలై ముళైఞ్జిల్ | : వర్షాకాలంబునం గొండగుహాయందు |
| మన్ని కిడన్దు ఉఱఙ్గుమ్ | : స్థిరముగ పవ్వళించి నిద్రించు |
| శీరియ శిఙ్గమ్ | : శ్రేష్ఠ సింహము |
| అఱివుఱ్ఱు | : మేలుకని |
| తీ విళిత్తు | : ఉగ్రముగా జూచి |
| వేరి మయిర్ పొఙ్గ | : పరిమళముగల రోమంబులు నిగుడ |
| ఎప్పాడుమ్ పేర్న్దు ఉదఱి | : నాల్గువైపులను కదలి దులుపుకొని |
| మూరి నిమిర్న్దు | : పొడవుగా విఱ్ఱవీగి |
| ముళఙ్గిప్పుఱప్పట్టు పోదరుమా పోలె | : ఘోషించి వెడలి వచ్చునట్లు |
| పూవై ప్పూ వణ్ణా | : అతసీపుష్పవర్ణా |
| నీ ఉన్ కోయిల్ నిన్ఱు ఇఙ్గనే పోన్దరుళి | : నీవు నీ గృహంబునుండి యిట్లు వచ్చి |
| కోప్పుడైయ శీరియశిఙ్గాశన త్తిరున్దు | : జయముగల శ్రేష్ఠ సింహాసనంబునం గూర్చుండి |
| యామ్ వన్ద కారియమ్ | : నేము వచ్చిన కార్యంబు |
| ఆరాయ్న్దు అరుళ్ | : విచారించి కృపసేయువే. |

మారిమలై ముళ్ఞ్జిల్ మన్నిక్కిడన్దు ఉఱజ్గుమ్ శీరియశిజ్గమ్ — వర్షాకాలంబున రాజులు దండయాత్ర వెడలనియట్లు శ్రీరామదేవుండు మాల్యవంతంబున నున్నట్లును, గుహ వెడలక బలంబున భయంబేమియు లేక పర్వతశృంగమువలెం దిరంబై గద్దించి లేపినను లేవకుండునట్లు తన స్త్రీతో నైక్యంబుసెంది నిద్రింపుచు, నవ్విధంబు గాంచినను క్షుద్ర మృగంబులెల్ల మన్నుగఱచునట్లు వీరశ్రీగలదై 'స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః' అని శ్రీమంతుండగు శ్రీరామదేవుని చందంబునకు స్మారకంబగు సింహంబు.

అఱివుత్తు — పూవు వికసించినట్లు జాగరకాలంబున లేచి.

తీవిళిత్తు — ప్రథమకటాక్ష సంనిపాతంబునం దన యింతికిసైతము చెంతనుండ నలవిగాక యనుట.

వేరిముయిర్ పొజ్గ — 'సర్వగన్ధః' అను వానిరీతికి స్మారకంబైన జాత్యుచిత గంధంబు పరిమళము.

ఎప్పాడుమ్ పేర్న్దు ఉదఱి — ఒక్క కార్యోద్యోగంబు లేదుగాన నొక్కవైపు నను నిర్బంధంబు లేక కదలి వేఱువేఱుగ నవయవంబుల విదల్చి.

ముళ్ఞ్జిప్పుఱప్పట్టు — మృగములన్నియుం బ్రోవయి గుండెల విసిపడునట్లు ఘోషించి వెడలి.

పూవై ప్పూవణ్ణా—గాంభీర్యంబునకు సింహము దృష్టాంతమను టింతియ. విగ్రహసౌందర్యంబునకును వర్ణంబునకు నది (సింహము) సాటి యగునే యనుట. వాస్తవంబోయన్న నా యా గుణంబులకు లోకంబునం బ్రసిద్ధంబులని వీని దృష్టాంతంబులుగాఁ జెప్పుటయేకాక, యివి సంపూర్ణ ముగా దృష్టాంతంబులు గావఁట.

ఉక్కోయిల్ని న్రిజ్ఞనే పోన్దరుళి—'పర్వతాదివ నిష్క్రమ్యసింహో గిరిగుహాశయః' అని పర్వతగుహానుండి సింహాము వెడలినట్లు వెడలి యని శ్రీ సీతాదేవి మంగళాశాసనంబుంజేయ శ్రీ సుమంత్రునితో వెలువడి నట్లు గర్వ మదగర్జిత పరాభి భవన సామర్థ్యంబులు దోప ఋషభగజ శార్దూల సింహాగతులను జతుర్గతియగుచు వచ్చినట్లు వచ్చి; యేకాంత వృత్తాంతంబు గాకుండ సభావృత్తాంతంబు గావలయుననుట.

కోప్పుడై య శీరియ శిజ్ఞాశనత్తిరున్దు — చరాచర విచిత్రితంబని కాని ధర్మ జ్ఞానాదులు నధర్మ జ్ఞానాదులును కావలి గలదని కాని జెప్పవచ్చును. స్త్రీలు గృష్ణుండను మాత్రమే యున్న సింహాసనంబునిూద నుండి చెప్పినమాట యన్నచో సముద్రతీరవార్తయు రథోపస్థవార్తయు నట్లమోఘంబై యుండుననుట. నడయందంబు వలెనే కూర్చుండుచో నుత్కర్షంబు జూడనింపై యుండుననుట. 'కణ్ణిణై కుళిరప్పూదుమలరాగత్తె ప్పరుక విరున్దిడాయ్' అని కన్నులు చల్లనగునట్లు క్రొత్తపుష్పమువంటి మేను ననుభవించునట్లు కూర్చుండుమిూ యనంబశియె గదా.

ఇట్లు విన్నవింప నాలకించి 'ఉపస్థేయైరుపస్థితః' అని శ్రీ దణ్డకారణ్య ఋషులు దుఃఖనివృత్తికి వారున్నచోటికి మనము మున్నుగా నేగవలసియుండ వారలు వచ్చునందాక నిరీక్షించియుంటిమని వగచిన విధంబున, నయోధ్యా పిన్న పడుచులకు మున్నుగా నొదవమయితిమి, వెతపడం జూచితిమని చింతిలి, కిడాంబియాచ్చాను 'అగతిం' అని చెప్పిన విని 'మన రామానుజునిడి కాపాడుచుండ నగతి యనవల' దని శ్రీ రంగనాథుండానతిచ్చినట్లు, శ్రీ నీళాదేవి యుండ శత్రురాజులు సంఘంబులై పడియున్నట్లు దైన్యంబుజెంది వచ్చితిమని పలుకుదురే యని వగచి మిూ యపేక్షితంబేమన్నను, మున్ను శ్రీ భరతుండు

‘ ప్రభిశ్చ సచివైః సార్థం శిరసా యాచితో మయా ’ ( రా - అ ) అని నే నిందఱితో వచ్చి శిరఃప్రణామంబున యాచించినఁ గృపసేయఁడే యని తలంచియు ‘ అభితః పావకోపమమ్ ’ అని ప్రతిజ్ఞ మరలించుటకు శక్యంబుగాక యనభిభవనీయుండయ్యెంగాదే శ్రీ రామదేవుండు. అట్లుగాన మన మవసరమునం జెప్పొదము అని తలంచి యిట్లుగాదు, పేరోలగంబై యుండి యాలకింపవలయు ననుచున్నారు.

యామ్ వన్దకారియమ్ ఆరాయ్న్దరుళ్ — **మీరేమి పాటులు** పడితిరి. ద్వారపాలుని శ్రీ నందగోపాదులను మమ్ము నిట్లు లేపి **యా**యాసంబుం జెందితిరే, యిదియెల్ల మీకుగాదు నాదియని యీ చొప్పున విచారింపవలదే యనుట.



## ఇరువదినాల్గవ పాశురము

తాము ప్రార్థించినచొప్పునం గృపసేయం జూచి శయనగృహంబు నుండి వెడలి దివ్యసింహాసనంబుఁ జేర నడతేఱి నా యందము గన్నుల విందగుటయు నానందపారవశ్యంబున ముందటికార్యంబు మఱచి యా సౌందర్యంబునకు మంగళాశాసనంబు సేయుచున్నారు.



కన్టు కుడె యా ఎదుత్తాయ్! కుణమొ్యాక్ ధి
వెన్టు పగ్గె కెమస్యామ్ నిఖ కై యిబ్ వేక్ పొక్ ధి



## 24

అన్ఱివ్వులగమళన్దాయడిపోఱ్ఱి
　　శెన్ఱఙ్గుత్తెన్నిలఙ్గై శెఱ్ఱాయ్ తిఱల్పోఱ్ఱి

పొన్ఱచ్చగడముడైత్తాయ్ పుగఴ్పోఱ్ఱి
　　కన్ఱు కుణిలావెఱిన్దాయ్ కఴల్పోఱ్ఱి

కున్ఱు కుడైయావెడుత్తాయ్ కుణమ్పోఱ్ఱి
　　వెన్ఱు పగై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్పోఱ్ఱి

ఎన్ఱెన్ఱున్ శేవగమే యేత్తిప్పఱై కొళ్వాన్
　　ఇన్ఱుయామ్ వన్దోమిరఙ్గేలోరెమ్బావాయ్.

అన్ఱు ఇవ్వులగమ్ అళన్దాయ్ : నాడు యీ లోకమును గొలిచిన

అడిపోఱ్ఱి : నీ శ్రీపాదమునకు మంగళమగుగాక

శెన్ఱు అఙ్గు తెన్నిలఙ్గై : ఎత్తి వెడలి అచ్చట దర్శనీయంబగులంకను

శెఱ్ఱాయ్ : మాపిన

తిఱల్ పోఱ్ఱి : నీ బలమునకు మంగళము -

పొన్ఱ శగడమ్ ఉడైత్తాయ్ : నశించునట్లు శకటాసురునిం దన్నిన

పుగఴ్ పోఱ్ఱి : నీ పొగడ్తకు మంగళము

కన్ఱు కుణిలా ఎఱిన్దాయ్ : వత్సమును కందుక దండముగా విసిరిన

కఴల్ పోఱ్ఱి : నీ శ్రీపాదమునకు మంగళము

కున్ఱు కుడైయా ఎడుత్తాయ్ : కొండను గొడుగుగా నెత్తిన

కుణమ్ పోఱ్ఱి : నీ గుణమునకు మంగళము

వెన్ఱు పగై కెడుక్కుమ్ : గెలిచి శత్రువుల సంహరించు

నిన్ కైయిల్ వేల్ పోఱ్ఱి : నీ చేతి బల్లెమునకు మంగళము

ఎన్ఱెన్ఱు ఉన్ శేవగమే ఏత్తి : అనియని దేవర పరాక్రమంబె పాడి

పఱై కొళ్వాన్ : ప్రాప్యంబు గొనుటకు

ఇన్ఱు యామ్ వన్దోమ్ : నేడు మేము వచ్చితిమి

ఇరఙ్గు : కృపసేయుమీ.

అన్ఱు ఇవ్వులగమ్ అళన్దాయ్ అడిపోర్ఱి—నాడు మహాబలి యపహరింపం గుందియున్న తనవిభూతి నతని యభిమానంబు నెడలించి త్రిప్పి తన శ్రీపాదంబు లోకమునకెల్ల ధూళిదానముచేసిన శ్రీవామనావతారము, నేడు తన విశ్లేషంబునం గుందిన మమ్ము స్త్రీత్వాభిమానంబు దొరగించి త్రిప్పి యందమును శీలంబును తమకు ధూళిదానముచేసిన కృష్ణావతార సామ్యమున మున్నుగాఁ దలంచుట, దేవిజనంబుగూడ పూవునుట్టునట్లు వెరచిపట్టు శ్రీపాదంబుగొని యడవియనక మెట్టయనక కొలిచెనే యని మంగళాశాసనము సేయుట. నాడు ఎల్లం ద్రొక్కి మహాబలినుండి తన భూమిం గైకొనినట్ల నడయందముం జూపి విశ్లేషమునుండి మమ్ము త్రిప్పి గైకొనెననుట. తాము విన్నవించిన వెంబడినే నెడలి సుకుమారంబులగు శ్రీపాదంబుల నడచినది నాడు లోకముగొలిచిన దానికంటెం బెద్దయని మంగళాశాసనము సేయుటయఁట. నాడు రెండడుగులే పెట్టెనట. నేడు పదిపంద్రెండడుగులు పెట్టెనఁట. నాడు ఇంద్రుండు తన ప్రయోజంబు గొనిపోయె. బలియౌదార్యంబు లభించిపోయె. మంగళాశాసనంబుసేయువారు లేరైరని యక్కొఱదువదీర నేము సేయుచున్నారఁట.

శెన్ఱు అఙ్గు త్తెన్నిలఙ్గై శెర్ఱాయ్ తిఱల్ పోర్ఱి — అందమున కోడనివారల నమ్మునకోడించితివి. పులియున్న పొదకేగినట్లు శ్రీ సీతాపహారియగు దుష్టుండున్న చోటికేగెదవే, ఉన్నచోనే యుండి పూవు విసిసించినట్లునాయాసంబునం గొలిచినట్లుగాక కఠినమైన కానలో నా యడుగులం గొని నడచెదవే. "ఎవ్వాఱు నడన్దనై" (పె-శ్రీ-తి) అని యెట్లు నడచితివో యనియు దృఢమైన కోటయుం బ్రాకారంబునుం గలిగి కందిరీగల పట్టుచందంబున హింసకసముదాయము చేరియున్న ప్రదేశంబున కేగితివనియు గుండెయదరి కోటకుం గోటపెట్టినట్లు బలంబునకు మంగళాశాసనము సేయుట.

పొన్ఱ శగడమ్ ఉదైత్తాయ్ పుగళ్ పోఱ్ఱి — రావణునివలె విరోధి యని యెఱుంగరానివాని, మారీచుని యట్ల కొఱప్రాణంబుతో నున్నక, సంహరించితివి. తల్లిసైత మొదవని యప్పుడిట్లు చేసెనేయని మంగళా శాసనము సేయుచున్నారు. రామావతారంబునం దండ్రి శంబరాంత కుండు, ఊరయోధ్య, పురోహితులు మంత్రవాదులగు శ్రీవసిష్ఠాదులు. కుమారులో యన్నను "ఆణ్ తిఱక్ మీళిమెయ్మ్మినరక్కర్ కులత్తై త్తడిన్దు" అన్నచొప్పునం బౌరుషబలంబులు గలిగి సాటిలేని రాక్షసుల కులంబు సంహరించినవారలు ; ఇంతియగాక "ఇచ్ఛామో హి మహా బాహుం రఘువీరం మహాబలమ్। గజేన మహతా యాన్తం రామం ఛత్రా వృతాననమ్॥" అని మహాభుజుండును మహాబలుండునగు శ్రీరామదేవుం డౌపవాహ్యగజంబుపై నెక్కి ఛత్రచ్ఛాయాపరివేష్టితముఖుండై యేగుచోం జూడఁ గోరెదమని జనులనునట్లు గుణవంతులు. ఇక్కడనో యన్నను, ఊరు గొల్లపల్లె, కంసాదులు శత్రువులు, శ్రీ బృందావనంబునం గలుగు మొలకలుసైతము రాక్షసులు ; అన్నగారొక్క నిమిషము చెంతలేనిచోఁ బామునోటంబడు దుడుకువాఁ డితండు ; పూతనా శకటాదులవలనం గలిగిన యపాయంబులకు లెక్కలేదు. ఇట్లుండ మంగళాశాసనంబు దక్కం గావలియేమున్నది.

కన్ఱు కుణిలా ఎఱిన్దాయ్ కళల్ పోఱ్ఱి — వత్సాసురునిం గపిత్థా సురునిమీద విసరుచో నిరువురుం గూడి పైబడిన నేమిసేయనగునని నేము వెఱచుచున్నారు.

కున్ఱు కుడైయా ఎడుత్తాయ్ కుణమ్ పోఱ్ఱి—ఇంతకుమున్నింద్రు నకై చేసిన పనులు. ఇప్పుడతండే విరోధిగానుండి యాకలికోపంబునం జెయ్యి సడలువరకు వర్షించుటం బశువులకును గొల్లలకును గలిగిన యాపద నానృశంస్యంబునం దీర్చితనుట. అనుకూలులే ప్రతికూలులయిన నేమి సేయవచ్చునని వెఱచుచున్నారు.

నెన్నుప్పగై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోఱ్ఱి — ఈతనిబలంబు గని దృష్టిదోషంబు దగులునను భయంబున నీవ్యాపారంబులెల్ల నీబల్లెంబు సేసెనని యందారోపించుట. ఇట్లకదా “మిడుక్కిలామైయాల్ నాన్ మెలిన్దేన్ నఙ్గాయ్” అని బలహానిచేత నేను బడలితినమ్మా యని బాలకృష్ణునిబలంబు సైరింపలేనైతి నన్నచో దృష్టిదోషంబు దగులునని తనబలహాని నభినయించుట. దశరథుండు ధనుర్ధరుండగుట శ్రీ రామదేవుండును విల్లువట్టినట్లు, శ్రీ నందగోపాలుఁడు బల్లెమువట్టినట్లు మున్నుమున్నుగం జెప్పంబడెం గాన నితండును బల్లెంబు వట్టెననుట. ఊరకయున్న నీరాజనంబు సేయవలసియుండ బల్లెంబుం బట్టెనేయని యందుకును మంగళాశాసనంబు సేయుట.

ఎన్ఱెన్ఱు ఉన్ శేవగమే ఏత్తిప్పఱై కొళ్వాన్ ఇన్ఱుయామ్ వన్దోమ్ — సంసారులు “దేహి మే దదామి తే” అనువారు గాన నితరులయెడం గొందురు, ఈశ్వరునియెడనుం గొందురు; వీరలితరులయెడనుం గొనం బోరు, ఈశ్వరునియెడనుం గొనంబోరు. “ఒన్ఱు నూఱాయిరమాగ క్కొడుత్తుప్పిన్నుమ్ ఆళుమ్ శెయ్వన్” అని ఒక్కటి నూరువేలుగా నొసంగి పిదపం గైంకర్యంబును జేయుదుమని ఈశ్వరునెడను, “ఆన్దనైయుమ్ కైకాట్టి” అని అయినవరకు దానంబు సేసి యని యోగులయెడను నుందు రింతియ. కాబట్టి “ఉన్నుడైయ విక్కిరమ మొన్ఱొళియామ లెల్లా మెన్నుడైయ నెఞ్జకమ్బాల్ శువర్ వఴియెఴుది” అని నీ వీర చరితంబునొక్కటియు విడువక నామనంబను భిత్తిప్రదేశంబున వ్రాసికొంటి ననునట్లు చెప్పుదురు. నీవు నిద్రింప మేము మేలుకనిననే డనియు, నూరెల్ల నియ్యకొనవచ్చిన నేడనియు. బంధువులచేత చిరకాలము వెతంబడిన మేము, వృద్ధలు నిద్రింప నీచేతనే మా యాపదలుం దీర్చికొను మేము, నేనేవచ్చి యొదవనైతినను నీ మనంబు నొచ్చునట్లు మా తాళలేమిని వచ్చితిమనియు విశేషవివక్ష.

ఇరజ్జు — ఎన్నిచేసియు నతండు కృపసేసినంగాని కార్యంబు గాదనియు, రక్షకత్వం బాతని స్వరూపంబనియు, మంగళాశాసనంబులు సేయుట తమస్వరూపంబే కాని యది సాధనంబు గాదనియు నెఱుంగుదు రంట. కడచిన యపదానంబులకు గుండెయదరి గతజలసేతుబంధంబట్ల నేడు మంగళాశాసనంబు సేయుటయుం దమ బెదరు దీర్పంజూపిన బలంబునకును సాధనసామగ్రికిని మంగళాశాసనంబుసేయుటయు, ఇట్టి పనులు పెరియాళ్వారివని పల్లాండను ప్రబంధంబునం బ్రసిద్ధంబుగావున నాయన కూతురగు నాండాళునకు నిది కులధర్మంబని యెఱుంగునది.





ఒరుత్తి మగనాయ్ పిఱన్దు ఒర్ యిరవిల్
ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర





## 25

మీకు స్త్రీ వలయునది యేమన్నను, మాకు నేదేనియుం బ్రతిబంధకములు గలిగిన నవి యెల్లం బాపు సాధనంబులు నీవే యొసంగి మాదుఃఖంబులెల్లం దీరం గటాక్షింపు మనుచున్నారు.

ఒరుత్తి మగనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్
 ఒరుత్తిమగనాయొళిత్తువళర
తరిక్కిలానాగి త్తాన్ తీజ్గునినైన్ద
 కరుత్తైప్పిళైప్పిత్తుక్కఞ్జన్ వయిత్తిల్
నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే ఉన్నై
 అరుత్తిత్తువన్దోమ్ పఱై తరుదియాగిల్
తిరుత్తక్క శెల్వముమ్ శేవగముమ్ యామ్పాడి
 వరుత్తముమ్ తీర్న్దు మగిழ్న్దేలోరెమ్బావాయ్.

ఒరుత్తి మగనాయ్ పిఱన్దు : ఒక్కతె కొడుకయి పుట్టి

ఓరిరవిల్ ఒరుత్తి మగనాయ్ : ఒక్కరాత్రిలోనే మఱియొక్కతెకుం బుత్రుండై

ఒళిత్తు వళర దాగియెదుగుచుండ

తరిక్కిలానాగి త్తాన్ తీఙ్గు : సహింపలేనివాడై తాను ద్రోహము

నినైన్ద కరుత్తై దలంచిన యభిప్రాయమును

పిౙైప్పిత్తు : నాశముజేసి

కఞ్జన్ వయిఱ్ఱిల్ : కంసుని గర్భంబున

నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే : నిప్పునట్లు నిలిచిన మహా వ్యాముగ్ధుడా

ఉన్నై అరుత్తిత్తు వన్దోమ్ : దేవరం బ్రార్థించి వచ్చితిమి

పఱై తరుదియాగిల్ : ఉద్దేశ్యంబు నిచ్చితివేని

తిరుత్తక్క శెల్వముమ్ : మీా శ్రీకిం దగిన సంపదను

శేవగముమ్ యామ్ పాడి : వీర్యమును మేము పాడి

వరుత్తముమ్ తీర్న్దు మగిౙ్న్దు : క్లేశము దీరి సంతోషింతుము.

ఒరుత్తిమగనాయ్ పిఱన్దు — "అన్తః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా" (తై - నా) అనినచొప్పున సర్వలోకంబులకును నియామకుండగు వానింగూడ నియమించుటచే నద్వితీయయగుట, దేవకినొక్కతె యనుట. "భూతానాం యోఽవ్యయః పితా" అని సకలప్రాణులకును దండ్రియగువాఁ డొక్కతెకుఁ గొడుకయ్యెనే. దశరథుండు తపం బొనరించి మాణిక్యంబులవలె నలుగురం గనెనఁట. ఇందు నలుగురు తపంబొనరించి యొక్క మాణిక్యంబువలె నొక్కనిం గనిరనుట. దశరథపుత్రుండు ప్రాయమువచ్చినపైఁ బితృవచనపరిపాలనంబు జేసెనఁట. ఇతండు పుట్టినప్పుడే "ఉపసంహార సర్వాత్మన్" అని చతుర్భుజరూపం బుపసంహరింపుమన్నతోడుతనె చేసెనఁట. కర్మవశ్యులు పడు పాటులెల్ల నితండు కృపావశ్యుండై పడునఁట. ఆవిర్భవించుట చాలదో. లోకులు పదినెలలు గర్భమందుండ నితండు "పన్నిరుతిఙ్గళ్ వయిఱ్ఱిల్ కొణ్డ" అని పండ్రెండునెలలు గర్భమందుండి పుట్టెనఁట. అఖిలహేయప్రత్యనీకునకుం బుట్టెననుట యవద్యంబగునని తలంచి "దేవకీపూర్వసంధ్యాయా మావిర్భూతం మహాత్మనా" అని యీ మహాత్ముండు సూర్యుండు పూర్వసంధ్యయందట్ల దేవకియందావిర్భవించెనని చెప్పెనఁట. అట్లనుటయే యవద్యమని తలంచి వీరలు పుట్టి యనుచున్నారఁట. మన కర్మంబు లతనిని మనతో సజాతీయునిం జేయునఁట. అతని కరుణ 'పరమం సామ్యముపైతి' (శ్రు) అన్నచొప్పున మనల నతనితో సజాతీయులం జేయునఁట. అతండు మనకై పుట్టదలంచినంతన మన పుట్టువులతని తల్లిదండ్రుల సంకెలలు పడినపాటులు పడునఁట. మన పుట్టువులు అతనిని మనలను వేఱుసేయుటకు సాధనంబగునఁట. అతని పుట్టువుభయులం జేర్చుటకు సాధనంబై యుండునఁట.

ఓరిరవిల్ ఒరుత్తిమగనాయ్—కుక్కకడుపు నెయ్యినిమడనీనియట్లు కంసాదుల హీనత యచ్చోట నితనినొక్క రేయియయిన నుండనీదయ్యె

నంట. ఆరాత్రివంటిరాత్రి మున్నును వెనుకను లేదుగాన నొక్కరాత్రి యనుట. కాలకృతపరిణామంబు లేనిచోటి వస్తువు కాలాధీనప్రదేశంబునం బుట్టి సంసారులపాటియుం గాకపోయెనే. కొడుకుకావలయునని కోరిన దేవకి కవతారరసంబొసంగి, యశోదకు లీలారసం బనుభవింపించెననుట. "అంశావతారో బ్రహ్మర్షే యోఽయం యదుకులోద్భవః" (వి-౫ అ) అని యదుకులంబునం బుట్టిన యంశావతారంబని చెప్పిన ఋషియే, "గోపాలో యాదవం వంశం మగ్నమభ్యుద్ధరిష్యతి" అని గోపాలుండై యాదవవంశమును నుద్ధరింపఁగలఁడని చెప్పినట్లొక్క యవతారంబుననే యాదవసజాతీయుండును గోపాలసజాతీయుండు నగుట. పుట్టువునం బోరలేనిచొప్పునం బుత్రత్వంబునం బోరలేకుండుట.

ఒళిత్తు వళర — కంసుని విషదృష్టి వారకుండ డాగుట. లోకుల చందంబునం గాక ప్రముచ్చులు పడుపాటుపడెనే. పిచ్చిపట్టిన ప్రజ కంటం బడిన వారిం జంపంబోవుటయు నెదుట నెవ్వరును లేనిచో దన్ను జంపికొనంబోవుటయు నగుచోఁ దల్లి విడువకయుం గానరాకయు నుండి కాపాడుచుండునట్లున్న యంతర్యామిలో నున్నాఁడన్న నొప్పనివాఁడు మొగముజూప సమ్మతించునేయని యవతారంబునందు నంతర్యామి చందంబు విడువఁడయ్యెననుట. జన్మనక్షత్రంబు దెలిసిన నభిచారంబు సేయువారికెడమగునను భయంబున, 'అత్తత్తిౝపత్తానాళ్' అని హస్తనక్షత్రమునకు పదియవదినంబని రోహిణీశ్రవణంబుల సంశయంబు పుట్టించినట్లు తల్లిపేరు తెలియకుండుటకై యొక్కతెయని చెప్పుట.

తరిక్కిలానాగిత్తాౝ తీఙ్గునినైన్ద కరుత్తై ప్పిழైప్పిత్తు—కృష్ణుడెదుగుచున్నాఁడన నిలువలేక మంగళాశాసనార్హంబగు నవ్విషయంబున పూతనాప్రేషణాది దుష్టవ్యాపారంబులం దలంచిన దానికి బదులుగాఁ దనకు రాఁగల యనర్థంబెఱుంగక చేయు కంసాదిసంకల్పంబు నాశ్రయనాశంబున నష్టము సేసి మనకుం దన్నొసంగెననుట. ఇట్టివ్యాపారంబని వక్కాణించుట యసహ్యంబగుట దుష్టవ్యాపారంబని యింతియ చెప్పుట.

కఞ్జై వయిత్ తీల్ నెరుప్పెన్న నిన్ర నెడుమాలే—కంసుండనాది కాలంబుననుండి చేసిన పాపంబులెల్ల దర్శనక్షణంబుననే యనుభవించు నట్లాశ్రితహృదయస్థంబైన సంతాపాగ్ని నాశ్రితవ్యామోహంబునఁ గంసుని హృదయంబున ముట్టించినవాఁడనుట. అప్పుడు శ్రీ దేవకీవసుదేవుల యెడ నుల్లంబు దవిలినదనియుం జెప్పుదురు.

ఉన్నై యరుత్తిత్తు వన్దోమ్ — శ్రీ వైకుంఠమునుండి తానే యాశ్రితులం బ్రార్థింపవచ్చిన వ్యాముగ్ధుని నిన్ను పిచ్చివానికిం బిచ్చి యొత్తించినట్లు మేము ప్రార్థింపవచ్చితి మనుచున్నారఁట.

పఱై తరుదియాగిల్ — వట్టి మా తలంపులప్రయోజకములు, నీ సంకల్పంబే ఫలసాధకంబనుట. నీ యందంబున మమ్ము మఱపింపక యొసఁగుమీ యనుట యనియుం జెప్పుదురు.

తిరుత్తక్క శెల్వముమ్ శేవగముమ్ యామ్ పాడి—'యస్య సా జనకాత్మజా, అప్రమేయం హి తత్తేజః' అనిన చొప్పున నపరిచ్ఛేద్య ప్రభావత్వమూలంబయిన శ్రీవల్లభత్వంబునకుం దగినసంపద యనుట. శ్రీ యాశపడు సంపదయనియుం జెప్పుదురు.

వరుత్తముమ్ తీర్న్దు — నిన్నెడఁబాయుటం గలుగు క్లేశంబు నీ వెఱుంగవు గదా, అది దీరి యనుట యనియుం జెప్పుదురు.

మగిళ్న్దు — దుఃఖనివృత్తి మాత్రమేకాదు, ప్రీతిపరివాహంబు వెలువడునట్లు పాడవలయుననుట.



## ఇఱువదియాఱవ పాశురము

మీకపేక్షితంబేమని యతండడుగ నోముకు వలయు నుపకరణంబుల నపేక్షింపుచున్నారు. కృష్ణసంశ్లేషరసోత్సుకలైయు నట్టిసంశ్లేషంబున కేకాంతంబగు నోముం బ్రస్తావించుటం బ్రకటంబుగాఁ గృష్ణముఖసందర్శన తన్నామోచ్చారణంబులకవకాశంబిడిన గోపాలురయెడ నుపకారస్మృతిచేతం దదభీష్టంబయిన నోము సాంగముగా నాచరించుటకై తదుపకరణంబుల వేడుచున్నారు.



మాలే! మణివణ్ణా! మార్గళినీ రాడువాన్...
కోలవిళక్కే, కొడియే, విదానమే
ఆలిన్ ఇలైయాయ్ అరుళ్



## 26

మాలే మణివణ్ణా మార్గఴి నీరాడువా౯

మేలైయార్ శెయ్వనగళ్ వేణ్డువన కేట్టియేల్

ఞాలత్తైయెల్లామ్ నడుఙ్గ మురల్వన

పాలన్నవణ్ణత్తు౯ పాఞ్చశన్నియమే

పోల్వన శఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడైయనవే

శాలప్పెరుమ్పఱైయే పల్లాణ్డిశైప్పారే

కోలవిళక్కే కొడియే విదానమే

ఆలినిలైయా యరుళేలోరెమ్బావాయ్.

మాలే : ఆశ్రితులయందు వ్యామోహము గల వాడా

మణివణ్ణా : ఇంద్రనీలమువంటి దేహవర్ణము గలవాడా

మార్ గళి నీరాడువాన్ : మార్గశీర్ష స్నానంబు సేయ

మేలైయార్ శెయ్‌వనగళ్ : పెద్దలు సేయు కార్యంబులు

వేణ్డువన కేట్టియేల్ : వలయునవి వింటివేని

ఞాలత్తై ఎల్లామ్ నడుఙ్గ మురల్వన : భూమియెల్ల నదురునట్లు ఘోషించు

పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్జశన్నియమే పోల్వనశఙ్గఙ్గళ్ : పాలవంటి వర్ణముగల నీ పాంచజన్యము వంటి శంఖములు

పోయ్‌ప్పాడు ఉడైయనవే : విస్తారము గలయవి

శాలప్పెరుమ్ పఱైయే : మిక్కిలియుం బెద్దయగు వాద్యవిశేషము

పల్లాణ్డిశైప్పారే : మంగళాశాసనము పాడువారు

కోలవిళక్కే కొడియే విదానమే : మంగళదీపము, ధ్వజము, మేలుకట్టు

ఆలినిలైయాయ్ : వటపత్రశాయీ

అరుళ్ : కృపసేయుమీ.

మాలే – మున్ను నారాయణశబ్దంబున మహాత్మ్యంబు దలంచిరి. ఇప్పుడు వాత్సల్యమే ప్రధానగుణంబని తెరపరచుచున్నారు. "విదితః సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః" అని శ్రీరామదేవుని ప్రధానగుణం బగుట శ్రీ సీతాదేవి ప్రకటించినట్లు వీరు శ్రీ కృష్ణునకిది ప్రధానగుణం బని తెలుపుట.

మణివణ్ణా – అపరిచ్ఛేద్యుండై యును ముంగొంగురతనంబువలె సులభుండగుటయు, ఇందుంజెప్పిన వాత్సల్యము ప్రతిఫలించునట్లుం డుటయు. ఇట్టిసౌలభ్యంబు లేక నిర్దయుండయినను విడువరాని మేని యందంబును, "మాలాయ్ప్పిఱన్ద నమ్బియై మాలే శెయ్యుమ్ మణాళనై" (నా - తి) అని వ్యామోహమునంబుట్టి వ్యామోహము సేయువల్లభుం డన్న చొప్పున పడుచులకు వ్యామోహంబు సేయువాఁడనుటయుం దోచును.

మీరుద్దేశించిన కార్యంబు సెప్పుండనఁ జెప్పుచున్నారు.

మార్గళి నీరాడువాన్ – 'స్వర్గకామో యజేత' యని విధించిన యాగాదులట్ల 'నిదిధ్యాసితవ్యః' అని విధించిన యుపాసనం బట్ల ఇది సుప్రసిద్ధంబుగాదే యనం జెప్పుచున్నారు.

మేలైయార్ శెయ్వనగళ్ – 'ధర్మజ్ఞసమయః ప్రమాణమ్' అనిచెప్పిన చొప్పున శిష్టాచారంబు సుప్రసిద్ధప్రమాణంబుగాదే. శ్రుతి స్మృతివిహితంబుగానిది బుద్ధిపూర్వంబుగాఁ బలుమాఱు శిష్టులాచ రింతురే యని విధిని సాధింపదే యనుట.

అక్లైనచో వలయునవి సెప్పుమనం జెప్పుచున్నారు.

వేణ్డువన కేట్టియేల్ – పడుచులెల్ల నెదుటనిలుచుటం దదవయవ సౌందర్యమునం దత్పరుండై యుండంజూచి వింటివేననుట. జ్ఞానభక్తి

వైరాగ్యంబులనే యవయవంబులుగా నిరూపించుట తత్త్వరహస్యము. దర్శనసాధనంబుగాన జ్ఞానము కన్ననియు, భోగోపకరణంబుగాన భక్తి స్తనంబనియుం, గార్యలక్షణంబును నిరాలంబనంబును గాన వైరాగ్యంబు నడుమనియుం జెప్పుట.

మీ యవయవంబులు భోగ్యంబులైనచో 'మధురా మధురాలాపా' యన్నచొప్పున మీపలుకులు భోగ్యంబులుగావే చెప్పుండీ యనం జెప్పుచున్నారు.

ఞాలత్తె ఎల్లామ్ నడుఙ్గమురల్వన పాలన్నవణ్ణత్తు ఉన్ పాఞ్జశన్నియమేపోల్వన శఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడైయనవే — 'స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్' అన్నచొప్పున ప్రతికూల హృదయవిదారణంబు సేయుటయు, నింతియ గాక యనుకూలురెల్ల సుఖించునట్లు ధ్వనించుటకు నవకాశంబుగలవియుం, బాలుండ చేసినట్లుండు నవియనుట. 'పోయ్ప్పాడు' అనఁగాఁ బొగడ్తయనియుం జెప్పవచ్చును గాన శ్రీ రుక్మిణీదేవి మొదలగువారల కుపకరించిన పొగడ్తయనుట.

శాలప్పెరుమ్ పఱైయే — "యయా తూర్యప్రణాదేన భేరీణాం చ మహాస్వనైః" అన్నచొప్పున నందఱు నెఱుంగుచొప్పున ఘోషించునవి కావలయునంట.

ఇట్లు ప్రార్థింప నాలకించి పాంచజన్యసదృశంబులయిన శంఖంబులనేకంబులు లేవు పాంచజన్యంబే కొనుమనియు, తనయొద్దనుండు వాద్యవిశేషము గొనుమనియు, మంగళాశాసనంబునకు పెరియాళ్వారొక్కరుగలరు, అట్టివారు మఱి లేరు, దీపంబువలయుచో నీళాదేవియు, ధ్వజంబు గరుడుండును, వితానంబునకు బీతాంబరంబును గొనుమనిన, నొక్కొక్కటి గాదు అనేకములు గావలయునని చెప్పి, అసాధ్యములెట్లు సాధింపగూడునన్న నీకు శక్యముగానిది గలదే, చిన్నయొక్క మేనుదాల్చి

యఖిలలోకము నందుంచికొని యొక్క వటపత్రమ్ముపై శయనించిన నీకు నసాధ్యముగలదే, వలయునవి గలిగింపలేవే యనుచున్నారంట.

ఆలినిలైయాయ్ అరుళ్ — ఇచ్ఛలేనిచోఁ జేయునదిలేదు, తలంచినచో నశక్యంబు గలదే యనుట. చరమశ్లోకంబున ‘మామ్’ అను పదంబునం దెలిపిన సౌలభ్యంబును ‘అహమ్’ అను పదంబునం దెలిపిన సహాయాంతరనిరపేక్షకత్వంబు నిప్పాశురమునం జెప్పంబడెననియు ‘నిరఞ్జనః పరమం సామ్యముపైతి’ యను శ్రుతితాత్పర్యంబు చెప్పఁబడె ననియుం జెప్పుదురు.





# 27

## ఇరువదియేడవ పాశురము

వ్రతసమాప్తియయిన నతనివలనం జెందవలయునవి చెప్పుచున్నారు.

కూడారై వెల్లుమ్ శీర్‌కోవిన్దా ఉన్దన్నై
పాడిప్పఱైకొణ్డు యామ్ పెఱుశమ్మానమ్

నాడుపుగఴుమ్ పరిశినాల్ నన్ఱాగ
శూడగమే తోళ్వళైయే తోడే శెవిప్పూవే

పాడగమే యెన్ఱనైయ పల్కలనుమ్ యామణివోమ్
ఆడైయుడుప్పోమ్ అదన్పిన్నే పాఱ్చోఱు

మూడ నెయ్‌పెయ్దు ముఴఙ్గై వఴివార
కూడియిరున్దు కుళిర్న్దేలోరెమ్బావాయ్.

| | |
|---|---|
| కూడారై వెల్లుమ్ శీర్ గోవిన్దా | కూడనివారలను జయించు కల్యాణ గుణములుగల గోరక్షకా |
| ఉన్దన్నై పాడి | నిన్ను పాడి |
| పఱై కొణ్డు | ప్రాప్యముం గొని |
| యాఞ్ పెఱు శమ్మానమ్ | మేము పొందెడి సన్మానములు ఏమనగా |
| నాడు పుకఴుమ్ పరిశినాల్ | లోకము పొగడు ప్రకారంబున |
| నన్ఱాగ | లెస్సగా |
| శూడగమే తోళ్ వళైయే తోడే శెవిప్పూవే పాడగమే | సూడగము, దండకడియంబులు, కమ్మలు, కర్ణ పుష్పంబులును, పావడము |
| ఎన్ఱనైయ పల్ కలనుమ్ | అని యిట్లన్నియాభరణంబులును |
| యామ్ అణివోమ్ | మేము ధరింతుము |
| ఆడై ఉడుప్పోమ్ | చీరలం గట్టుకొందుము |
| అదన్ పిన్నే పాల్ శోఱుమూడ నెయ్ పెయ్దు | దానివెనుకం బాలునన్నము మునుముంగ నట్లు నెయ్యిం గూర్చి |
| ముఴఙ్గై వఴివార | మోచేతం గారునట్లు |
| కూడియిరున్దు | కూడియుండి |
| కుళిర్న్దు | సుఖింపవలెను. |

కూడార్రై వెల్లుమ్ శీర్—ఎన్ని చేసినను 'న నమేయమ్' అనువారి జయించుఁగాక కూడినవారలకుండానే యోడునఁట. కల్యాణగుణంబులో యన్నను అందఱి నోడింపఁ నఁట. 'చచాల చాపం చ ముమోచ వీరః' అన్న చొప్పున విల్లువట్టిన పట్టుసూపి విరోధులను, సౌందర్యాదుల ననుకూలులను, అందును సౌలభ్యాదుల సర్వజ్ఞుల సైతము నోడించి ఎవ్విధంబెవ్విధంబని మోహింపంజేయునఁట. బాణక్షతంబునకు నౌషధంబు గలదు. నీవే చంపినచోఁ బరిహారమేమున్నది?

గోవిన్దా-రక్షించుటకుం బ్రాతికూల్యనివృత్తిమాత్రంబుచాలునఁట.

ఉన్ఱదన్నైప్పాడి — హిరణ్యపురంబుమాడ్కి— నీ పేరు దలఁపనీని హిరణ్యదాస్యంబుమాని గోపీజనవల్లభుండవైన నీ నామంబులు స్వయం ప్రయోజనంబులుగాఁ బాడి యనుట.

పఱైకొణ్డు — ఊరివారికిం బ్రాపకంబుగాఁ దోచునది మాకు ప్రాప్యంబనుట.

యామ్పెఱు శమ్మానమ్—అనాదికాలమునుండి యనేకులవలనం జెందిన పరిభవంబులు మఱచునట్లు. 'పతిసమ్మానితా సీతా' అని శ్రీరామదేవుండు తనకంఠమునందలి హారంబుదిగిచి యొసంగినట్లొసంగుట యని కూరత్తాళ్వానతినిచ్చెనఁట. అడుగులంబట్టెనని భట్టరఁట.

నాడు పుకళుమ్ పరిశినాల్—అతండొసంగుట వీరలు గొనుటయు నని యాదఱుం గొనియాడవలెనఁట.

నన్రాగ — 'తం బ్రహ్మాలంకారేణాలంకుర్వన్తి' యని ముక్తునకు కొందఱిచేతం గై సేయించుటవలెఁ గాక ఇంద్రుండంపిన హారమును 'ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాఽసి భామిని' యని భర్త్రనుమతిఁ సీతాదేవి యాంజనేయున కొసంగిన ట్లుభయులు నిడవలెనఁట. కై చేసి కొని యతనిరాకకు నిరీక్షింపకుండవలెనఁట.

శూడగమే — హస్తాభరణము. 'అడిచ్చిరియోమ్ తలైమిక్కై సీ యణిరియాయ్' అని దాసురాంధ్రము మాతలపై గయినేయవే యని పీరలనుటకు బదులుగా మున్నుగా స్పర్శంబునేయుచోఁ బరమప్రణయి గాన నతండు తన తలనిడికొని యిడు నాభరణమఁట.

తోళ్ వళైయే — ఆ స్పర్శంబునం గౌగలించికొని దండలకిడు నాభరణంబఁట.

తోడే శెవిప్పూవే — కౌగిలించుచోఁ భుజంబులకొత్తు నగలవలెం గాక యాలింగనానంతరంబున మూర్కొనుచో నుండునని యనుట.

పాడగమే — కౌఁగిలి కోడి పట్టు పాదంబున కిడునాభరణమనుట.

ఎన్ఱనైయ పల్ కలనుమ్ — పెద్దపెద్దవి కొన్ని చెప్పితి మింతియు, నీ మెచ్చిన పలుపలువిధముల నగలుననుట.

యామణివోమ్ — మున్ను పూవుల ముడిచికొనమన్నవారు ఫలదశ నిన్నియుం గోరుచున్నారు.

ఆడై యుడుప్పోమ్ — మున్నును చీరలంగట్టికొన్నను అతండు కట్టనిచీర చీరగాదని యుందురఁట, అతనివస్త్రము వీరలు కట్టునట్లు మాఱుట యనికాని స్వేదగంధయుక్తంబై యతఁడుగట్టుట నలిగిన వస్త్రంబనికాని వ్రతసమాప్తియగుటచేఁ గ్రొత్తవస్త్రము గట్టుటయనికాని చెప్పవచ్చునఁట.

అదన్ పిన్నే పాల్ శోఱు మూడ నెయ్ పెయ్దు—భగవత్సంబంధము గల గొల్లపల్లెనుండు సమృద్ధియెల్ల నింపై యుండునఁట.

ముళ్ళంగై వళివార — మున్ను నెయ్యి గుడువము పాలు గుడువ మని చెప్పినవారలవి యాసపడుచున్నారు. ఇందు 'నంబితిరువళుది వళనాడదాసుఁడు' నెయ్యి నోటనిముడదో యని యడుగం గృష్ణసంనిధి

తృప్తులయినవారలకన్నము నోట నిమిడినంగదా నెయ్యి యిముడునది యని భట్టరానతిచ్చెనcట.

కూడి యిరున్దు—విశ్లేష క్లేశముద్దీరం గూడి యంటి యుండుటయే ప్రయోజనమcట భుజించుట గాదcట.

కుళిర్న్దు — విరహమున నెఱియలువారిన డెందములు సరసము లగునట్లు. శ్రీరంగనాథుండు మహోత్సవంబను పేర శ్రీవైష్ణవులనెల్లం గూర్చి కనుగొనునట్లు, 'అహమన్నమ్ - అహమన్నాదః' (తై-అ) అని యీశ్వరునకుం జేతనుండును చేతనునకతcడును భోగ్యులుగదా యని చెప్పుదురు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాంత్సహ బ్రహ్మణా విపశ్చితా' (తై-ఆ) అని పరబ్రహ్మముతోడం దద్గుణానందానుభవము సేయునను శ్రుత్యర్థమిప్పాశురమునం జెప్పంబడునండ్రు.



## ఇరువదియెనిమిదవ పాశురము

మొదటి పాశురమున సంగ్రహామునం జెప్పిన ప్రాప్యప్రాపకములు రెండు పాశురములచే వివరింపుచున్నారు. అందును గోపవృద్ధులకై నోము సాధించుపేరం దమయుద్దేశ్యంబగు కైంకర్యంబను పురుషార్థము సాధించుటకుం దమ యజ్ఞానాశక్తులును, సంబంధముం బురస్కరించి నీవె యుపాయంబవై నేరవేర్పవలయునని ప్రార్థించుచున్నారు.



## 28

కఱవైగళ్ పిన్ శెన్ఱు కానమ్ శేర్న్దుణ్బోమ్
    అఱివొన్ఱుమిల్లాదవాయ్కులత్తు ఉన్దన్నైప్
ప్పిఱవి పెఱున్దనై పుణ్ణియమ్ యాముడైయోమ్
    కుఱైవొన్ఱుమిల్లాద గోవిన్దా ఉన్దన్నోడ్
డుఱవేల్ నమక్కిఙ్గొళిక్క వొళియాదు
    అఱియాదపిళ్ళైగళోమన్బినాల్ ఉన్దన్నైచ్
చ్చిఱుపేరళైత్తనవుశ్శీఱియరుళాదే,
    ఇఱైవా నీ తారాయ్పఱైయేలోరెమ్బావాయ్.



కఱవైగళ్ పిన్ శెన్ఱు కానమ్ శేర్న్దు ఉణ్బోమ్......
ఆయ్క్కులత్తు ఉన్ఱన్నై
ప్పిఱవి పెఱున్దనై పుణ్ణియమ్ యాముడైయోమ్

కఱవైగళ్ పిన్ శెన్ఱు : పశువులను వెంబడించి

కానమ్ శేర్న్దు ఉణ్బోమ్ : అడవిని జేరి జీవించు వారము

అఱివొన్ఱుమిల్లాద వాయ్ : తెలివి యేమియు లేని గోపాలకులము

క్కులత్తు నందు

ఉన్దన్నై ప్పిఱవి పెఱున్దనై : దేవరజన్మము గలుగునట్లు

పుణ్ణియమ్యామ్ ఉడైయోమ్ : పుణ్యము గలవారమగుదుము

కుఱై వొన్ఱుమ్ ఇల్లాద గోవిన్దా : లోపమేమియు లేని గోపాలా

ఉన్దన్నోడు ఉఱవేల్ నమక్కు : దేవరతో సంబంధంబోయన్నను మనకు

ఇఙ్గు ఒఴిక్క ఒఴియాదు : ఇక్కడ ద్రోచినను దొలగనిది

అఱియాద పిళ్ళైగళోమ్ : తెలియని పిన్నపడుచులము

అన్బినాల్ ఉన్దన్నై : ప్రేమమున దేవరను

శిఱుపేర్ అఴైత్తనవుమ్ శీఱి : చిన్నపేరం బిలిచినను కోపింపక

యరుళాదే

ఇఱైవా : స్వామీ

నీ తారాయ్ పఱై : నీవొసంగుమీ మా యభీష్టంబు.

కటువై గళ్ పిన్ శెన్లు కానమ్ శేర్న్దు ఉణ్బోమ్— 'జ్ఞానేన హీనాః పశుభి స్సమానాః ' అని యజ్ఞానమునకు నిదర్శనముగాఁ జెప్పఁబడిన పశువులవెంబడిం దిరుగుటయే గురుకులవాసముగా మా తెలివిం జూడ వాసి తెలివి వసిష్ఠాదిజ్ఞానంబనునట్లును, 'కృతానుకారానివ గోభిరార్జవే' అనినచొప్పున కపటంబెఱుంగమిని గోవులు పరిహాసించి యనుకరించు నట్లున్నవారమై తమతమ వృత్తులచే హితముసేసికొను మనుష్యులుండు ప్రదేశములం గాలునిలువక కసవుగలుగు కానలో వర్తిలుచు నందుం డినను వానప్రస్థులవిధమున నాముష్మికముగోరి శరీరశోషణాదులంజేయక తత్పోషణపరులమై యున్నామనుట.

విదురాదులవలె జన్మాంతరానుష్ఠిత సుకృతబలమున జ్ఞానభక్తి లాభము గలిగెనేమో యన నదియును లేదనుచున్నారు.

అఱివొన్ఱుమిల్లాద వాయ్క్కులత్తిల్ — తెలివిలేమి దోషముగాక గుణముగా గైకొనందగిన కులముననుట.

'అహమస్మ్యపరాధానామాలయః' అని నేను నేరములకెల్ల నెలవగువాఁడననియు, 'నోఱ్ఱనోన్బిలేన్ నుణ్ణఱివిలేన్' అని మున్ను చేసిన సత్కర్మము లేనివాఁడ సూక్ష్మజ్ఞానము లేనివాఁడననియు, 'న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాం స్త్వచ్చరణారవిన్దే' యని ధర్మనిష్ఠుఁడం గాను — ఆత్మజ్ఞానము గలవాఁడను గాను దేవరపాదారవిందమున భక్తి గలవాఁడను గానని యు నిట్లు జ్ఞానపూర్ణులగువారలే చెప్పుదురు గాన నిట్లనుట జన్మాంతరశతానుష్ఠిత సుకృతపరిపాకరూపంబగు నొక్కవిలక్షణ జ్ఞానావస్థావిశేషము గాదే యనిన, నట్లుగాదు, ఇక్కులమునంబుట్టిన మాకుఁ దెలివిగలదని చెప్పుచో దేవరకుం దెలివిలేదనవలసివచ్చునని చెప్పి, అట్లైనచో నే నిక్కులమున నెట్లవతరించితి, నే నిట్టివాఁడనని మీ రెఱుంగుటయు నవిచ్ఛిన్నానుభవమును విశ్లేషము సైరింపలేని ప్రేమయు నెట్లు గలిగె, నిదిగాదే భక్తిరూపాపన్నజ్ఞానంబనం జెప్పుచున్నారు.

ఉన్దన్నై ప్పిఱవి పెఱున్దనై పుణ్ణియమ్ యాముడైయోమ్—అట్టి పుణ్యము శాస్త్రప్రామాణ్యమునం గలదనవలయు నింతియ. ఇట్టి మహా లాభము గలుగవలయుననని సాధనానుష్ఠానముం జేసితిమనం జాలము. కడచిన యనేకజన్మములం దెప్పుడో యొక్కప్పుడొనరించిన సుకృతము లెల్లంగూర్చి యొక్కదానికొక్కటి సాధనముం జేసి యిట్టిసుకృతము గలిగెంగాన మీకులమున నవతరించి యుద్ధరించెదనని సంకల్పించితివి గాంబోలును. అది నీవే యెఱుంగుదువఁట. అసాక్షికము. ఐనం గానిమ్ము. శాస్త్రం బసత్యమనంజాలము - నీవు పక్షపాతివనం జాలము. అట్టిసుకృతముం జేసితిమని యొప్పుకొనియెదము - సరిగాని యిట్టిపనిచేసిన నిట్టిఫలము గలుగుగాత మనువ్యవస్థ యెవ్వండు చేసినది, అది 'నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాంయోవిదధాతి కామాన్' అని నిత్యులుం బలువురునగు చేతనులకెల్ల నిత్యుండొక్కచేతనుం డభీష్టములం జేయుచుండునని శ్రుతిప్రసిద్ధంబగు నీయౌదార్యస్వభావముగాదే నీవు చేసినది. అందు కెవ్వనిసుకృతము కారణము. అదియట్లుండనీ. ఈవరకు మేముచేసినకృత్యములెల్ల స్వతంత్రులమయి చేసితిమే. నీవాశ్రయంబవై యుండి నడపుచుండలేదే. మేము సంకల్పించినమాత్రనే నెరవేరునే. మేము సంకల్పించునవెల్లం గార్యసిద్ధిగలిగెనే. కావున నెవ్వండెవ్వండెయ్యది గోరునో దానికొండెం దత్సాధనంబున కొండెం బ్రతిబంధకంబగు తలంపు లేనిచో వానియభీష్టసిద్ధిసాధనంబుల వరుసం జేకూర్చి యభీష్టనిర్వాహంబు నేయుదునను నీ మహాసంకల్పంబెకాదే యందఱకుం బ్రధానసాధనంబు. అట్టి సంకల్పంబుతో నీవు నెరవేర్చిన సాధనంబులెల్ల నీవొసంగినవికావే. దానంబట్టియె కాదే 'కృష్ణం ధర్మం సనాతనమ్' అని కృష్ణుండె సనాతన సాధనంబనియు, 'రామో విగ్రహవాన్ ధర్మః' అని శ్రీ రామదేవుండె విగ్రహంబుగల ధర్మంబనియుం జెప్పంబడినది. కావున నిందుకిది సాధనం బని మే మెఱింగి స్వతంత్రంబుగాఁ జేసిన సుకృతంబొక్కటియు లేదు.

లోకులాశ్రయణీయుని వెదకి యాశ్రయింపుచుండ నాశ్రయణీయుండవగు నీవే మేమున్నచో సజాతీయుండవై యవతరించుట యను నీ యుత్కర్షంబు మాపుణ్యఫలంబని యెఱుంగుదు మింతియ యనుట. పుణ్యఫలంబు గలదని యెఱుంగుటయుం దెలివియేమియు లేదనుటయు వ్యాహతభాషణంబు గాదే యనిన నిదియెపో మా తెలివిలేమికి సాధకంబనుచున్నారంట.

కానిండు ఇంకనైన నభీష్టసిద్ధికి మీరేమయినం జేయవలదే యన్నం జెప్పుచున్నారు.

కుత్తై వొన్ఱుమిల్లాద గోవిన్దా — సర్వనిరపేక్షుండవయిన నీకు మేము సేయునది యెయ్యది. మేము సేయునవియెల్ల దేవరప్రసాదమునం గలిగిన యవియె. నీకేమయినం గావలసియున్నను నీవొసంగని దేమైన నున్నను సెలవిమ్ము. మాలోపంబను పాతాళము నింపుటకు నీ పూర్తియను పర్వతము చాలదోయనుట. అట్లైనను మిమ్ము రక్షించునపేక్షయు నెట్లన్నను, గోవిందా! నీవు పరమపదముననే నిరపేక్షుండవై యున్న వాఁడవు. మాకు సజాతీయుండవై యవతరించుట కేమికారణంబో నీవే చెప్పుమనుట.

ఔదార్యస్వభావమున నింతచేసితిని. ఇది చాలదో, యింక మీ యభీష్టముల నెరవేర్చునావశ్యకత యేమన్నం జెప్పుచున్నారు.

ఉన్ఱన్నోడుఉఱవేల్ నమక్కు ఇఙ్గు ఒళిక్క ఒళియాదు — నీ యౌదార్యమునకు మూలము మన రక్ష్యరక్షకభావ సంబంధంబె. అది యాగంతుకము గాదు. నీవు ద్రోచినం దొలఁగదు — మేము త్రోచినం దొలఁగదు. ఉభయులము నొడంబడి త్రోచినం దొలఁగదు. 'నానున్నై యన్ఱియిలేన్ కణ్డాయ్ నారణనే నీయెన్నై యన్ఱియిలై' (ము-తి) నేను నిన్ను విడిచి ఉండనుజుమీ నారాయణా నీవు మమ్మును విడిచి యుండవు సుమీ యని చెప్పుదురు. అదియు మీవంటివారల మాటలే యన్నను

నీ మంత్రములోని ప్రథమాక్షరము చూచికొనుము. నారాయణునకే మాకు నాద్యవిశేషం బొసంగునని మొదటనే తదర్థకశబ్దం బెత్తి చెప్పితిమి కాదే యనుట.

అటులయినచో గోవిందా యని పిలిచినది తప్పుగాదే యన్నను జెప్పుచున్నారు.

అరియాదపిళ్ళైగళోమ్ అన్బినాల్ ఉన్దన్నై శిఱుపేర్ అరైత్తనవుమ్ శీఱియరుళాదే — 'ప్రమాదాత్ప్రణయేన వాఽపి' అన్న చొప్పున ననవధానంబునగాని ప్రేమంబునగాని పిన్నతనంబునగాని గలిగిన యజ్ఞానంబునం బిలుచుటకుం గోపించుట, యొక్కపడకం బన్నుండ బిడ్డంజూచి కాలుతాకెం గేలుతాకెనని కోపించుచందంబగు ననుట. గోవిందా యను సౌలభ్యద్యోతకనామంబే యభీష్టంబనియు గోవిందాభిషేకంబు సేసినపిదప నారాయణా యనుటయే పిన్నపేరుగా దలంచెననియుం జెప్పుదురు.

ఇఱైవా — స్వామ్మనకుంగల లోపంబు స్వామిదిగాదే. 'పిఱైప్పరాగిలుమ్ తన్నడియార్ శొల్ పొఱుప్పదు పెరియోర్ కడనన్రే' అనిన చొప్పున తప్పుచేసినవారైనను తనదాసులపలుకులు సైరించుట పెద్దలకు న్యాయంబుగాదే. నీవు స్వామివగుటకును కోపించుటకును విరోధంబు గాదే యనుట.

సీతాఱాయ్ పఱై — అప్రతిషేధంబున్నం జాలునను నీవపేక్షించినం జేయవే యనుట.





## 29

### ఇఱువదితొమ్మిదవ పాశురము

ఇట్లుపాయస్వరూపంబు సెప్పి తమయుద్దేశ్యంబగు కైంకర్యమే ప్రబంధతాత్పర్యమని చెప్పి నిగమింపుచున్నారు.

శిఱ్ఱమ్శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తున్
పొఱ్ఱామరై యడియే పోఱ్ఱుమ్బొరుళ్ కేళాయ్
పెఱ్ఱమ్ మేయ్త్తుణ్ణుఙ్కులత్తిల్ పిఱన్దు నీ
కుఱ్ఱేవలెఙ్గళై క్కొళ్ళామల్ పోగాధు
ఇఱ్ఱైప్పఱైగొళ్వానన్ఱుకాణ్ గోవిన్దా
ఎఱ్ఱైక్కుమేఴేఴ్ పిఱవిక్కు మున్దన్నోడు
ఉఱ్ఱోమేయావోమునక్కే నామాట్చెయ్వోమ్
మఱ్ఱైనఙ్గామఙ్గళ్ మాఱ్ఱేలోరెమ్బావాయ్.



పాగ్త్రా మట్రై యుకేమే పోగ్రుమ్ పొకుల్ కేళాన్...
ఉర్ల్గోమే ఆనోమ్; ఉనక్కేనామ్ అక్స్యుమ్నోమ్

శిత్ట్రమ్ శిఱుకాలే వన్దు : అత్యంత ప్రాతఃకాలమున వచ్చి

ఉన్నై సేవిత్తు : దేవరను సేవించి

ఉన్ పొన్ఱామరై యడియే : నీ స్పృహణీయమగు తామరసదృశంబగు పాదమునకు

పోట్రుమ్ పొరుళ్ కేళాయ్ : మంగళాశాసనము సేయు నభిప్రాయము వినుమీ

పెట్రమ్ మేయ్త్తుణ్ణుమ్ కులత్తిల్ పిఱన్దు : పశువులను మేపి భుజించు కులంబునం బుట్టి

నీ కుట్రేవల్ ఎఙ్గళై క్కొళ్ళామల్ పోగాదు : నీవు ఉచిత కైంకర్యంబుల మావలనం గొనక పోరాదు

ఇట్రై ప్పఱై కొళ్వా నన్ఱుకాణ్ : ఇది వాద్యవిశేషమాత్రంబే యనికొను వారము గాము సుమీ

గోవిన్దా : గోపాలా

ఎట్రైక్కుమ్ ఏழேழ் పిఱవిక్కుమ్ : ఎప్పటికిని ఏడేడు జన్మంబులకును

ఉన్దన్నోడు ఉట్రోమే యావోమ్ : నీతో సంబంధులమే యగుదుముగాత

ఉనక్కే నామ్ ఆళ్ శెయ్‌వోమ్ : నీకే కైంకర్యము సేయుదుముగాత

మట్రై నమ్ కామఙ్గళ్ మాట్రు : తక్కిన మా యభీష్టంబులం దొలంగింపుము.

శిఱ్ఱమ్ శిఱుకాలేవన్దు ఉన్నై శేవిత్తు ఉన్ పొఱ్ఱామరై యడియే పోఱ్ఱుమ్ పొరుళ్ కేళాయ్ – పిన్నపదముచులు లేవంజాలని కాలంబై 'బ్రాహ్మే ముహూర్తే వ్యుత్థాయ చిన్తయేదాత్మనో హితమ్' అని సత్త్వోద్రేకంబున నాత్మహితంబు చింతింపందగిన కాలమై అనాద్యజ్ఞానాంధకారము వాసి భగవద్విషయము వెలుంగయిన కాలమందు ప్రాప్యలాభంబు తదధీనమైయున్నను ఆదరాతిశయమునను నీ తలంపునకు మిక్కిలియగునట్లును నీవున్నచోటికి వచ్చి, 'సుసుఖం కర్తుమ్' అనియు 'పలమున్దుశీర్' అనియుం జెప్పినచొప్పున సాధనకాలంబునందె ఫలంబు వేఁడ నక్కఱలేక రసించు నీ సేవచేసి, 'యెళ్లుదుమెన్ఱు మిదుమిగై' అని సేవింపనుద్యోగించుటయే భారంబుగానుండి యొక్కయంజలి చేసినచో ఋణభారంబుగాఁ దలంచువాఁడవై, 'సుగ్రీవం నాథమిచ్ఛతి' అను చొప్పున సేవకులు సేవ్యులగుటకు వేడ్కఁజెందు నీ శ్రీపాదంబుల మంగళాశాసనంబు దక్క, 'సర్వాత్మనా పర్యనునీయమానో యదా న సౌమిత్రిరుపైతి యోగమ్' అని యెన్నివిధంబుల ననునయంబు చేసినను యావద్రాజ్యంబొల్లని శ్రీ లక్ష్మణునియట్ల ప్రయోజనాంతరంబు నొల్లక మంగళాశాసనంబే చేయు మాయుద్దేశ్యంబు వినుమనుచో నతండు వీరల యవయవంబులం జూచుపరాకున నుండ నా పరాకువిడిచి యాలకింపుమీ యనుచున్నారఁట. అతండును వానివలెనే పలుకులును వీరివే గాన వినుచుండెనఁట.

పెఱ్ఱమ్మేయ్త్తు ఉణ్ణుమ్ కులత్తిల్ పిఱన్దు నీ కుఱ్ఱేవల్ ఎఙ్గళై కొళ్ళామల్ పోగాదు – శాస్త్రంబుల వినంబడియేయుండు నీవు పసుల కడుపునిండినంగాని తాముభుజింపనికులంబునం బుట్టి యిట్టి మా యుద్దేశ్యంబు గొనకుండరాదు. నీజన్మంబునను మాకార్యంబు కొనసాగింపవలయును. పశువులకు వేఱురక్షకులున్నను, నీవుదక్క రక్షకులులేని మమ్ముం గైకొనక తీరునే. ఇది నీకు విహితము. శబ్దాదివిషయములే

దారకంబులుగానుండు మాకు మీ సౌందర్యాదులం జూపి, 'ఉణ్ణుమ్ శోఱు పరుగు నీర్ తిన్నుమ్ వెత్తిలైయుమెల్లామ్ కణ్ణనెమ్బెరుమాన్' అన్నచొప్పున ధారకపోషకభోగ్యంబులెల్ల నీవే యనునట్లు చేసి స్వాహా పానురూపంబగు నుద్దేశ్యంబొసంగకుండుట నీకుం దగునే.

మీరుకోరినది నోమునకంగంబగు వాద్యవిశేషంబు, అదియిచ్చెదం గొనుండని యతండుసెప్ప, మేమిది ముఖ్యోద్దేశ్యంబుగా వచ్చినవారము గాముసుమీ, నీవు యథాశ్రుతగ్రాహివైతివే యనుచున్నారు.

ఇఱ్ఱైప్పఱై కొళ్వానన్ఱుకాణ్ గోవిన్దా — అంగములకుం బ్రధాన ఫలంబుదక్క వేఱుఫలంబులేమియుం దాత్పర్యవృత్తియు సేయుంగనిజన్మం బునం బుట్టితివిసుమీ యనుట.

అయినచో విశదముగాఁ దెల్పుఁడీ యనఁ జెప్పుచున్నారు.

ఎఱ్ఱైక్కుమ్ ఏழேழ్పిఱవిక్కుమ్ ఉన్దన్నోడుఱ్ఱోమే యావోమ్ — నీవు స్వామివనియు మేము స్వమ్ములమనియుం దెలిసి, 'మాతా పితా భ్రాతా నివాసశ్శరణం సుహృద్గతిర్నారాయణః' అను చొప్పున తల్లి దండ్రిసైదోఁడు నివాసముశరణము, చెలికాఁడు గతియును నీవే యను నారాయణశబ్దార్థంబెఱింగి 'కృష్ణాశ్రయాః కృష్ణబలాః కృష్ణ నాథాశ్చపాణ్డవాః' అనుచొప్పున కృష్ణుఁడే యాశ్రయంబు బలంబు నాథుండుగానుండు పాండవులమాడ్కినుండి, 'శేలేయ్కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్' అని స్త్రీలు, సంపదలు, సంతానంబులును మొదలగు నన్నిసంబంధంబులును నీతోనే గలిగియుండుము గాతమనుట.

సంబంధజ్ఞానంబు గల జన్మంబే మాటిమాటికిం గలుగవలయు ననుటకు నుద్దేశ్యంబేమన్నం జెప్పుచున్నారు.

ఉనక్కేనామాళ్ శెయ్వోమ్—బ్రహ్మానందరసానుభవంబే పరమ పురుషార్థంబు గావునం దత్సజాతీయంబగు రసంబు గలుగుచో నెట్టిజన్మం

బున నెన్నిమాఱులు పుట్టిన నేమి యని భావము. సుఖరూపంబగునదియే పురుషార్థంబు. సుఖంబు జ్ఞానవిశేషంబు గాని శారీరక్రియారూపంబు గాదుగదా. ఇట్లుండం గైంకర్యంబు గోరుట యేమన్నను, 'న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్' అన్న చొప్పునం బ్రాణియొక్కండు నొక్కక్షణంబైన నేమియుం జేయక యుండ లేఁడు గావున నవి తప్పవుగదా, అవి చేయుచో సంకల్పంబులేక చేయరాదుగదా. సంకల్పంబు నిర్విషయంబు గాదుగదా. విషయంబు లనర్థావహంబులగు శబ్దాదివిషయంబులును పరమార్థంబగు నీశ్వరస్వరూపగుణాదులు నని రెండు తెఱంగులే కదా. ఈవిభాగంబెఱింగినవారలీశ్వరునిం దలంచుచు నాయుద్దేశంబునం బనులు సేయుటకుం బ్రతికార్యంబు నీశ్వరసంబంధంబు మునుకొనియె సంకల్పించుట శ్రేయస్కరమనియు, నందు విహితనిషిద్ధోదాసీనంబులను మూడు తెగల కర్మంబులలో నిషిద్ధంబులు దుఃఖఫలకంబులుగాన నవి యొనరించినచో దుఃఖంబులం జెందుటయె పర్యవసానంబగుం గానం, దక్కినవానిలో నుదాసీనంబులు నిష్ప్రయోజనంబులని యెఱుంగుటను 'ప్రయోజనమనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే' యను న్యాయంబునం బ్రవృత్తి పుట్టుట దుస్తరంబుగాన, విహితంబు లీశ్వరశాసనంబులను జ్ఞానంబుతోఁ జేయుచో నీశ్వరభక్తిపురస్సరంబులై మాటిమాటికిం జేయుచుండ వెండియు నట్టిజ్ఞానంబె పుట్టింపుచుండుం గాన దృఢంబుగాగా మానసానుభవంబు విస్తీర్ణంబై యనిచ్ఛిన్న బ్రహ్మానందానుభవ పర్యవసాయి యగుం గానం, జేయు కృత్యంబులెల్ల నీశ్వరాజ్ఞారూపంబులని సేయుచుండుట నవి యెల్ల రాజునౌకరులు రాజశాసనంబునం జేయుకృత్యంబులు కైంకర్యంబులగునట్లీశ్వరకైంకర్యంబులనంబడునని యవియె కోరుట. నీకే యను నవధారణంబున ఫలించునది యేమన్నను, ఈశ్వరాజ్ఞారూపంబులయిన కృత్యంబులును, ఫలాంతరములు గోరువారలకు ఫలాంతరసాధకంబగు

టయుం గలదుగాన నట్టియుద్దేశంబుఁ జేర్చినవో నెండియు నర్థనస్త్రాన సానంబు చేయుంగాన నట్లుగాకుండునట్లు ఫలాంతరాపేక్ష వదలుట.

మన్ జినజ్జామజ్జల్ మాన్ జిజు — మా ప్రయోజనంబు లనుమాట లేకుండ దేవరశాసనంబు లనుజ్ఞానమే కలుగునట్లు కృపచేయుమీ యనుట.

ఇందులోఁ బ్రాప్యరుచియుం బ్రాప్యంబిది యను నంశంబును అదియు నతని యధీనంబను నంశంబును జెప్పంబడెడి.





# 30

## ముప్పదియవ పాశురము

ఇప్ప్రబంధంబు నేర్చువారలు శ్రీనారాయణుల ప్రసాదంబునకు విషయంబులగుదు రనుచున్నారు.

వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిఴైయార్ శెన్ఱిఱైఞ్జి
అఙ్గప్పఱైకొణ్డవాఱ్ఱై యణిపుదువై
పైఙ్గమలత్తణ్డెరియల్ పట్టర్పిరాన్ కోదైశొన్న
శఙ్గత్తమిఴ్మాలై ముప్పదుమ్తప్పామే
ఇఙ్గిప్పరిశురైప్పార్ ఈరిరణ్డుమాల్వరైత్తోళ్
శెఙ్గణ్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్
ఎఙ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱిన్బుఱువరెమ్బావాయ్.

వఙ్గక్కడల్ కడైన్ద : ఓడలుగల సముద్రమును దరచిన

మాదవనై కేశవనై : శ్రీవల్లభుని కేశిహన్తయగువాని

తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయి : చంద్ర శ్రీముఖులైన శోభనాభరణాలు

ழైయార్ శెన్ఱిఱైఞ్జి (స్త్రీలు) పోయి స్తోత్రముచేసి

అఙ్గు అప్పఱై కొణ్డవాఱ్ఱై : ఆ గొల్లపల్లెలో నుద్దేశ్యంబు లభించిన ప్రకారంబును

అణిపుదువై : (సంసారంబునకు) అలంకారంబైన శ్రీవిల్లిపుత్తూరులో

పైఙ్గమల త్తణ్డెరియల్ : స్పృహణీయమగు తామరలం గట్టిన శీతల మాలికగల

పట్టర్ పిరాన్ కోదై శొన్న : పెరియాళ్వ్ వారి కూతురానతిచ్చిన

శఙ్గత్తమిழ் మాలైముప్పదుమ్ : సంఘముగానున్న ద్రవిడమాలికయయిన ముప్పదియును

తప్పామే ఇఙ్గు ఇప్పరిశు ఉరైప్పార్ : తప్పక యీ కాలమున నిర్విఘ్నంబునం బఠించువారలు

ఈరిరణ్డు మాల్ వరైత్తోళ్ : నాల్గు విశాలపర్వతసదృశభుజంబులు

శెఙ్గణ్ తిరుముగత్తు : ఎఱ్ఱనికన్నులు గల శ్రీముఖంబుంగల

శెల్వత్తిరుమాలాల్ : ఉభయవిభూతినాయకుండయిన శ్రీవల్లభునిచేత

ఎఙ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱు ఇన్బు ఉఱువర్ : ఎందుం గృపంజెంది సుఖముంజెందుదురు.

వఙ్గక్కడల్ కడైన్ద మాధవనై — సముద్రమును దరచుచో విరావ నుండు నోడలున్నై తము గడలకొండెడు నడచిన చాతుర్యముట్లు త్రచ్చుచో సర్వత్ర భ్రాంతంబై సముద్రమందెల్ల నోడయె గానవచ్చుట యనియుం జెప్పవచ్చును. ప్రయోజనాంతరపరులకు నయితము మేను నొవ్వం గడలి ద్రచ్చి యపేక్షితసంవిధానముం జేయు శీలవంతుండనుట. 'విణ్ణపర ముదుణ్ణానుత్తిల్ వరున్ పెణ్ణముదుణ్ణ వెమ్బెరుమాన్' అని దేవతలమృతము గ్రోల నమృతంబుకంటెను మేలుగావచ్చు నింతియను నమృతంబు వడసిన మాస్వామి యనుచెప్పున దేవకార్యంబుపేర శ్రీదేవియను నమృతంబు వడయం ద్రచ్చి సాపాదమృతంబు దాగ్రోలి బ్రహ్మాదులకు నసారం బిచ్చిన క్షీరాబ్ధిమథనకర్తం జెప్పంబడె చూరివారి కార్యంబుపేరం బెన్న పడుచులం బడయంగోరి నోమును సంఘటించిన శ్రీకృష్ణస్వభావంబు చెప్పంబడుచున్నది. ఆశ్రయణీయమును భోగ్యమునై యుండు తత్త్వము లక్ష్మీసనాథంబుగాన నాశ్రయించువారలు క్రిందటినేరంబులం దలంచి నెరవం బనిలేదనుట.

కేశవనై — విరోధినిరసనస్వభావుని, స్త్రీత్వప్రయుక్తస్వాతంత్ర్యాన్యశేషత్వంబులం బోదోలినవాని.

**తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిళైయార్ శెన్ఱిఱైఞ్జి** — కృష్ణసంశ్లేషశీతలవికసితముఖులనుట, 'కదిర్ మదియమ్పోల్ ముగత్తాన్' అని యక్కడంజెప్పినది యనభిభవనీయత్వముంబట్టి - ఇందనుకూలులకే యైన మొగంబుగాన చంద్రశ్రీముఖమగుటంబట్టి యది యనుభవించువారిదియుం జంద్రశ్రీముఖమనుచున్నారు. ఇట్లే 'మదిముగమడన్దైయర్' అనంబడెంగదా. 'శూడగమే తోళ్వళై యే' ఇత్యాదిగా దాముగోరి నట్లితండుంచిన యాభరణంబులు గలవారై యితండు వచ్చువరకు నుండు తాళిమిలేక వచ్చి మంగళాశాసనంబు చేసి, కృష్ణవిషయాకారార్హత

కాని దానంగలిగిన తేజోవిశేషము ... ఉం—భారకంబుగాం ... రనియుం జెప్పవచ్చును.

అజ్ఞు అప్పురై కొణ్ణనాళ్ తై — సోకలకై వావ్యా ... బన వ్యాజమింతియు,

అణిపుదువై పై వ్రజ్ఞనాల తజ్ఞా యల్ నట్టల్ పిరాన్ కోదై కొన్న— బ్రాహ్మణులకుం దామర పేరు (మాల) చెప్పంబడినదిగదా, 'స ... వాచ వ్యాసః పారాశర్యః' (శ్రు) అని పరాశరపుత్త్రుండగు వ్యాసుండన్నట్లు ఆ వ్రత తెలుపుటకై పెరియాళ్వార్ వారి కూతురనుట.

శజ్జత్తమిళ్ మాలై ముప్పదుమ్ — 'కట్టుమ్ కోళాయిరమ్' అని సంఘంబులు పరిగ్రహించు సహస్రంబన్నట్లు గొల్లపల్లెనున్న గోపికలు గుంపుగుంపులై యనుభవించిన ప్రబంధంబనియుం జెప్పుదురు. భూదేవి యాండాళయినట్లుగానే యుపనిషత్తులే ద్రవిడమాలిక యయినట్లున్న దంట. పావనమును భోగ్యంబునై యున్నదనుట.

తప్పామే—ఒక్క—పాశురంబును విడువక. అనర్ఘరత్నంబులంగూర్చిన మాలికలో నొక్క—రత్నంబు కొదువయయినను శోభ చెడునుగదా. అట్లే గ్రంధంబున నే యొక్క—పాశురంబు గొదువయయినను మిక్కిలిలోపంబగుననుట.

ఇజ్ఞు ఇప్పరిశు ఉరైప్పార్ — ఈ సంసారంబున అనియుం జెప్ప వచ్చును - గొల్లపల్లెలోని పశువులు తామె కృష్ణానుభవము గాంచిరి - ఆండాళనుకరించి కాంచెను. ఈ ప్రబంధంబు నేర్చినవారలకు నీ ఫలంబు గలుగునట.

ఈరిరణ్డు మాల్వరై త్తోళ్ శెజ్గణ్ తిరుమాగత్తు చ్చెల్వత్తిరుమాలాల్—ఇది పాడినచో భుజంబులుబ్బునంట. అలభ్యలాభంబునం గన్నులు రాగయుక్తంబులగునంట. ఈ ప్రబంధంబున ద్వయమంత్రంబునందట్లె మొదలం దుదింగూడ శ్రీసంబంధంబు సెప్పంబడినది.

ఎఙ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱు ఇన్బు ఉఱువర్ — దృష్టాదృష్టఫలముల రెంటను శ్రీయుం దాను సంనిహితుండగునట్లు ప్రసాదంబువడసి భగవత్సంశ్లేషానందంబుం జెందుదురఁట ఇప్పాశురంబులంగొని మనము వెడలినను వత్సములేనిగోవు చేటపెయ్యాపం గనికరించునట్లు కనికరించుననియుఁ దెల్లవారలేచి ముప్పదిపాశురంబులు కాని అట్లు చేయంజాలనిచో 'చిఱ్ఱఞ్ చిఱుకా'లను పాశురంబు కాని నందుకొనం జాలనిచో నిది యనుసంధానంబు సేయుచు మేమున్నవిధంబైనం దలంచునది యని భట్టరానతిచ్చెనఁట.

ఇది శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుఁగారిచే

రచియింపంబడిన ప్రాబోధికగాథాత్రింశద్వ్యాఖ్యానము.





శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

# మణివర్ణునకు నొక మణిమాల

వ్రతము నాచరింపఁ గుతూహలపడు వారల నందఱిని మొత్తముగ నాహ్వానించునది — మొదటిపాశురము. ఇందు వ్రతాచరణమునకుఁ దగిన కాలమును వినుతించుచున్నారు; నోము నోచువారలఁ బొగడుచున్నారు; వీరలకోరికల నీడేర్చు శ్రీ కృష్ణస్వామిని నుతించుచున్నారు.

ఇట్లు అనుష్ఠింపఁబడు నోమునకుండదగు నియమముల - అనఁగా— ప్రవృత్తి, నివృత్తిరూపములగు కార్యాకార్యనియమముల విశదీకరించునది - రెండవపాశురము.

నోమునోచుటచే లోకములకు గలుగు ఫలముల నిరూపించునది- మూఁడవపాశురము. 'సర్వము శ్రీ కృష్ణస్వామియే' అని అధ్యవసించి యుండు గొల్లపడుచులు నోమునోవ ననుమతినొసంగిన లోకులకు మంచి

వర్షము వర్షించి సుభిక్షము గలుగును — అని యభివర్ణించు చున్నారు. అసూయాదు లిసుమంతయును లేక, అనుమతి నొసంగిన మహోదారులు గదా వారలు ? కండ్లయెదుటనే ఫలము సిద్ధించును — అనుచున్నారు.

నాలుగవపాశురమున — వానదేవునిఁ బిలచి దేశమంతటను బాగుగ వర్షింప నియమించుచున్నారు. ఇట్టిశక్తురాంద్రు నియమించుకృత్యముల శ్రీకృష్ణస్వామియే, వారలకు కొంగుబంగారమై, పరాధీనుడై, నిత్య కింకరుడై నెరవేర్చుచుండ, ఇఁక వర్షము మొదలగువాని అధిదేవతలు దాసానుదాసులై పనిచేయుదురు — అనునది చెప్పవలయునా ? ఇది భక్తి ప్రకర్షపు తీర్మానము.

ఐదవపాశురమున — వ్రతమునకుగలుగు ప్రతిబంధకముః లన్నియును, సర్వేశ్వరుని సేవించి, కీర్తించి, చింతించిన, పటాపంచలగును — అను చున్నారు. భగవానుని అనుభవము — ప్రతిబంధములకెల్లను బలవత్తర ప్రతిబంధక మగును — అని భావము.

భగవదనుభవమును భాగవదనుభవముతోఁ జేర్చి అనుభవింప వలయునని, ఇటుపై పదిపాశురములచే (6-వ పాశురము మొదలు 15-వ పాశురమువఱకు) తమకు సరిసమానులను (భగవదనుభవసహకారులను) మేల్కొలుపుచున్నారు.

నోముల తీరుతియ్యముల నెఱుంగనిదై యుండు, క్రొత్తగ భగవ త్సంబంధమును బొందిన తలిరుబోడిని మేల్కొలుపుచున్నారు — ఆఱవ పాశురమున. తరువాతిపాశురమున — తద్రసజ్ఞురాలై యుండియు, మఱచి నిద్రించు లలనామణిని మేల్కొలుపుచున్నారు. ఎనిమిదవపాశురమున — నేత్రపేయమై యుండు అందకత్తెను మేల్కొలుపుచున్నారు. తొమ్మిదవ పాశురమున — "శ్రీకృష్ణస్వామి వచ్చునపుడు రానిమ్ము" అని అనాదరించి యుండు యువతిని మేల్కొలుపుచున్నారు. పదియవపాశురమున — శ్రీ కృష్ణభక్తియందు నాయికయై యుండు యువిదెను మేల్కొలుపుచున్నారు.

తదనన్తర పాశురమున — "వానిని బొందుటకు నే నా నోము నోచెదను? కావలసియున్న, అతఁడే నోమునోచి రానిమ్ము" అను తీర్మానముతోఁ నుండు రమణీమణిని మేల్కొలుపు చున్నారు. పండ్రెండవ పాశురమున — శ్రీకృష్ణస్వామికి 'ఇతఁడొక లక్ష్మణస్వామి' అని యెంచబడునట్లు, ఒకక్షణకాలమైనను విడువక, ఎల్లకైంకర్యములను నిర్వహించుచు, సిరిసంపదలతోఁ దులదూగుచుండువాని చెల్లెలగు ముద్దరాలిని మేల్కొలుపు చున్నారు. తన సోయగన్నుల సొబగునకు మురిసిపోవుచుండు మృగాక్షిని మేల్కొలుపుచున్నారు — పదిమూఁడవ పాశురమున.

"మిమ్ముందఱిని నేనేవచ్చి మేల్కొల్పెదను" అని బీరము లాడి, మైమఱచి నిద్రించుచుండు ఒకకైను మేల్కొల్పుచున్నారు — పదునాల్గవ పాశురమున. ముందొక 'మృగాక్షి'ని మేల్కొల్పినయెల, ఇపుడు నొక 'కీరవాణిని' ని మేల్కొలుపుచున్నారు — పదునైదవ పాశురమున. "పడుచులందఱును నొకటిగఁ జేరి మనవాకిట వచ్చి నిలతురు గాక, చూచెదము" అని యెంచి పరుండియున్నది — ఈ యంగనామణి.

ఈవిధముగ, పదిపాశురములచే పలుతెఱంగులగు మనోభావములచే పరిమిళితలగు భక్తురాండ్ర మేల్కొలిపికొనుచు, అందఱును గలసి శ్రీ నందగోపుల తిరుమాళిగ (దివ్యభవనపు) వాకిట వచ్చి చేరిరి. ఇచ్చట, ద్వారపాలకులగు — భవనరక్షకుని, తోరణద్వారరక్షకుని మేల్కొలిపి, వారి యనుమతిని బొంది, భవనమున ప్రవేశించుచున్నారు.

తదుపరి, తాము శ్రీకృష్ణస్వామి కొక కావలివాడుగ నాదివ్యభవనపు ప్రాంగణమున మంచముపై పరుండియుండు శ్రీ నందగోపస్వామిని మేల్కొలుపుచున్నారు; లోపలిభాగమున నుండు మంచముపై పిల్లవానిప్రక్కన, అతని నక్కునఁ జేర్చుకొని ప్రీతిమీఱ పరుండియుండు పరమభాగ్యాధిదేవతయగు శ్రీ యశోదాదేవిని మేల్కొలుపుచున్నారు.

తదనన్తరము, శ్రీ కృష్ణస్వామిని మేల్కొలుపుచున్నారు. అంతలోపల స్మృతిసభినయించి, "ఆహా! క్రమము దప్పితిమే!" యని నాలుకc గఱచుకొని, క్రమప్రాప్తికై శ్రీ కృష్ణస్వామికి అంగరక్షకుcడుగ ప్రక్కన పరుండియుండు శ్రీ బలదేవుని మేల్కొలుపుచున్నారు. ఇట్లీ నలువురను మేల్కొల్పుట — పదునేడవ పాశురమున.

దానిప్రక్క పాశురమున — శ్రీ నీళాదేవిని పురుషకారముగ జేసికొని, ఆమె పురుషకారపురస్సరముగ శ్రీ కృష్ణస్వామిని ఆశ్రయించుటయే సరియైన క్రమము — అని నిర్ధరించుకొని, శ్రీ నప్పిన్నైపిరాట్టి (నీళాదేవి)ని మేల్కొల్పుచున్నారు.

పై రెండు పాశురములయందును — తమ్మాశ్రయించువారల మనోరథముల నీడేర్చుటలో "నేనుముందు, నేనుముందు" అను "అహమహమిక"తో ముందంజవేయుచున్న కరుణామూర్తియగు శ్రీ నీళాదేవిని, ఆమె ప్రియవల్లభుcడగు శ్రీ కృష్ణస్వామిని మేల్కొలుపుచున్నారు.

తదనంతరపాశురమున — శ్రీ కృష్ణస్వామిని మేల్కొలిపి, "నీదివ్యకల్యాణగుణములకు దాసులమై తనుదెంచితిమి" అని మనవిచేయుచున్నారు. ఇరువదిరెండవ పాశురమున — "అభిమానము నశింప, నీ కటాక్షమే ధారకముగ వచ్చితిమి; మా యాశతీర మెల్లమెల్లగc గటాక్షింపవలయును" అని శ్రీ కృష్ణస్వామి పాదపద్మముల సన్నిధిలో ప్రణమిల్లి మొఱలిడుచున్నారు.

ఇరువదిమూcడవపాశురమున — "సింహాసనమున విజయముచేసి, పేరోలగముననుండి, మే మేతెంచినకార్యమును పరామర్శింపగలరు." అని ప్రార్థించుచున్నారు.

వీరిప్రార్థన నాలకించి, వారలఁబాలింప, అందచందములుమీరఁ, మృదుమధుర పదవిన్యాసములతో నడచివచ్చి, తన దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును గండ్లారగాంచి ధన్యులౌనటుల సాక్షాత్కరించి, దివ్య సింహాసనమున వేంచేసియుండు మహోపకారకునికి మంగళాశాసనమును పాడుచున్నారు — తరువాతి పాశురమున.

ఇరువదియైదవపాశురమున — తాముయాచించివచ్చిన కార్యమును విన్నవించుకొనుచున్నారు. "నోమునకుఁ గావలసిన యుపకరణములు — ఇవి యివి" అని పేర్కొనుచు, వానిని యనుగ్రహింపఁ బ్రార్థించు చున్నారు — ఇరువదియాఱవ పాశురమున. వ్రతము పూర్తియైనతరువాత పొందు సమ్మానమును విజ్ఞాపించుకొనుచున్నారు—తరువాతిపాశురమున.

ఇరువదియొనిమిదవ పాశురమున — తమ నికర్షమును, అతని ప్రకర్ష మును విన్నవించుకొనుచు, అతనితోడఁ దమకుండు సంబంధమును గీర్తించుచు, అపరాధక్షామణమును జేసికొనుచున్నారు ; అనఁగా— తప్పుల మన్నింపవలయునని ప్రార్థించుచున్నారు.

వీరి పరమోద్దేశము — ఈ ప్రబంధమునకు పరమ తాత్పర్యము — ప్రకటితమగుచున్నది—ఇరువదితొమ్మిదవపాశురమున. ఇందు "ఉన్ఱన్నోడు ఉత్ఱోమే ఆవోమ్" (నీతోడ సంబంధము గలవారమగుదుము—నీకు అనన్యార్హశేషభూతులమగుదుము). "ఉనక్కే నామ్ ఆట్చెయ్‌వోమ్" (దేవరవారికే నిత్యము కైంకర్యముఁ జేయఁగలవారము). "మత్తై నమ్ కామజ్గళ్ మాత్ఱు" (ఇతరములైన మాకోర్కెలను మాన్పుము) అని ప్రార్థించి, తమ మనోరథమును పూర్తి జేసికొనుచున్నారు.

గోపికలు పొందిన ఇట్టి యీ భగవదనుభవమును శ్రీ ఆండాళమ్మవారును పొందుచున్నారు — తమ భావనాప్రకర్షమువలన.

అట్టి పరమార్థస్థితిలో నా యానందపరీవాహ రూపముగ శ్రీ ఆండాళమ్మవా రానతిచ్చిన ఈ దివ్యప్రబంధమును అనుసంధించి యను సంధించి, ఆ భక్తిభావప్రబోధితులై, ఇప్పటికిని, ఎల్లప్పుడును, ఎల్లవార లును, ఆ యాశ్రితకల్పతరువగు శ్రీ శ్రీనివాసుని పరమానుగ్రహమును బొంది, పరమానంద నిర్భరులగుదురు — అను ఫలశ్రుతియే — కడపటి పాశురము.





కోదై పిఱన్దవూర్ కోవిన్దన్ వాఴుమూర్
శోదిమణిమాడమ్ తోన్ఱుమూర్, నీదియాల్
నల్లపత్తర్ వాఴుమూర్ నాన్మఱైగ ళోదుమూర్,
విల్లిపుత్తూర్ వేదక్కోనూర్.

పాదగఙ్గళ్ తీర్క్కుమ్ పరమ నడికాట్టుమ్,
వేదమనైత్తుక్కుమ్ విత్తాగుమ్, కోదైతమిఴ్
ఐయైన్దు మైన్దుమ్ అఱియాద మానిడరై,
వైయమ్ శుమప్పదుమ్ వమ్బు.



తిరువాడిప్పూరత్తు చ్చెగత్తుదిత్తాళ్ వాఴియే,
తిరుప్పావై ముప్పదుమ్ శెప్పినాళ్ వాఴియే,
పెరియాఴ్వార్ పెఱ్ఱెడుత్త పెణ్పిళ్ళై వాఴియే,
పెరుమ్బూదూర్ మామునిక్కు ప్పిన్నానాళ్ వాఴియే,
ఒరునూఱ్ఱు నాఱ్పత్తుమూన్ఱురైత్తాళ్ వాఴియే,
ఉయ రరఙ్గర్క్కే కణ్ణియుగన్దళిత్తాళ్ వాఴియే,
మరువారున్దిరుమల్లి వళనాడి వాఴియే,
వణ్పుదువైనగర్ క్కోదై మలర్ప్పదఙ్గళ్ వాఴియే.



తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాలయమున ముద్రింపబడినది. కా. 2000, 19–10–